# కావ్యపుష్పాంజలి

(ఉస్మానియా విశ్వవిద్యాలయము—ప్రీ-యూనివర్సిటీ పరీక్ష)

## తెలుఁగు పాఠ్యము

[ప్రాంతీయ భాషా విభాగము]



కూర్పరి

శిరోమణి, విద్వాన్ చెలమచెర్ల రంగాచార్యులు

సంస్కృతాంధ్రోపన్యాసకుఁడు, ప్రభుత్వకళాశాల-ఓరుగల్లు



సోల్ ఏజంట్సు

వేంకట్రామ అండ్ కో.,

సికింద్రాబాదు-వరంగల్లు.

౧౯౫౬ వెల ఐ. జి. ౨—౮—౦

# మనవి

కళాశాలలలోఁ జదువు విద్యార్థులకు ప్రాంతీయ భాషయో, దానితో సన్నిహిత సంబంధముగల యొక ప్రాచీనభాషయో నిర్బంధముగాఁ బఠింప వలసి నట్లొక నియమము విశ్వవిద్యాలయము పాఠ్యనియమావళిలోఁ జేర్పఁ బడుట ముదావహము. ఇది నిజముగా నొక ముందడుగు. ఇట్టి మార్పు ప్రజ లెంతకాలము నుండియో కోరుచున్నారు. ఇది వారుచేసిన కృషికి ఫలితము. మాతృభాషను జదివి యందలి సారస్వతామోదము ననుభవించు నవకాశ మును విద్యార్థులు సదుపయోగము గావించుకొన నుత్సుకులై యుండుట సహజము. అట్టివారి కుపకరించునట్లుగా ఈ 'కావ్య పుష్పాంజలి' కూర్పఁ బడినది. దీనిలో పద్యభాగము-గద్యభాగమునని రెండు భాగములున్నవి. పద్య భాగములో భిన్నకాలములకుఁ జెందిన ముగ్గురు మహాకవుల కావ్యఖండములు కూర్పనైనవి. కవితా మాధుర్యమునకు, విషయమహత్తతకును సమ ప్రాధాన్య మీయఁబడినది.

విద్యార్థుల నైతిక జీవితమున కాదర్శముగా నుండఁదగిన సన్న్యాయార్యాని భీష్మచరిత్రము; కథా ప్రధానము, ఆంధ్రచరిత్రకు సంబంధించినదియునగు కేతనకవి మంత్రగుప్తవృత్తాంతము; శైలీశీల సందర్భానుసరమగు భాస్కరుని విభీషణు శరణాగతియు నిందు సమకూర్పఁబడినవి. గద్యభాగములో సుప్ర సిద్ధరచయితల రచనలకు స్థానమీయఁబడినది. విద్యార్థులకు విషయ పరి జ్ఞానముతోఁబాటుగా, రచనాపాటవముకూడ చక్కగా నలవడుట కనువుగా విమర్శనాత్మకములు, జీవిత చరిత్రలు, చారిత్రకములు, సాంఘికములు, వీరగాథలు నను వీటి విషయవిభాగము గావించి యొక్కొక్క రచనకు నిందు సముచితప్రదేశ మొసఁగఁబడినది. ఈ కావ్యపుష్పాంజలి సహృదయుల యామోదమును బడసి విద్యార్థుల కుపకరించునని యాసించుచున్నాను.

## కృతజ్ఞత

సుప్రసిద్ధులగు పలువురు గ్రంథకర్తల రచన లిందు సాదరముగాఁ గూర్పఁబడినవి. వారికందఱికిని కృతజ్ఞతాపూర్వకములగు నమోవాకములు.

కూర్పరి

# విషయసూచిక

## పద్యభాగము



## గద్యభాగము



## అనుబంధము

# ౧. శ్రీమదాంధ్ర మహాభారతము

## భీ ష్ము ని  చ రి త్ర ము.

[ఆదిపర్వము అ. ౪.]

—నన్నయభట్టారకుఁడు.

వ. ... ... ... గంగాదేవి నిజరూపంబును, వసూత్పత్తియు, స్వర్గగమన నిమిత్తంబును, గాంగేయు జన్మస్థితియునుం జెప్పి దేవవ్రతుండయిన యిక్కుమారుండు పెరుఁగునంతకు నాయొద్దన యుండెడుమని శంతను నొడంబఱచి కొడుకుం దోడ్కొని యరిగిన విస్మయంబంది శంతనుండు దానితోడి యిష్టోపభోగంబులం బెద్దకాలంబు సన్నను నది యల్పకాలంబకా వగచుచు హస్తిపురంబునకు వచ్చి ౧

మ. తన కాజ్ఞావశవర్తులై మహి సమస్త క్షత్త్రవంశేశు లె
ల్లను భక్తిం బనిసేయుచుండఁగ విశాలంబైన సత్కీర్తి ది
గ్వనితామౌక్తికదామలీల వెలుఁగన్ వారాశిపర్యంత భూ
జన రక్షాపరుఁడయ్యె శంతనుఁడు రాజద్రాజధర్మస్థితిన్. ౨

వ. ఇట్లు లోకంబెల్లఁ దన ధర్మచరిత్రంబుఁ బొగడుచుండ సుఖంబుండి యాతం డొక్కనాఁడు మృగయావ్యాజంబున గంగాసమీపంబునం జనువాఁడు దన్నుం బాసి తనుత్వంబుఁ దాల్చినట్లు గడునల్పప్రవాహయై యున్న గంగానదిం జూచి యిది యేనిమిత్తంబోయనుచుం గొండొక నేల యరిగి. ౩

తరలము. కనియె ముందట నమ్మహీపతి గాంగసైకత భూములం
బనుగొనన్ ధనువభ్యసించుచు బాణసంహతి సేతులం
ఘనముగా నమరాపగౌఘముఁ గట్టియున్న కుమారు న
త్యనఘు నాత్మసమాను నాత్మజు నాపగేయు మహాయశున్. ౪

## గంగ భీష్మునిందెచ్చి శంతనున కిచ్చుట.

వ. కని పుట్టిననాఁడ చూచినవాఁడు గావున నప్పుడెఱుంగనేరక విస్మయాకులిత చిత్తుండయియుండె. కుమారుండు నాతనిఁ జూచి తండ్రిగా నెఱుంగ నేరకయు నిసర్గస్నేహ మోహితుండునయి యుండె. అంత, ౫

తే. దివ్యభూషణాలంకృత దేహుఁడైన
కొడుకు వలపలిచేయూఁది కోమలాంగి
దివ్యనది ప్రీతితోఁ జనుదెంచి పతికిఁ
జూపి భూనాథ వీఁడు నీ సూనుఁడనియె. ౬

వ. మఱియు, ౭

సీ. సాంగంబులగుచుండ సకల వేదంబులు
సదివె వసిష్ఠుతో సర్వధర్మ
శాస్త్రాది బహువిధ శాస్త్రముల్ శుక్ర బృ
హస్పతుల్ నేర్చినయంత నేర్చెఁ
బరమాస్త్రవిద్య నప్పరశురాముండెంత
దక్షుఁ డంతియ కడు దక్షుఁ డీతఁ
డాత్మవిజ్ఞానంబునందు సనత్కుమా
రాదుల యట్లితఁ డనఘమూర్తి
యెప్పెఁగొనుము వీని నుర్వీశ యని సుతు
నిచ్చి గంగ చనిన నెఱిఁగి తనయు
నెమ్మిఁ దోడుకొనుచు నిధిగన్న పేదయు
పోలె సంతసిల్లి భూవిభుండు. ౮

వ. తన కరిపురంబునకు వచ్చి సకలరాజన్య ప్రధాన సమక్షంబున గాంగేయునకు యౌవరాజ్య పట్టాభిషేకంబుఁజేసి కొడుకుతోడి వినోదంబులం దగిలి నాలుగు వత్సరంబులనన్య వ్యాపారుండై యుండి యొక్కనాఁడు యమునాతీరంబున వేఁట లాడుచుం గుర్విమ్మరు వాఁడపూర్వ సురభిగంధం బాఘ్రాణించి దాని వచ్చినవల నారయుచుంజని యమునానదితీరంబున. ౯

క. కనకావదాత కోమల
తనులతఁ దనుమధ్యఁ గమలదళనేత్రను యో
జనగంధి నవనినాథుఁడు
గనియెను సురకన్యవోని కన్నియ నంతఙ. ౧౦

ఉ. దాని శరీరసౌరభము దాని విలోల విలోకనంబులుఁ
దాని మనోహరాకృతియు దాని శుచిస్మిత వక్త్రకాంతియుఁ
దాని విలాసముం గడు ముదంబునఁ జూచి మనోజబాణ సం
తానహతాత్ముఁడై నృపతి దానికి నిట్లనియెన్ ముదంబునన్. ౧౧

ఉ. ఎందులదాన వేకతమ యియ్యమునానది నోడసల్పుచున్
సుందరి నీకు నిట్లునికి సూడఁగఁ దా నుచితంబె నావుడున్
మంద మనోజ్ఞహాసముఖమండల మెత్తి మృగాక్షి సూచి సం
క్రందన సన్నిభున్ నృపతిఁ గన్యక యిట్లనిపల్కెఁ బ్రీతితోన్.

వ. ఏను దాశరాజుకూఁతురఁ దండ్రినియోగంబున నిక్కార్యంబు ధర్మార్థంబు సేయుచుండుదు ననిన దాని యభినవరూపసౌందర్యంబులు దొల్లియు విని యెఱింగిన వాఁడై యక్కోమలిం గామించి దాశరాజుకడకుంజని తన యభిప్రాయం బెఱింగించిన నతండును సంతసిల్లి శంతను నత్యంతభక్తిం బూజించి యిట్లనియె. ౧౩

తే. పుట్టినప్పుడ కన్యకఁ బోలునట్టి
వరున కిచ్చుట యిది లోకవర్తనంబు
వసుమతీనాథ నీ యట్టి వరున కిచ్చి
ధన్యులముగామె యిక్కన్యఁ దద్ద నెమ్మి. ౧౪

వ. అయినను నాడెందంబునం గలదానిం జెప్పెద, నిక్కన్యక నీకు ధర్మపత్నిఁగాఁ జేయునట్టి యిష్టంబు గలదేని నా వేఁడిన దాని నిమ్మనిన శంతనుండు దాని నీనగునేని నిచ్చెదఁ గాని నాఁడీనేర నది యేది సెప్పుమనిన దాశరా జిట్లనియె. ౧౫

మధ్యాక్కర. భూపాల నీకు నిక్కోమలివలనఁ బుట్టిన సుతుఁడు
నీ పరోక్షంబున రాజు గావలె నెమ్మి నిట్లేఁగ
నోపుదే యనిన శంతనుఁడు గాంగేయు యువరాజుఁ దలఁచి
యీ పల్కు దక్కఁగ నొండు వేఁడుమ యిచ్చెద ననిన. ౧౬

వ. నాకు నొండెద్దియు నిష్టంబు లేదనిన విని దాశరాజుచేతఁ బ్రతిహత మనోరథుండయి క్రమ్మఱి నిజపురంబునకు వచ్చి శంతనుండు చింతాక్రాంతుండై సత్యవతిని తలంచుచు నివృత్తకార్యాంతరుండయి యున్న నొక్కనాఁడు గాంగేయుండు తండ్రి పాలికి వచ్చి యిట్లనియె. ౧౭

చ. భవదభిరక్షితక్షితికి బాధయొనర్పఁగ నోపునట్టి శా
త్రవనివహంబు లేదు వసుధాప్రజ కెల్ల ననంత సంతతో

త్సవములు రాజులెల్ల ననిశంబు విధేయులు నీకు నిట్లు మా
నవవృషభేంద్ర యేలొకొ మనఃపరితాపముఁబొందియుండఁగన్. ౧౮

వ. అనిన విని పెద్దయుం బ్రొద్దు చింతించి శంతనుండు కొడుకున కిట్లనియె. ౧౯

క. వినవయ్య యేకపుత్త్రుఁడు
ననపత్యుఁడు నొక్కరూపయని ధర్మవులన్
విని నీకుఁ దోడు పుత్త్రుల
ననఘా పడయంగ నిష్టమయినది నాకున్. ౨౦

క. జనవినుత యగ్నిహోత్రం
బును సంతానమును వేదములు నెడతెగఁగాఁ
జన దుత్తమవంశజులకు
ననిరి మహాధర్మనిపుణులైన మునీంద్రుల్. ౨౧

క. నీ వస్త్ర శస్త్ర విద్యా
కోవిదుఁడవు రణములందుఁ గ్రూరుఁడ వరి వి
ద్రావణ సాహసికుండవు
గావున నీయునికి నమ్మఁగానేర నెదన్. ౨౨

వ. బహుపుత్త్రార్థంబు యత్నంబు సేయవలయు వివాహం బయ్యెదనని విని గాంగేయుండు వృద్ధామాత్యపురోహిత సుహృజ్జనంబులతో విచారించి యోజనగంధి యందు రాజుచిత్తంబు తగులుట యెఱింగి యనేక రాజసైన్యసమేతుండయి దాశరాజు కడకుం జని మా రాజునకు సత్యవతిని దేవింగా నిచ్చునది యని యడిగిన నాతండును దేవవ్రతుం బూజించి నీవు ధర్మశీలుండ వర్థానర్థవిదుండవు, కార్యాకార్యసమర్థుండవు, గుర్వర్థంబు గన్యార్థివై వచ్చితివి. కావునం గృతార్థుండవైతి. ఎవ్వనియే వీర్యంబున నిక్కన్య యుద్భవిల్లె నట్టి యుపరిచరుండను రాజర్షి యీ సత్యవతి నొరులకీవలదు శంతనున కిచ్చునది యనుటం జేసి తొల్లి యసితుండయిన దేవలుండు గన్యార్థియై వచ్చి ప్రత్యాఖ్యాతుండయి యరిగె. ఇట్టి సంబంధం బెవ్వరికిఁ బడయునగు. ౨౩

క. వినుమైనను సాపత్న్యం
బను దోషము గలదు గాన నదియును నీచే
తన సంపాద్యము నీ వలి
గిన నడ్డమె పురహరాజ కేశవులైనన్. ౨౪

వ. ఆదోషంబెల్లు పరిహృతంబగునట్లుగా నీచిత్తంబునం దలంచి యివ్వివాహంబు ఘటియింపు మనిన గాంగేయుం డిట్లనియె. ౨౫

## భీష్ముఁడు రాజ్యంబొల్లక బ్రహ్మచర్యవ్రతంబుఁ బూనుట

చ. వినుఁడు ప్రసిద్ధులైన పృథివీపతులందఱు నే గురుప్రయో
జనమునఁ జేసితిన్ సమయసంస్థితి యీ లలితాంగి కుద్భవిం
చిన తనయుండ రాజ్యమును జేయఁగ నర్హుఁడు వాఁడ మాకు నె
ల్లను బతివాఁడ కౌరవకులస్థితికారుఁ డుదారసంపదన్. ౨౬

వ. అని సభాపతుల కెల్ల రోమహర్షంబుగా సత్యవ్రతుండయిన దేవవ్రతుండు పలికిన వెండియు దాశ రాజిట్లనియె. ౨౭

క. నీ వఖిల ధర్మమూర్తి వి
గావున నీకిట్లు చేయఁగా దొరకొనియెన్
భావి భవత్పుత్రు లిట్టిరె
నీ విహితస్థితియు సలుపనేర్తురె యనినన్. ౨౮

క. ధృతిఁ బూని బ్రహ్మచర్య
వ్రతము నతిఁ దాల్చితిని ధ్రువంబుగ ననప
త్యత యైనను లోకము లా
యతిఁ బెక్కులు గలవు నాకు ననుభావ్యములై. ౨౯

వ. అని యిట్లు దమతండ్రికి సత్యవతి వివాహంబు సేయుపొంటె నిజరాజ్య పరిత్యాగంబును, బ్రహ్మచర్యవ్రత పరిగ్రహంబునుం జేసిన దేవవ్రతు సత్యవ్రతంబునకు గురుకార్య ధురంధరత్వమునకు మెచ్చి దేవర్షి గణంబులు దేవతలు నాతనిపయిం బుష్పవృష్టిఁగురియించి భీష్ముండని పొగడిరి. దాశరాజును గరంబు సంతసిల్లి శంతనునకు సత్యవతి నిచ్చె. అంత ౩౦

మ. ఇనతేజుం డతిభక్తిఁ గాంచనరథం బెక్కించి యక్కన్యఁ దో
డ్కొని తెచ్చెం దనతల్లి సత్యవతినిన్ క్షోణీజనుల్ దన్ను బో
రనఁ గీర్తింపఁగ శంతనుండతి మనోరాగంబునం బొంద శాం
తనవుం డాతతకీర్తి హస్తిపురికిం దత్కౌతుకారంభుఁడై. ౩౧

వ. శంతనుండును బరమానురాగంబున సత్యవతి వివాహంబై యతిమాను షంబయిన యాభీష్ము సత్యవ్రతంబునకు సంతసిల్లి యాతనికి స్వచ్ఛందమరణంబుగా వరం బిచ్చి సత్యవతియందుఁ జిత్రాంగద విచిత్రవీర్యుల నిద్దఱుగొడుకులం బడసి వారలు సంప్రాప్త యావనులుగాకుండఁ బరలోకగతుండైనఁ దండ్రికి భీష్ముండు పరలోక క్రియలు నిర్వర్తించి చిత్రాంగదు రాజ్యాభిషిక్తుంజేసిన నాతండును నతివ్యాలోలుండై గర్వంబున నెవ్వరి సరకుగొనక సుర దనుజ గంధర్వాదుల నాక్షేపించుచున్న వానికి నలిగి చిత్రాంగదుండను గంధర్వపతి యుద్ధార్థియైవచ్చినం గురుక్షేత్రంబునందు. 3౨

క. నరగంధర్వాధిపుల
య్యిరువురు చిత్రాంగదులు సహింపక యని నొం
డొరుఁ దాఁకి వీఁకఁ బొడిచిరి
హిరణ్వతీతీరమున నహీనబలాఢ్యుల్. 33

క. వదలక మాయా యుద్ధా
తిదక్షుఁడయి వంచనోన్నతిన్ గంధర్వుం
డుదితరవితేజుఁ జిత్రాం
గదుఁ జంపె విచిత్రపత్త్ర కార్ముకహస్తున్. 3౪

వ. ఇట్లు చిత్రాంగదుండు గంధర్వనిహతుండైనఁ దత్పరోక్షంబున భీష్ముండు విచిత్రవీర్యుం గౌరవరాజ్యంబున కభిషిక్తుంజేసిన. 3౫

క. వసునిభుఁడు పైతృకంబగు
వసుధారాజ్యంబు భీష్మువచనమున గత
వ్యసనుఁడయి తాల్చెఁ దేజం
బెసఁగంగ విచిత్రవీర్యుఁ డిద్ధయశుండై. 3౬

వ. అట్టి విచిత్రవీర్యు నారూఢయావనుంజూచి భీష్ముండు వివాహయత్న పరుండయి తనచారులవలనం గాశీరాజదుహితల స్వయంవరోత్సవంబు విని ధనుర్ధరుం డయి రథంబెక్కి యొక్కరుండ వారణాసీపురంబునకుంజని యందు స్వయంవరంబునకు మూఁగిన రాజలోకంబెల్ల వెఱఁగుపడి చూచుచుండ నక్కన్యకలఁ దనరథం బెక్కించుకొని యెల్లవారలు విన నిట్లనియె. 3౭

క. నాయనుజునకు వివాహము
సేయఁగఁ గన్యాత్రయంబుఁ జేకొని బలిమిం
బోయెద నడ్డంబగు వా
రాయతభుజశక్తి నడ్డమగుఁ డాజిమొనన్. 3౮

వ. బ్రాహ్మంబు మొదలుగాఁగల యెనిమిది వివాహంబులయందు క్షత్రియులకు గాంధర్వరాక్షసంబు లుత్తమంబులు. స్వయంవరంబున జయించి వివాహంబగుట యంతకంటె నత్యుత్తమంబండ్రు గావున నిమ్మూఁగిన రాజలోకంబునెల్ల నోడించి యిక్కన్యలం దోడ్కొని నా చనుట యిది పరమధర్మంబయని కాశీరాజునకుఁ జెప్పి భీష్ముండు వీడ్కొనివచ్చునప్పుడు. 3౯

మ. నరనాగాశ్వవరూథ యూథములతో నానావనీనాథులు
ద్ధురులై యొక్కట నొండొరుంజఱచి యుత్తుంగానిలోదూక సా
గరసంక్షోభసమంబుగాఁ గలఁగి వీఁకన్ వీరులై తాఁకి యే
సిరి దేవవ్రతుపై నభోవలయ మచ్ఛిద్రంబుగా నమ్ములన్. ౪౦

క. వారల నందఱ రౌద్రా
కారుండై కసిమసంగి గాంగేయుఁడు దు
ర్వారపటు బాణనిహతిని
వీరాహవరంగమునకు విముఖులఁజేసెన్. ౪౧

క. నెఱి నుఱక వైరి వీరుల
నెఱఁకులు దూఱంగనేయు నృపపుంగవు నం
పఱ కోర్వక పిఱుఁదఁ జనిరి
వెఱచి విషణ్ణులయి సకలవిషయాధిపతుల్. ౪౨

వ. ఇట్లు నిఖిలక్షత్రియక్షయార్థం బలిగిన పరశురాముండునుంబోలెఁ గడు నలిగి పరశురామశిష్యుం డాక్షత్రియవర్గంబునెల్లఁజన శరధారావర్షంబునముంచి యోడించి యేక వీరుండయి వచ్చువాని పిఱుంద సమరసన్నద్ధుండయి సాల్వుండు ననుదెంచి. ౪3

## సాల్వుఁడు భీష్మునితో యుద్ధంబు సేయుట

ఉ. ఈవసుధాధినాథుల జయించిన యట్టిది కాదు చక్కనై
పోవక నిల్వు నాకెదిరి పోర మదీయధనుర్విముక్త నా

నావిధమార్గణో గ్రగహనంబున ద్విగ్భ్రమఁబొంద కెమ్మెయిం
బోవఁగఁబోలు నీకనుచుఁ బూరుకులోత్తముఁడాఁకె వింకతోన్. ౪౪

వ. భీష్ముండును దనరథంబు నివర్తింపించి సంచర్తనమయ సమవర్తియంబోలె నతిరౌద్రాకారుండయి నిలిచిన. ౪౫

చ. అనిలజవంబునం బఱచు నమ్మదనాగమెదిర్చి క్రమ్మఱిం
చిన పరికాడుఁబోలెఁ గురుసింహవరూథము నిట్లు గ్రమ్మఱిం
చునె యితఁడంచునుం దగిలి చూపఱు సాల్వునిపై విక్రమం
బొనరఁగ నల్గడం బొగడుచుండిరి విస్మయసక్తచిత్తులై. ౪౬

వ. అంత. ౪౭

క. ధృతిమెయి శతసంఖ్యయు దశ
శతసంఖ్యయు శతసహస్రసంఖ్యయును శతా
యుత సంఖ్యయుఁగా దేవ
వ్రతుమీఁదను సాల్వుఁడేసె వాఁడి శరంబుల్. ౪౮

క. ఘనభుజుఁ డన్నియు నడుమన
తునియఁగ వడినేసె వాని తురగచయ స్యం
దన సూతుల నొక్కొ కయ
మ్మునఁ ద్రెళ్ళఁగనేసె భరతముఖ్యుఁడు పోరన్. ౪౯

క. రథములు, రథ్యంబులు సా
రథియును వృథయైన భగ్నరథుఁడై భాగీ
రథి కొడుకుచేత విమనో
రథుఁడై సాల్వుండు నిజపురంబున కరిగెన్. ౫౦

వ. ఇట్లు సకలరాజలోకంబునెల్ల నక్రమంబున నోడించి సాల్వరాజు మందల విడిచి పరాక్రమలబ్ధలైన కాశీరాజు కూఁతుల నంబాంబాలికాంబికలం దోడ్కొని వచ్చి భీష్ముండు విచిత్రవీర్యునకు వివాహంబు సేయ నున్నంత నందుఁ బెద్దదియైన యంబ యిట్లనియె.
౫౧

ఆ. పరఁగ నన్ను సాల్వపతి వరియించినఁ
దండ్రిచేత పూర్వదత్తనైతి

నమ్మహీశునకు నయంబున నెయ్యది
ధర్మవెఱిఁగి దానిఁ దలఁపుఁ డీరు. ౫౨

## విచిత్రవీర్యుని వివాహము

వ. అనిన విని భీష్ముండు ధర్మవిదులయిన బ్రాహ్మణుల యనుమతంబున దాని సాల్వరాజున కిచ్చి పుచ్చి మహోత్సవంబున నయ్యిరువురు కన్యకల విచిత్రవీర్యునకు వివాహంబు సేసిన, ౫౩

ఉ. లాలితరూప యౌవన విలాస విభాసితలైన యంబికాం
బాలికలఁ వివాహమయి భారతవంశకరుండు గామ లీ
లాలలితానుభోగరసలాలసుఁడై నిజరాజ్యభారచిం
తాలసుఁడయ్యెఁ గామికి నయంబున నొండు దలంపఁబోలునే. ౫౪

వ. ఇట్లు సకల వ్యాపారరహితుండై కాశీరాజ దుహితల నయ్యిరువుర నతి ప్రణయ గౌరవంబునం దగిలి, ౫౫

సీ. అమల సుధారమ్య హర్మ్యతలంబుల
నవకుసుమామోద నందనములఁ
గృతకాద్రికందర క్రీడా గృహాంగణ
వివిధరత్నోజ్జ్వల వేదికలను
గలహంస కలనాద కమనీయ కమలినీ
దీర్ఘికా సైకత తీరములను
రమియించుచును గామరాగాదికాసక్తిఁ
జేసి శోషించి విచిత్రవీర్యుఁ

డమరపురికిఁ జనిన నతనికిఁ బరలోక
విధుల శాస్త్రదృష్టి వెలయఁ జేసె
నాపగాతనూజుఁ డఖిలబాంధవులయు
బ్రాహ్మణులయు తోడ భానునిభుఁడు. ౫౬

వ. మఱియు నత్యంత శోకార్ణవంబున మునింగిన తల్లిని మఱదండ్రను నాశ్వాసించి యరాజకంబయిన రాజ్యం బకళంకంబుగాఁ బ్రతిపాలించుచున్న కొడుకు నఖిల ధర్మవిదు గాంగేయుం జూచి సత్యవతి యిట్లనియె. ౫౭

క. శంతను సంతానంబును
సంతత కీర్తియును బిండ సత్కృతియును న
త్యంత మహీభారమును బ
రంతప నీయంద చిరతరంబై నిలిచెన్. ౫౯

చ. జననుత సర్వధర్మపులు సర్వజగత్పరివర్తన క్రమం
బును మఱి సర్వవంశములుఁ బుట్టిన మార్గము నీవ నిక్కవం
బనఘ యెఱుంగు దున్నత గుణాఢ్యుఁడవున్ భరతాన్వయావలం
బనుఁడవు నీవ నిన్నొకఁడు పంచెదఁ జేయుము మత్ప్రియంబుగన్.

క. ఇక్కురువంశంబున నీ
వొక్కరుఁడవ యున్నవాఁడ వుర్వీరాజ్యం
బెక్కటి సేకొని తేజము
దిక్కుల వెలిఁగింపు సంతతియుఁ బడయు మొగిన్. ౬౦

క. నిరతంబు బ్రహ్మ మొదలుగ
వరుసన యెడతెగక యిట్లువచ్చిన వంశం
బురుభుజ నీ వుండఁగ నీ
తరమున విచ్ఛిన్నమగుట ధర్మవె యనినన్. ౬౧

క. విని భీష్ముఁడనియె మీ కి
ట్లని యానతి యీయఁదగునె యెమ్మెయి నా ప
ల్కిన పల్కులు మఱి నా తా
ల్చిన వ్రతమును జెఱుపనంత చిఱుతనె చెపుమా. ౬౨

క. హిమకరుఁడు శైత్యమును న
ర్యముఁడు మహాతేజమును హుతాశనుఁ డుష్ణ
త్వము విడిచిరేని గుర్వ
ర్థము నా చేకొనిన సద్వ్రతంబు విడుతునే. ౬౩

వ. పృథివ్యాది పంచభూతంబులు గంధాది గుణంబుల నెట్లు విడువ వట్లు యేనును గురుకార్యంబున మీ వివాహార్థంబు సర్వజన సమక్షంబున నాఁడుసేసిన సమయస్థితి విడువ (నని తెలిపి తన సత్యవ్రతంబు నిల్పుకొనియెను.) ౬౪

# ౨. దశకుమార చరిత్రము

## మంత్రగుప్త వృత్తాంతము

[ ఆశ్వాసము ౧౧ ]

—కేతన

వ. రాజవాహన మహీవల్లభుండు మంత్రగుప్తు మొగంబు చూచిన నతండు సగౌర
ంబుగా నిట్లనియె. ౧

ఉ. ఏను గళింగదేశమునకేగి కళింగపురంబు చేరువన్
మానిత బిల్వసాంద్ర విపినంబునఁ బ్రేతవనంబుపొంత ని
ద్రానిరతుండనైన యెడ నచ్చట నొక్కరుఁ డొక్క కాంతతో
నా నడురేయి పల్కు పలు కల్లన నిట్లని సోఁకె వీనులన్. ౨

ఆ. పొద్దు వసుసమాలి సిద్ధులమందులు
చిచ్చులోనవైచి సిద్ధివడయఁ
దొడరి యయ్యగారు దొసఁగులఁ బెట్టెడుఁ
బోవవలయు నాకు నీవు నిలువు. 3

వ. అనిన విని యే నుత్సుకుండనై యాత్మగతంబున ౪

ఆ. వార లెవ్వ రిపుడు గోరెడి సిద్ధి యే
దేమి వేల్మిచంద మిపుడు వీని
నేలఁ బిలువఁబంచె నింతయు నెఱుఁగంగ
వలయునని తలంచి వాని పిఱుఁద. ౫

ఉ. అల్లన పోయి సాంద్రవిపినాంతర చారు శుచిస్థలంబునం
దెల్లని వ్రేలు గడ్డమును దీర్ఘజటాలియుఁ గ్రూరదృష్టులుం
బల్లశరీరమున్ భసితపాండు లలాటముఁ గల్గు తాపసుం
డుల్లసితాగ్నికుండమున హోమము సేయఁగఁ బొంచిచూచితిన్.

క. ఆ తపసి కింకరుండు వి
నీతిమెయిన్ మ్రోలనిలచి నిటలతటఘటితం
జేతులిడి మ్రొక్కుటయు నవి
నీతుండై యతఁడు పలికె నిష్ఠురవృత్తిన్. ౭

ఆ. ఈ కళింగనగరమేలెడు కర్దను
సంతిపురము సొచ్చి యతని తనయఁ
గనకరేఖఁ బట్టుకొనిరమ్ము పొమ్మన్న
నరిగి కింకరుండు నాక్షణంబ. ౮

శా. హాహాకారము లుద్భవిల్ల నొక కన్యారత్నముందెచ్చె దు
ర్మోహాంధుండయి క్రూరతాపసుఁడు సమ్మూర్ఛత్కృపాహీనతన్
స్వాహాకారము గూర్పఁగాఁ దలఁచి యుత్సాహం బొనర్పంగ నే
నాహోమాగ్నిశిఖాలికాజటిలు నాహారంబు గావించితిన్. ౯

ఉ. కింకరుఁ డంత నాకుఁ గడుఁ గీడ్పడి సిద్ధికిఁ గా నతండు ని
శ్శంకత నిజ్జగంబున నృశంసపటం బొగిఁ గట్టి దుష్క్రియా
లంకృతుఁడై యనేక విధులం దరుణీవధఁజేయుఁ గాన నీ
కింకకు నేఁడు లోఁబడియెఁ గిల్బిషవంతున కింతపెద్దయే. ౧౦

క. రేయుం బగలును నతనికిఁ
బాయక పనిచేసి యిడుమఁబడి విసివినచో
నాయొద్ది కిష్టదైవము
డాయఁగ నినుదెచ్చి సంకటముఁ బెడఁబాపెన్. ౧౧

క. పనుపుము పనిచిన పని గ్ర
క్కునఁ జేసెదననిన నేను గోమలి మగుడం
గొని చని యెప్పటిచోటన
యునుపుము నాకిదియ వేడ్కయుం గార్యంబున్. ౧౨

చ. అనవుడు రాజపుత్త్రి గళితాశ్రుల వక్త్రము దోఁగ సంభ్రమం
బునఁ బ్రణమిల్లి యిట్లనియెఁ బొచ్చెములేని దయాగుణంబునన్
నను ననలంబులోనికిఁ జనం జొరకుండఁగ గాచి యిప్పు డే
మని మదనానలంబునకు నాహుతిచేసెదు జీవితేశ్వరా. ౧౩

ఆ. ఏడుగడయు నీవ యెచటికి నరిగిన
నీకు నేను దోడినీడఁ బోలి
తగిలి వచ్చుదాన దయతోడ నన్నుఁ గొని
పొమ్ము పోకచూడఁ బోలదేని, ౧౪

క. చెలులుం బరిచారికలుం
గలరు తలంపులకుఁ దగిన కార్యము లెల్లం
దలకొని చేయఁగ నీ వి
మ్ముల మద్గృహమునకు రమ్ము మోదం బెసఁగన్. ౧౫

మ. అని నెయ్యం బొడఁగూడఁ బల్కుటయు రాగావేశమేపార న
వ్వనితారత్నముఁ జూచుచున్నఁగని భావజ్ఞాసియై కింకరుం
డనుమానింపక రండు లెండనుచు బాహాశక్తి శోభిల్లఁగా
వినువీథింగొనిపోయె మమ్ము హృదయావిర్భూతహర్షంబుతోన్.

క. ఆ కింకరునకుఁ బూజ ల
నేకవిధంబుల నొనర్చి యీ మే లెంతే
నీకతమున మాకిప్పుడు
చేకుఱె నని గారవించి చిత్తంబలరన్. ౧౬

వ. అతనిఁ బుచ్చి యనంతరంబ, ౧౭

శా. ఆ లీలావతి గ్రక్కునం జెలుల డాయంబోయి మేల్కొల్పి మం
దాలాపంబుల నంతయుం దెలిపి కన్యాగారగూఢస్థలిం
గేలీమజ్జన భోజనాదివిధు లక్లేశంబునం జెల్లు న
ట్లాలోకించి తగంగ నన్నునిచె నిట్లత్యంత మోదంబునన్. ౧౮

వ. విచ్చలవిడి విహరించుచున్నం గొన్ని దినంబులకు వసంతాగమం బగుటయు వనక్రీడాలాలసుండై కర్దనుం డంతఃపుర కాంతాసమూహంబును దుహితయు దత్సఖిజనంబులు వినోద సముచిత పరివారంబును దానును బయోధివేలావనభూమికిం జని తత్ప్రదేశంబున బహు దివసంబులు కేళి సలుపుచున్న సమయంబున ౨౦

సీ. ఆంధ్రదేశాధీశుఁడగు జయసింహుండు
ప్రతిభటుండగుట రంధ్రంబు వేచి
బలిమిఁ దత్పరివార పరిగతులై తన
వేగులు చెప్పిన వివిధయాన
పాత్రముల్ సమకట్టి బలములు దానును
వారాశిలోఁ జొచ్చి తీరభూమి
డిగ్గి మోహరములు డగ్గనఁ దీర్చి కం
పిత మహీతలుఁడయి బిట్టుమండి

లీల నేమఱయున్న కళింగవిభునిఁ
గామినీ జనసహితంబుగాఁగ నడలఁ
బట్టి కలములలోపలఁ బెట్టుకొని స
మగ్ర మదగర్వ మొప్పంగ మగుడ నరిగె. ౨౧

వ. ఇట్లు కర్దనుండు బగతున కడిపడిన నరాజకంబయ్యును దదీయ రాజ్యం బమాత్యమంత్రి భృత్య చాతుర్యంబున సురక్షితంబయ్యె. చతురంగబలబాహుళ్యంబు నొందకయు నమాత్యుండు దానోపాయనమ్ముల నయ్యాపదకుం బ్రతివిధానం బాచరించుచుఁ గడపట నట్టి సమయంబున, ౨౨

ఆ. కనకరేఖఁ గేళి కనిచిన యది యాది
గాఁగ నాకుఁ గన్యకాపురమున
నుండరామి వీట నొండు వేషంబునఁ
దిరుగుచుండి యెల్లఁ దెలియ నెఱిఁగి. ౨౩

వ. ప్రియావియోగ సంతాపం బంతరంగమునకు దుస్సహంబగుటయు. ౨౪

ఉ. ఆ జయసింహు పట్టణమునం దొక చందమునం జరించి యం
భోజదళాక్షి నెట్లయినఁ బొందుదుఁ బొమ్మని యుత్సహించి పోఁ
గా జటిలుం డొకం డెదురుగాఁ జనుదెంచిన నేను మార్గ ధా
త్రీజమునీడ కాతని నతిప్రియభావనఁ బిల్చి నెమ్మితోఁ. ౨౫

క. దేశాంతర వర్తనముల
కౌశలములు గనెడు లెక్క గలిగిన యది యే
దేశముననుండి యిటు తే
దేశమునకు నరిగెదీవు తెల్లము చెపుమా. ౨౬

వ. అనవుడు ౨౭

ఆ. ఆంధ్రదేశనృపతియగు జయసింహుని
పురములోన నుండి పోవుచున్న
వాఁడ గౌడభూమి వర్తించు వేడుక
ననిన నిట్టులంటి నతనితోడ. ౨౮

క. ఆ దేశంబున నెప్పుడు
వైదేశిక పూజనములు వర్ధిల్లును భూ
త్రీదేవుఁడు ధర్మిష్ఠుఁడె
యా దేశము తెఱఁగు చెప్పుమంతయు ననఁగన్. ౨౯

ఆ. భూమి లెస్స, రాజు పూర్వులతో నీడ,
మేలు వీటిలోన మెలఁగునప్పు
డేను శుద్ధిగాఁగ నెఱిఁగిన క్రొత్తయుఁ
గలదు ధరణినాథువలన నొకడు. 30

చ. అతఁడు కలంబు నెక్కి చని యక్కడ నేమఱియున్న వైరి భూ
పతిఁ గడు బిట్టుముట్టుకొని భామలతోడను పట్టితెచ్చి త
త్సుతదెస సక్తుఁడై కపయఁజూచిన రేఁగి తదీయగాత్ర సం
శ్రితుఁడగు బ్రహ్మరాక్షసుఁడు చేరఁగనీఁడు మహోగ్రచేష్టలన్.

ఉ. దానినెఱింగి మంత్రములు తంత్రములున్ జపముల్ తపంబులుం
దానొనరింపఁబంచె వివిధక్రమశాంతి పూర్వకంబుగా
దానములెల్లఁజేసి విదితంబుగఁ గల్పము లెన్ని యన్నియుం
దే నియమించి చూచుచుఁ దదీయవిధానము లాచరించుచున్.

గీ. బ్రహ్మరాక్షసుఁ డింతిపైఁ బాయకున్న
మంత్రవాదుల వెదకుచు మందు లెఱుఁగు
వారిఁ దడవుచుఁ గనుకలి వంతఁ జింత
నొంది యిడుమలు గుడుచుచు నున్నవాఁడు. 33

వ. అని యా తాపసి చెప్పిన విని యదియింతయుఁ గనకరేఖ కపటంబని యెఱింగి యాత్మగతంబున. ౩౪

క. యువతీరత్నము చెలువునఁ
దవిలి వివేకంబు చెప్ప దప్పిన జయసిం
హవిభునిఁ గుటిలోపాయత
నవశ్యమును జెఱతు నే ననాయాసమునన్. 3౫

వ. అని నిశ్చయించి సముచిత సల్లాపంబుల వెండియుం గొండొకసేపు గడిపి యా జియ్యనీడ్కొని యరిగి యాకారంబు వేఱగునట్లుగా నైపుణంబునం దాపస వేషంబు దాల్చి కొందఱు శిష్యులం గూర్చుకొని యేనును వారును బరమాస్తిక జనమధ్యం బున సుఖులమై నడచి యంధ్రనగరంబు చేరువకరిగి తత్ప్రదేశంబున నొక్క కొలనికడం బర్ణశాలంగావించుకొని యందు వసియించి. 3౬

క. నైష్ఠిక భావన వివిధా
నుష్ఠానంబుల మహీజనులు మేద్పడ ధ
ర్మిష్ఠాదిష్ణుఁడ నగుచుఁ బ
టిష్ఠుఁడనై సలిపితిం గడిందియగు భంగిన్. 3౭

వ. అట్టియెడ మదీయశిష్యులు పురంబునం గలయమెలఁగి 3౮

ఆ. ఇతఁడు పూర్వమునుల కేమిటఁ దక్కువ
యతులు బోధనమున మహానుభావుఁ
డద్భుతావహంబులైన శాపానుగ్ర
హంబు లరయు నితనియందుఁ గలవు. 3౯

క. పెక్కుడలఁ జూచితిమి మే
మక్కజముగ వీరిఁ గొల్చి యభిమతసిద్ధిం
గ్రక్కునఁ బడయుదు రీక్రియ
ద్రక్కిన ఘటియింతు నీచదశనొందంగన్. ౪౦

వ. అనుచు మఱియు ననేకప్రకారంబుల నన్నుం బ్రశంసించుచు మత్పరత్వ సకలజన సమానీత సమస్తవస్తువు లనుభవించుచు నేను సమలోష్టకాంచనత్వంబు భావించుకొని యున్నం గర్ణపరంపరాప్రాప్తంబైన యస్మదీయ విఖ్యాతి విశేషంబు నకు బేలువడి భూపాలుండు నాకడకుం జనుదెంచి దండప్రణామంబుచేసి చేతులు మొగిచి నిలిచి, ౪౧

క. మునినాథ నీమహత్త్వము
వినియభిమతసిద్ధిపడయు వేడుకతోడన్
జనుదెంచితి నను గరుణం
గనుగొనుమని వినయ నమ్ర గాత్రుండయ్యెన్. ౪౨

వ. వినుము వానికొలంది యెఱింగి తద్గుణకథనంబు నెపంబుగా మదీయ వర్తనం
బందు గురుత్వబుద్ధి పుట్టింపఁదలంచి యిట్లంటి. ౪౩

మ. బహుదేశంబులు చూచుచున్ బహుతపఃప్రౌఢిం బ్రతిష్ఠించుచున్
బహుతీర్థంబుల కేగుచుం బహుగుణభ్రాజిష్ణులం జూచుచున్
బహుసంవత్సరముల్ చరించితిమి భూపాలాగ్రణీ కాన మీ
మహి నీయట్టినరేంద్రు ధర్మమహిమన్ మానజ్ఞతం బ్రాజ్ఞతన్. ౪౪

క. కావున నభిమత మెల్లను
గావింపఁగ నాకు గౌతుకము పుట్టెడు నీ
భావగతంబగు కోర్కి మ
హీవల్లభ యెఱుఁగఁజెప్పు మిప్పుడ తీర్తున్. ౪౫

వ. అనిన నతండు కామాతురుం డగుటం జేసి లజ్జయుజ్జగించి యిట్లనియె. ౪౬

క. మునినాథ వినుము నేనొక
వనితారత్నంబుఁ జూచి వలచితిఁ దనుఁ బ
ట్టిన బ్రహ్మరాక్షసుని కత
మున మెయికొన దదియు నేస్తమున కెబ్భంగిన్. ౪౭

ఉ. కావునఁ దత్సమాగమసుఖంబు మనంబునఁ గోరి కోరియున్
భావజుబాణజాలముల పాల్పడి వెజ్జుల మంత్రవాదులన్
వేవురఁ గూడఁబెట్టియును వేల్పులఁ గొల్చియు బ్రహ్మరాక్షసుం
బోవఁగఁ జోపనేరక తపోధనవల్లభ నిన్నుఁ జేరితిన్. ౪౮

క. అనవుడు నిట్లని పలికితి
మనుజేశ్వర మంత్రతంత్ర మాహాత్మ్యమునం
దనుమధ్యకు నీకును బొం
దొనరించెద భావభవుని కోడకు మింకన్. ౪౯

వ. అది యెట్లంటేని రూపసిద్ధియను నొక్క మంత్రంబును బ్రహ్మరాక్షస భయం
కరమగు రక్షామణియు నీకిచ్చెద. తన్మంత్రాభిమంత్రితంబైన యక్కోలని జలంబు

నిష్కంటకంబుగా దర్వీకరమకరగ్రాహాదిదుష్టసత్త్వసముద్ధరణంబు చేయించి యాగామి శుక్లపక్షద్వితీయదినంబుపవసించి రక్షామణిలాంఛితశిరస్కుండవై శశికళా సందర్శనంబు చేసి సప్తఘటికానంతరంబున నష్టోత్తరసహస్రకరదీపికా పరివృతుండవై యిరొయ్యేడకుం జనుదెంచి పదశతత్రియమాత్రస్థాపిత పరివారుండవై దీపాలోకనంబును నపనయించి మంత్రపురస్సరంబుగా సరోవరంబు చొచ్చి మునింగియున్న భంగిన యూర్పునిలుప నయ్యేడునంతసేపు జపియించి పరిభూతమన్మథాటోపంబగు రూపంబు దాల్చి తదనంతరంబ నిజగృహంబునకుం జని ౫౦

క. ఇతరులతోఁ బలుకక య
య్యతివకుఁ బొడఁజూపిపలుకు మంతటఁగోలెం
బ్రతిదివసము రతిపతికిని
రతిక్రియ నమ్మఁగువ నీకు రాగమొనర్చున్. ౫౧

మ. ఇదినీకుంబ్రియమేని పెద్దగ్గడలతో నేకాంత మూహించి మొ
ప్పిదమై యుండఁగ నాచరింపు మనుడున్ బేల్పాటు చిత్తంబునం
దొదవన్ సమ్మద మొంది యయ్యకొని మాయోపాయజాలంబులం
బొదువం బడ్డనెఱింగి యాత్మముదముప్పొంగంగ నే వానితోన్.

వ. మఱియు నిట్లంటి ౫౩

ఉ. నీవు సధర్మవర్తివని నీకొక మేలొనరింపఁగోరి యేఁ
బోవనకాని యిప్డు పరభూములఁ గ్రుమ్మఱుచున్నయట్టి నా
పోవుట నిల్వ దిట్టి దొకపొందని లే దదియట్లయుండె స
ద్భావముతోడ నొక్కపరి భక్తిఁదలంపుము మమ్మునిచ్చలున్. ౫౪

వ. అని పరిజనుల నవలంబొమ్మని యతని డాయంబిలిచి మంత్రాకారంబులుగాఁ గొన్ని కపటాక్షరంబు లుపదేశించి యంతకుమున్న ఘటియించియున్న యొక్క జిలిబిలి రక్షపూనయు నిచ్చినం గృతార్థీభూతమనస్కుండై నమస్కరించి మునీంద్రా నన్నుఁ గొలువుగొని మీరిందు నిలుచుట మాకెల్ల పురుషార్థంబులు నని ప్రార్థించిన మాకంతవట్టునకు భాగ్యంబుగలిగి యట్లయ్యెంగాని మావర్తనంబు గ్రామైకరాత్రంబై యుండుననిన నట్లగునని మగుడంబలికి వీడ్కొలిపినం జని పదంపడి గతాగతజనంబులవలన నతండు మంత్రిపురోహితసహితంబుగా నికార్యంబుచేయ నిశ్చయించుటెఱింగి నా చెప్పిన దినంబునకు ముందటినాఁటి నిశాసమయంబున ౫౫

క. ఏనును మదీయశిష్యులు
లోనుగ వంచించి కొలనిలోపల బిలమున్
మానిసి కుండఁగ నయ్యేడు
మానముగాఁ దటమునం దమర్చి తగంగన్. ౫౬

వ. ఉపద్వారంబు సూక్ష్మంబుగాఁ గల్పించి యవ్వేకువ ననతిదూరంబగు నొక్క తీర్థంబునకుం బోవు నెపంబున శిష్యులం గొనిపోయి గవ్యూతిమాత్రంబునఁ గాననంబు లోనం గాడువఱచి తొలంగి యొండుజాడ మరలివచ్చి కొలనుసొచ్చి వేషోపకరణంబు లడంచి యాయితంబైయుండి, ౫౪

మ. సమయంబైన నృపాలుఁ డస్మదుపదేశ ప్రక్రియం బద్మషం
డమునం గ్రుంకుటఁ జూచి బిట్టడరి యంటంబట్టి కంఠంబు పా
దమునం జిక్కఁగనూఁది త్రొక్కి నృపు వీతప్రాణుగాఁ జేసి ప్రా
ణములం బాసినమేను బొక్కనిడి దానం దమ్మునంగప్పితిన్.

వ. ఇట్లు జయసింహుని సమయించి కొలను వెలువడి తదీయాంబర భూషణాదులు ధరియించి యల్లన పరిజనంబులున్న పరిసరంబున కరిగి నివ్వటిలు దివియలు వెలయించిన, ౫౯

ఉ. అచ్చెరుపాటునొందు హృదయంబులతోఁ బరివారమంతయున్
వచ్చి కనుంగవల్ విరియ నాకు మహీస్థలిఁ జాఁగి మ్రొక్క నే
నచ్చట సస్మితాననము నాకృతి వారల నాదరించి వా
కుచ్చి యొకండుఁ బల్కక నిరూఢమహానియముందపోలెనై. ౬౦

చ. నగరికి నేగి వాఁడినయనంబుల నందఱ వీడుకొల్పి వా
సగృహము చొచ్చి యంతిపురి భామలు విస్మితలోచనప్రభల్
మిగులుగఁ జూచుచోఁ గనక రేఖఁ గనుంగొని దానితోడఁ ద
న్మృగ నొకపల్కుపల్కి మునుపాల్తులకుం బుయిలోట వాయగన్.

వ. మనోహరాకార లాభకారణంబునకుం దగిన యాలాపంబులం గలిపికొని కొంతసేపు వారలనడుమ నిలిచితిని. అట్టిరెడం గర్దనందన సందోహాందోళితంబైన డెందంబుతోడ నన్నుఁ జూచుచుండె. నేనును సాభిప్రాయంబులు, సవిస్మితంబులు, సప్రత్యభిజ్ఞాడంబులునగు నవలోకనంబుల నయ్యంబుజానన యనుమానంబు వాపినం గొండొక యలరుచుండియు వితర్కంబుతోడి యచ్చెరుపాటునం బొరయుచుండం గరకిసలయంబు సరసంబుగాఁ బట్టుకొని, ౬౨

ఆ. నగరివర్తనంబునకు నంతిపురము సుం
దరుల తెఱఁగునకును బరిజనముల
నడపుటకును నాదు నడవడి యిట్లని
నిశ్చయించి నెమ్మి నిద్రచేసి. ౬3

క. మేలుకని పొద్దుపొడుపునఁ
గాలోచిత విధులు సలిపి కాంతాకలిత
శ్రీలసితుఁడనై సమ్మద
లీలం గరినెక్కి వైహాళికిఁ జని యచటన్. ౬౪

ఆ. ఉచితవర్తనముల నొక్కింత వడి నిల్చి
మరలివచ్చి సకల పరిజనములు
బలసి కొలువఁ బెద్ద కొలువుననుండి మం
త్రులకు నిట్టులంటి నెలమితోడ. ౬౫

ఉ. కోరికనిట్లు కర్దనుని కూఁతుఁ బ్రియాంగనఁగా నొనర్చితిం
గారణబాంధవం బలర గ్రక్కున నాన్నృపు నాత్మరాజ్య వి
స్తారకుఁగా నొనర్చి నిజధాత్రికిఁ బంచుట నీతి గావునన్
ధీరతతోడ మీయనుమతింగొని క్రమ్మఱఁ బుత్తు నాతనిన్. ౬౬

క. అని మంత్రుల సమ్మతిఁ గ
ర్దనునిన్ రావించి నీదు రాజ్యంబునకుఁ బొ
మ్మనుమాటఁ బ్రియమొనర్చితి
వినుతాంబర భూషణాది వితరణములతోన్. ౬౭

వ. పదంపడి కనకరేఖచేత నతనికి నాక్రమంబును సాధక క్రూరకర్మ కౌశలంబును ముదిత గాంధర్వపరిణయ ప్రకారంబును జయసింహునెడఁ జేసిన వైచిత్రియుఁ జెప్పిపుచ్చి కలపికొని యతనిం గళింగ నగరంబున కనిచి రెండు రాజ్యంబులు నొక్కటిగాఁ బాలించి భవత్పాదోప కంఠ సంవాససౌఖ్యంబు దొరకొను తెఱంగు చింతించుచున్నంత సింహవర్మ సహాయంబుగోరి పుత్తెంచినం జనుదెంచి మనోరథసిద్ధిఁ బొందితిని. అనిన విని రాజహంసనందనుం డభినందించె. ౬౮

# 3. భాస్కర రామాయణము

## విభీషణు శరణాగతి

[ యుద్ధకాండము ]

—హుళక్కి భాస్కరుడు

తే. వాసవారాతి వేగులవారివలన
దాశరథుల వృత్తాంతమంతయు నెఱింగి
పవనసుతుచేత నట్లైన పరిభవంబు
దలఁచికొనుచు నాస్థానంబుఁ గలయఁజూచి. ౧

చ. ఒకకపి సాగరంబు కడు నుగ్రరయంబున దాఁటివచ్చి సు
క్కక వన ముద్ధతిం బెఱికి కావలియున్న నిశాటకోటి న
క్షకుఁ బరిమార్చి మత్పురముఁ గాలిచి క్రమ్మఱ నేగె లెక్క సే
యక హరిసేనతో విడిసి రంబుధిదాఁటఁగ నిప్డు రాఘవుల్. ౨

ఉ. ఆ వసుధేశు లింక మకరాలయ మేగతినైన దాఁటి సు
గ్రీవ పురస్సరంబుగ నొగిఁ నడ తెంతురు తప్ప దాహవం
బేవెర వాచరించిన జయింతుమొ చెప్పుడు మీరు నీతి
విద్యావిదులుం దలంపఁ బరమాప్తులు నాకనిపల్కి వెండియుఁ.

తే. అఖిల సమ్మతిఁ గావించు నదియు, బహు వి
చారములు దోఁప నందొక్క సరణి నడపు
నదియు, నౌఁ గాదు నాఁజేయునదియు నివ్వి
ధంబు లుత్తమ మధ్యమాధమము లండ్రు. ౪

ఆ. కాన మంత్ర లొక్క కార్య మందఱుఁగూడి
నిశ్చయింపుఁ డంబునిధిగడాక
మున్న రిపుల గెలిచి మూఁడులోకంబుల
కళుకు పుట్టఁజేయవలయు ననిన. ౫

చ. కొలువుననున్న రక్కసులు ఘోరతరోద్ధతు లొప్ప ఖడ్గరో
చులు నిగిడించుచుం గనలు చూడ్కుల నొక్కట విస్ఫులింగముల్
వెలువడ భీకరభృకుటి వీచులు వీరరసాబ్ధి కట్టపైఁ
బొలసిన భంగి ఫాలములఁ బొల్పుగ నిట్లని రా సురారితోన్. ౬

శా. లీలంగొంటి కుబేరు పుష్పకము బల్మిన్ గిట్టి ముప్పొట్టులం
దూలందోలితి వాసవాదిసురలన్ దోర్దండ కండూతికై
కైలాసాచలమెత్తి తివ్విధమునన్ గర్వంబు సర్వంకషం
బై లోకంబులఁ జెల్ల నీకొకఁ డసాధ్యంబెద్ది లంకేశ్వరా. ౭.

సీ. మయుఁడు బాహావిక్రమము చూచి తనకూఁతుఁ
దెచ్చి నీపట్టంపు దేవిఁ జేసె
చతురంగ సహితులై సరిపోరి వరుణాదు
లేపఱి నీవెట్టి కియ్యకొనిరి
పాతాళలోకంబుపైఁ జన్న వచ్చి ప
న్నగరాజు నీశరణంబు గనియె
నడరి కౌంభినసేయాది దానవు లాహ
వక్రీడ కోడి నీవారలైరి

కాలదండ భయంకరగతినడంచు
నపుడు మృత్యువు నీయట్టహాసమునకు
బెగడె మఱియు నీచేఁ బడ్డ బిరుదుమగల
లోనఁ గడిమి నెవ్వీరుఁబోలుదురు వీరు. ౮

మ. జగదాభీలుఁడు మేఘనాధుఁడు మహాసామగ్రి మాహేశ్వరం
బగు యాగంబొనరించి లబ్ధవరుఁడై యస్వప్న సేనార్ణవం
బొగి బాహాద్రి మథించి యెల్లసిరిచే నొప్పారు జంభారిఁ జం
డగతిం బట్టినవాఁడుగాఁడె యితఁడుండం జింత నీకేటికిన్. ౯

చ. పెఱకుఁదుమే ఫణీంద్రు విషభీషణ దంష్ట్రలు నేలఁగుగ్రంగఁ జే
సఱతుమె, నింగి బ్రింగుదుమె, చండదిశాగజదంతకాండముల్
విఱుతుమె, వారిధుల్ పుడిసిలింతుమె, మందర మంగుటంబునన్
జిఱుముదుమే, జగంబు లఱచేతికిఁ దెత్తుమె రాక్షసేశ్వరా. ౧౦

చ. తురగ సమాకులంబు రథదుర్గమముం గరి భీకరంబుఁ దో
మర ధనురాది సాధన సమంచిత వీరభటోద్భటంబు సొం
పరుదుగ నీ యనీకము, నిరాయుధమైన పదాతి మాత్ర మా
హరి బలమెట్లు హస్తి మశకాంతర మారసిచూడ రెంటికిన్. ౧౧

క. సురకంటక విను రణమున
సురగణములతోడఁ గూడ సురపతినైనన్
బొరిగొనియెద మెక్కడివా
నరులున్ గీనరులు నెఱ నరులున్ గరులున్. ౧౨

వ. అని మహావీరులైన మేటిరక్కసులు లొక్కటఁ రేఁగి క్రొమ్మెఱుంగు లెగయఁ గైదువు లంకించుచు రావణుంజూచి యిదె చని యన్నరుల వానరులం దునుముదుము, పొడుతుము, చెక్కుదుము, వ్రక్కలు సేయుదు మనునవి మొదలగు రోష పరుష భీషణ భాషణంబులు గ్రందుకొన నవష్టంభంబునం బలుకుచున్న నెట్టకేనియు వారి వారించి విభీషణుం డిట్లనియె. ౧౩

## విభీషణుండు రావణునకు నీతి చెప్పుట

క. వినుఁడు నిశాచరు లిందఱు
మనరాజా రాజుదేవి మాయోపాయం
బునఁ దెచ్చె నింతసేయుం
జనునె యీతప్పు రామచంద్రుని తప్పే! ౧౪

శా. ఆ దుశ్చారిణియైన శూర్పణఖ ఘోరాకార దుర్దర్శయై
వైదేహింగని మ్రింగఁబోక మొదలన్ వారల్గిరే! దానికై
కాదే పూని ఖరుండు పోయి మడిసెన్ గర్వంబునన్, రాముఁనం
దేదీ పేర్కొనఁదప్పు, తప్పు మనయందే పో విచారించినన్. ౧౫

క. తగవును ధర్మము బలికిన
మగతనమది సెడునె, వారు మనపంతముఁలన్
దెగిరే, లేరే మీర
య్యగచరుఁ డటుసేయునప్పు డదియట్లుండెన్. ౧౬

తే. తొలుత మూఁ డుపాయంబులు గొలుపకున్నఁ
దుదిఁ గదా విక్రమోద్యోగ మదియు రిపుఁడు
మత్తుఁడైయున్న నొరుచేత నొత్తఁబడిన
వీతబలుఁడైనఁ జనునండ్రు నీతివిదులు. ౧౭

వ. కావున రఘువరుం డప్రమత్తుండును, విజిగీషుండు, నధికబలసమేతుండునగుట నెవ్వరికి నజేయుండు. అంతియకాదు. ధర్మం బెచట వర్తించు నచటికి జయం బవశ్యంబు నగు. ఒక్క హనుమంతుండు మనల నెంతలుసేసె, నిప్పు డమ్మహాత్ముం గొల్చి యపారసత్త్వసంపన్నులైన మేటి వనచరవీరు లనేకు లనేకానీకంబులతో నరుగుదెంచినవారు. ఇంకను నిత్తెఱంగున వృథావైరంబు దగదని పెక్కు హేతువులు సూపి చెప్పుచు ముకుళిత కరకమలుండై దశముఖుం గనుంగొని. ౧౮

శా. రక్షోనాయక నిన్ను మమ్ము సచివవ్రాతంబు నీ సేనలన్
రక్షింపన్ వలతేని పుచ్చుమరలన్ వైదేహి, నట్లేచి యా
జిక్షోణిం దృణకల్పుఁడై ఖరుఁడు ప్రస్థితోగ్రకీలా దుర
త్ప్రేక్షంబైన రఘుక్షితీశు శరవహ్నింబాటు గంటేకదా. ౧౯

సీ. సీత నీ విటకుఁ దెచ్చినయది మొదలుగా
హోమాగ్ను లపసవ్య ధూమమడర
విస్ఫులింగంబులు వెలువడు చునికికి
నొప్పక హవ్యంబు లుప్పతిల్లుఁ
బొరి సరీసృపములు పొడము గుండంబుల
నిభములు మదధార లింకవనరుఁ
దురగముల్ గన్నీరు దొరఁగ డిల్లంబులై
యుండును వికిరరో మోద్గమంబు

లశ్వ కరి కలభాదుల యందుకానఁ
బడు గవంకుల వాపోవు పట్టపగలు
మొగివఱ ళ్లీమ హోత్పాతములకు శాంతి
చూడ నద్దేవి మరలఁ బుచ్చుటయ లెస్స. ౨౦

క. ఇత్తెఱఁగు మంత్రు లంత
ర్వృత్త ములం గనియుఁ జెప్పవెఱతురు నీచేఁ
జత్తురు నొత్తురు గాక వి
పత్తి యెడం దగదె హితము పలుకం దమకున్. ౨౧

క. అనవుడు గోపంబున ని
ట్లను నాతని కతఁడు వార లమర గణములం
గొని వచ్చిన నేఁ బుత్తునె
జనకజఁ బొమ్మీవు వలదు చక్కటిచెప్పన్. ౨౨

క. రాముఁడు నా నెవ్వఁడు సు
త్రాముఁడొ వరుణుండొ జముఁడొ ధనదుఁడొ పటు సం
గ్రామక్రీడకు నాతో,
నీ మాటలు విడువు, విడువ నేను మహీజన్. ౨౩

వ. అని పల్కి యక్కొలువు గలయం గనుంగొని ౨౪

తే. నేఁడు మేల్కని చనుదెంచినాఁడు కుంభ
కర్ణుఁ డింతకు మున్నెఱుఁగండు సీత
నేను దెచ్చిన యవ్విధమితని కింకఁ
దెలియ నంతయు వినిపింపవలయు ననుచు. ౨౫

క. శూర్పణఖ ముక్కుపోవుట,
దర్పితుఁడై ఖరుఁడు పడుట, ధరణిజఁ దా నా
నేర్పునఁ దెచ్చుట, పుర మన
లార్పిత మగుటయును వరుస నంతయుఁ జెప్పెన్. ౨౬

వ. అది విని కుంభకర్ణుం డిట్లనియె. ౨౭

శా. సీతందెచ్చితి కార్యవేదివయి, నీచే మున్ను సర్వంబు ని
ర్ణీతంబైనది, యింకనేల చెపుమా నీ కే విచారంబు నీ
నీతిజ్ఞుల్ మునుగాఁగ రాఘవ ధనుర్నిర్ముక్త నిర్ఘాత సం
ఘాత క్రూరశిలీముఖాగ్నిఁబడి మ్రగ్గంబోదుగా కేమనన్. ౨౮

తే. నీతిపథమునఁ గార్యంబు నిశ్చయించి
తగవు దప్పక చేయునతండు మీఁద
నిడుమ పొందఁడు, ధర్మంబు విడిచి చొప్ప
దప్పి కావించు నతఁడు సంతాపమొందు. ౨౯

క. మొదట విచారింపక చే
యుదు, రది తుది నొప్పకున్న నుక్కడఁగి ముడుం
గుదురు విను తులువ, లప్పను
లొదవక చెడు బూది నిడిన హుతముల కరణిన్. 30

ఆ. ఎఱుకలేక చపలుఁ డేవంకఁ దిరిగిన
నల్పమతులు వాని ననుసరింతు
రొక్క కొంగపాఱ నున్నకొంగలు గూడ
నెగసి పాఱుచునికి తగవుగాదె. 31

వ. అదియునుగాక 32

తే. ఆది మధ్యాంత రహితుఁడైనట్టి విష్ణుఁ
డసురకుల వధార్థంబిట్టు లవతరించె
రవికులాంబుధి సోముఁడై రామచంద్రుఁ
డురుబలుఁడు గాని సామాన్యనరుఁడు గాఁడు. 33

క. ఈ విధమును మును నారదు
చే వింటిం బంక్తికంఠ సీతను మరలన్
భూవిభునకు నర్పింపు శు
భావహమయ్యెడిని మనకు నమరారాతీ. 34

వ. అనిన విని పది మొగంబులు జేవురింపనున్న దశగ్రీవు కోపరస భావం
బెఱింగి మఱి యొక్కింతసేపునకుఁ గుంభకర్ణుం డిట్లనియె 35

శా. ఇంకీమాటలకుం బ్రయోజనములే దీ జీవనం బేటికిన్
లంకాదాహము విన్నవాయెలుక యెన్నండాఱు నట్లుండె నా
హుంకారంబు సహింప నెవ్వఁడు గలం డుగ్రాహవక్రీడలం
గింకన్ గిట్టివధింతు రాఘవుల, సుగ్రీవాదులన్ మ్రింగెదన్. 36

ఆ. దాశరథులు సమరతలమునఁ జంద్రార్కు
లైన ననల వరుణులైన ధనద
పవనులైన నాదు పరిఘంబు పాలుగాఁ
గలరుగాక గెలువఁగలరె నన్ను. 37

వ. అనిన నతని పలుకులకు సంతోషించి దశకంఠుం డిట్లనియె. 38

చ. కల దొకగొప్ప యంబురుహగర్భునిఁ గొల్వఁ జనంగఁ బుంజిక
స్థల యను నచ్చరం దగవు దప్పి గ్రహించితి నొల్లనాఁగ, న
న్నలువయు నంత నంతయు మనంబునగాంచి శపించె నన్ను న
న్యలలన బల్మిఁ బట్టికొని నష్ట శిరంబులు వ్రయ్యలైపడన్. ౩౯

వ. అది కారణంబుగా నత్తెఱం గలవడదు. రాఘవుల జంపిన వెనుక నొక విధంబునఁ గోర్కి సఫలంబయ్యెడుగాక. నాకొలందివారెఱుంగరు. గుహాంతరంబున నిద్రించు కంఠీరవంబు మేలుకనుపం జనుదెంచుచున్న భద్రదంతావళంబులుం బోలె వచ్చుచున్నారని పలికిన విని కుపితమానసుండగుచు విభీషణుండిట్లనియె. ౪౦

మ. తగవే రజ్జులు నేఁడు నీదగు మహాస్థానంబులో నింతటం
బగవారక్కడ సుక్కిరే మన మహాపార్శ్వాది వీరోత్తముల్
మిగులం బంతములాడి తప్పెదరె నిల్చెంబొమ్ము నా రాము నా
శుగవేగంబును వాలితమ్ముఁడగు నా సుగ్రీవు దోర్గర్వమున్. ౪౧

వ. అనినఁ బ్రహస్తుం డతనిం గనుంగొని ౪౨

ఆ. వీరధర్మమిట్లు విడిచి విభీషణ
రాజు నెదుట దాశరథులఁ బొగడఁ
బాడియగునె క్రోఁతి బ్రహ్మరాక్షసుఁ జేయ
వచ్చినాఁడ వెంతవారు వారు. ౪౩

మ. అవనీనాథుల రక్తపూరములు మున్నాపోశనం బెత్తి జాం
బవదాదిత్యతనూభవ ప్రభృతులం బ్రాణాహుతుల్ చేసియు
న్నవనౌకంబుల నేచి మ్రింగి పిదపన్ బ్రహ్మాండభాండంబు బి
ట్టవియం ద్రేపక కుంభకర్ణుఁడు సనం డాకొన్న వాఁడెంతయున్.

ఆ. ఇతని యంతదాఁక నెవ్వాఁడు రానిచ్చు
నొక్కఁడొకఁడ వారి నుక్కడంపఁ
జాలియున్నవారు సమరార్థులై యాతు
ధాను లొక్క నీవు దక్క వినుము. ౪౫

వ. అనినఁ గుంభకర్ణానుజుండు కోపరక్తాననుండగుచు నతనింగనుంగొని ౪౬

మ. మగమాటల్ మనకేల, నాఁ డల హనూమంతుండు లంకాపురం
బెగువంగాల్పఁగ నెందుఁబోయితిమి, నేఁడెవ్వండు లజ్జింపఁ డే
తగవుం జెప్పఁడు, సీతఁబుచ్చుమనఁ, డా ధాత్రిశు నుల్కాసమా
శుగవేగంబు దలంపఁ డింక నిదియుం జూడంగనౌ నాజులన్. ४८

వ. అనిన నింద్రజిత్తు కర్ణశూలంబులగు నప్పలుకులకుం గనలి యిట్లనియె. ४९

క. పిఱికితనమెచట నలవడఁ
గఱచితొకో పగఱ నింతగాఁ జేసి మమున్
వెఱపించె దిచటఁ గొందఱు
వెఱతురె నీ బోఁటివారె వీరెవ్వారున్. ४५

క. నాకముపైనేఁగి సురా
నీకంబులఁ దోలి యింద్రునిం జెఱ దేనే
లోకమెఱుంగఁగఁ బ్రార్థన
వేకైకొని బ్రహ్మకొఱకు విడువనె పిదపన్. ३०

సీ. నావుడు నమ్మేఘనాధున కతఁడిట్టు
లను, నీతికోవిదు లల్ప మూర్ఖ
బహుభాషి నుత్సుకు బాలు రహస్యంపుఁ
గార్యంబునప్పుడు గదియనీక
నిరసింతు రెప్పుడు, నీ బుద్ధియెంతయు
నవగుణంబులకెల్ల నాలయంబు
గావున నీవున్నకడ మంత్ర మూహించు
నీరాజు నేర్పున కేమికొఱఁత

పుత్త్రరూపంబుఁ గైకొని పుట్టినట్టి
పగతుఁడవు గాక హితుఁడవే పతికి నిట్లు
తగవు వినఁజాల కేల మీ తండ్రియట్లు
చిటిలి పడుచున్నవాఁడవు చెడదలంచి. ३१

వ. అని పల్కి మఱియు నతండు పల్కు తుచ్ఛోక్తులు లెక్కసేయక దశాననున
నవలోకించి. ३२

ఉ. ఏచిన తాటకం దునిమె, నెక్కుడు వీరు విరాధు ఘోరనా
రాచము పాలుచేసె, ఖరు గ్రక్కున నుక్కడఁగించె, నట్టిమా
రీచు వధించె నారఘువరేణ్యు నెఱింగియుఁ జక్కఁగావు లం
కాచర యామినీచరులఁ గాలముచేరిన నీకు శక్యమే. ౫౩

క. వారు తమ కొలఁదు లెఱుఁగరు
బీరము లాడెదరు నీకుఁ బ్రియములుగా నీ
వీరుల నీవ యెఱుంగుదు
వీరల పంతములు వినక విను నా మాటల్. ౫౪

ఉ. తాత పులస్త్యుఁడుం, గనిన తండ్రియు విశ్రవసుండు, వైదికో
పేతము నిర్మలాచరణ, మీవును బ్రహ్మవు చెప్పవచ్చినన్
నీతివివేకముల్ దొఱఁగి నిందకు నోర్చితివేల దేవ ము
న్నీతెఱఁగెల్ల నొప్పదని యీవ యెఱుంగుదు చెప్పనేటికిన్. ౫౫

మ. జగతీనాథుఁడు నీనెపంబునఁ బులస్త్యబ్రహ్మవంశంబుపైఁ
దెగ నంబోధిగడాకమున్న, కపు లుద్వృత్తిం ద్రికూటాద్రి పె
ల్లగిలందోవకమున్న, లక్ష్మణుఁడు కీలాఘోరనారాచముల్
నిగుడంజేయకమున్న పుచ్చు మరలన్ వేవేగఁ బృథ్వీసుతన్.

సీ. అనుడు నద్దశకంఠుఁ డతని కిట్లను విను
రోషంబుతోఁ బిట్టు రోఁజుచున్న
చటులోరగముతోడి సహనివాసమ్మున
కంటె నీతో నిట్లు గలిసి యునికి
కడుఁగీడు హితునట్ల కదియుచు శాత్రవ
మొకదెస జరుపుచు నోటలేక
పగవానిపక్షంబు పలికెదు నీకంటె
నిక్కంపు పగవాఁడు నెరయమేలు

ధనము విద్య కీర్తి దమలోన నొకనికిఁ
గలుగుటకు నసూయఁ గ్రాలువారు,
నెదురువేచువారు నెందు దాయాదుల
కారె కాన నమ్మ గాదు నిన్ను. ౫౭

క. ఉదకము నలినీపత్త్రము
గదిసియు నెరవైనయట్లు కలయవు నీ మా
హృదయములు గజస్నానము
తుది మఱి నీతోడిపొందు దుష్టచరిత్రా. ౫౮

క. నాపెంపున కిట్టు లసూ
యాపరతం జూడజాల కాదు తెలియఁగనే
పోపో కులపాంసన యిం
కీపలుకులు పలికితేని యేను సహింపన్. ౫౯

వ. అని తూలనాడు రాక్షసేశ్వరుంగని కర్ణభీషణంబుగా విభీషణుం డిట్లనియె.

ఉ. అన్నవు తండ్రియట్ల విను మంత్రియ కాదటమీఁద రాజ వే
మన్నను జెల్లుగాక మణిమండనముఖ్యములైన కానికల్
మున్నుగ సీతనిచ్చి జనలోకపతిం గని మమ్ముఁబ్రోవు మీ
సన్నపుఁ గార్యముల్ వలదు సందియ మే లటుగాక తక్కినన్.

శా. జ్యాఘోషంబు నిరంతరంబగుచు మ్రోయం జెల్లుదంభోళి ధా
రాఘోరాస్త్రపరంపరల్ దరఁగలై రాజిల్ల వాఃపూరితా
మోఘావృత్తిఁ దనర్చు రామధనురంభోరాశిదోర్విక్రమ
శ్లాఘాగాధము నేఁడు ముంచుఁ జెలుచన్ లంకాపురీద్వీపమున్.

తే. వలదు చాటితి నతఁడు నీకొలఁదిఁగాడు
చేటుతఱిగాన నీకిట్లు చెడ్డబుద్ధి
పొడముచున్నది నాశంబుఁ బొందనున్న
మేఘమునకు వికీర్ణంపు మెఱుఁగునట్లు. ౬౩

ఉ. నీచెవికింపుఁజేరి రజనీచరనాయక తుచ్ఛవాక్యముల్
నీచులు గన్కొ నిట్లలుక నీకవి పథ్యములయ్యె నేగతిం
జూచిన నాహితోక్తులకుఁ జొన్పదు నీమది గాన దుర్మదుం
డై చెడువానిపొంతఁ జనదండ్రు వసింపఁగ నీతికోవిదుల్. ౬౪

వ. అదియును గాక ౬౫

సీ. నీ వెత్తఁజాలని నీలకంఠుని విల్లు
పుడకకైవడిఁ దున్మి ప్రోవు వెట్టె
నిలఁ గార్తవీర్యు బాహులు వేయుఁ ద్రుంచిన
పరశురాముని నాజి భంగపఱచెఁ
గైలాసమెత్తిన ఘను నిన్నుఁ గట్టిన
వాలి నొక్కమ్మునఁ గూలనేసె
నీపుత్త్రు వధియించి నీలంకఁగాల్చిన
హనుమంతు నేలినయతని నేలె

నట్టి రాముతోడ నసమానవైరంబు
పట్టి గెల్తుననుట పడుచుబుద్ధి
చనదు సీతనిచ్చి శరణని రఘురాముఁ
గనుటమేలు చెడక మనుటమేలు. ౬౬

వ. అనిన విని వికటభ్రూకుటి దుర్నిరీక్ష్యుండగుచు రాక్షసేశ్వరుండు ౬౭

## రావణుఁడు విభీషణుం బరిభవించుట

చ. మెఱుఁగును గర్జితంబుగల మేచకమేఘము పర్విన ట్లొఱం
బెఱికిన వాలు కేల జళిపించుచు హుంకృతి భీకరంబుగా
నుఱికి యురంబుదాఁపఁ బిడు గుక్కఱఁదాకిన కొండభంగి వి
ట్టొఱగె నతండు మూర్ఛదనొందిన గద్దియనుండి భూస్థలిన్. ౬౮

వ. కొంతతడవునకుఁ దెలిసి విభీషణుండు ౬౯

క. కామ క్రోధ మదంబులు
నీమనమున నిండియుండ నిర్మలధర్మం
బేమూలనుండు రావణ
నామాటలు సెవులఁ బొచ్చునా నీకింకన్. ౭౦

వ. అనిన విని సైరింపక నిలింపారాతి ప్రహస్తునింజూచి వీనిం గొలువు వెడలఁ
ద్రోవుమని పనిచిన నవ్విభీషణుండు సభామధ్యంబున నిల్చి రావణుం గనుంగొని ౭౧

చ. చనదు మహద్విరోధమని చక్కటి చెప్పిన నింతతప్పునం
గనలితి నీతిశూన్యులకుఁ గార్యములేటికిఁదోచు నిప్డు వే
యును బనిలేదు నీవలన నొప్పని నావచనంబులెల్ల నీ
వవిమొన రాముచేఁబడిన యప్పుడెఱుంగుదుగాక పోయెదన్. ౭౨

వ. అని పలికి వినతుండై తనమంత్రులు నల నీల హిత సంపాతు లనువారలు నలువురుఁ దానును గదాపాణులగుచు నాస్థానంబు వెడలి యేకదండి త్రిదండులగు ననేక వృద్ధ బ్రహ్మరాక్షసులు ధర్మకథ లుపన్యసింప వినుచు ధవళాంబరశోభినియై చిత్రాసనంబున నున్న తల్లిపాలికిం జని నమస్కరించిన నక్కైకశియు నతని నవలోకించి. ౩౩

తే. అన్న నీవు తగవు లన్నకుఁ జెప్పుచు
నున్నమాట లేను విన్నఁగోలె
బెగడుచున్నదాన మొగమొప్పకున్నది
యేమి తెఱఁగు చెప్పవే తనూజ. ౩౪

చ. అనవుడు నాతఁ డిట్లను దశాననుఁ డా రఘునాథు దేవి వం
చనఁగొని వచ్చి లోక మనిశాచరలోకము సేయఁబూనినన్
జనని కడంగి యే నతనిఁ జక్కటిమాటలఁ దేర్చువాడనై
జనపతి విక్రమంబు ఖరుచావును బేర్కొని పెక్కుభంగులన్.

శా. మేలూహించుట సీతఁబుచ్చుటయ సుమ్మీయన్న నమ్మాటకుం
గాలందాఁచి శిరంబుఁద్రుంతుననుచుం గౌక్షేయకం బుత్కట
జ్వాలాభీలముగాఁగ నెత్త సచివుల్ వారించి రుల్కాతతుల్
దూలం గ్రమ్మఱఁజూచి కొల్వువెడలం ద్రోపించినన్ వచ్చితిన్.

క. జననీ రఘుపతి గొలువం
బనివినియెద నీవు తాల్మి పదిలించి మనం
బున దీనికి శోకింపకు
మనవుడు మూర్ఛిల్లి తెలిసి యాసతి సుతుతోన్. ౩౫

చ. వినుము తనూజ నాకు మును విశ్రవసుం డెఱిఁగించినాఁడు మీ
జననము నష్ట మీదనగు సర్వము రావణకుంభకర్ణు లే
పున నొనరించు బాధలొగిఁబోయి నిలింపులు విన్నవింప న
ద్దనుజవిరోధి వీరల వధంబునకై జనియించె రాముఁడై. ౩౬

క. దోషాచరవంశము ని
శ్శేషముగాకొంట రెంటఁ జిక్కనవారిం
బోషింప నీవ నిలుతు వి
భీషణ రఘురాముకరుణఁ బెంపుదలిర్పన్. ౩౭

వ. కావున నీవింక నా శరణాగతవత్సలు నాశ్రయింపం జనుము. తండ్రి మీతండ్రి తపోమహత్త్వంబున హరి హర హిరణ్యగర్భులు, లోకపాలురు, గ్రహతారకంబులు, కులపర్వతంబులు, సముద్రంబులు, మహానదులు, నుభయసంధ్యలు, వేదంబులు, వేదాంగంబులు, నహోరాత్రంబులు నిన్ను రక్షింపనిమ్ము. నెమ్మదింబోయి రమ్మని దీవించిన నతండు నభివందనపూర్వకంబుగా జనయిత్రి వీడ్కొని మంత్రిసమేతుండై గగనమార్గంబునం జన నక్కడ సుగ్రీవుండు అనతిదూరంబునం గనుంగొని కపులతో నిట్లనియె. ౮౦

మ. ఒక నక్తంచరపంచకం బదె కరాళోదగ్ర హేతిద్యుతి
ప్రకరం బీక్షణభీకరంబుగఁ దటిద్భాభాసురంబైన మే
చక మేఘౌఘము పెంపునొంది మనపై సంగ్రామ గర్వంబునన్
బ్రకటంబై చనుదెంచుచున్నది నభోభాగంబునం గంటిరే. ౮౧

క. అనిపలుకఁ ధరులు గిరులుం
గొని యారక్కసుల నేలఁగూల్చెద మనుచున్
వనచరులు సంభ్రమింపఁగఁ
గని యట నెలుఁగెత్తి కుంభకర్ణానుజుఁడున్. ౮౨

ఉ. ఓ కపివీరులార కరుణోదధి నీరఘురాము సర్వలో
కైకశరణ్యునిం గొలువఁగా నిటవచ్చితి, నొండుగాదు నా
రాక, మహాపరాధుఁడగు రావణుతమ్ముఁడ నే విభీషణా
ఖ్యాకుఁడ వీరు నాసచివు లక్కకులాగ్రణితోడఁ జెప్పరే. ౮౩

ఉ. వంచన సీత నేల కొనివచ్చితి రావణ మిన్నకుండి రా
త్రించరవంశ మేల కడతేర్చెదు భూసుత నింక వేగ మొ
ప్పించుటమేలు నా నతఁడు పెంపర నన్నొకనీచుఁబోలె భ
ర్త్సించుచుఁగాలఁదాఁచి నిరసింపఁగఁ బంచె సభాంతరంబునన్.

వ. అనిన విని వానరేంద్రుం డన్నరేంద్రు సన్నిధికేగి యిట్లను. వీరు రావణు వేగులవారు గాఁబోలు. మన మర్మంబు లారయవచ్చినారు. రాక్షసులు మహాసాహసికులు. కామరూపంబులఁ గైకొని వర్తింప నేర్తురు. కాన నమ్మి వీరలం జేరనిచ్చుటుచితంబుగాదు. అట్లుంగాక పగతు తమ్ముండితని నెవ్విధంబునను వధియించుటయు కార్యంబు. అనవుడు నా రఘువరుండు ప్లవంగపుంగవులం గనుంగొని ౮౫

ఆ. రవితనూజుపలుకు లవినీతియుక్తంబు
లగునయ్యెన నీతఁ డన్నతోడ
నలిగివచ్చినాఁడొ యటుగాక సంధి కే
తెంచినాఁడొ మనకుఁ దెలియవలయు. ౮౬

క. అనవుడు నినసుతుఁ డిట్లను
మనుజేశ్వర కరుణ మమ్ము మన్నించు తలం
పున నడిగెదు గా కీవెఱుఁ
గని కార్యస్థితులు పుణ్యజనంబులఁ గలవే. ౮౭

వ. దేవా నీ వవధరించిన యట్టి యీకార్యంబనవుడు నప్పు డంగదుఁ డిట్లను. గుణదోషంబులు విచారించికదా కార్యనిశ్చయంబు. ఇతండు శత్రుండు మిత్రత్వంబు భావింపంజనదనిన జాంబవంతుం డిట్లనియె. ౮౮

తే. ఎట్టివాఁడైన పగఱపై నెత్తినపుడు
విడిచిపోవునె చుట్టంబు నెదురు వేచి
యీతఁ డీవేళఁ దమవారినెల్లఁ బాసి
వచ్చినపుడ విచారింప వలయు ననిన. ౮౯

సీ. హనుమంతుఁ డిట్లను నధిప పంచినచారు
లేఁగియు నింగితం బెఱుఁగ రితఁడు
దుష్టాత్ము నమ్మూర్ఖు దొఱఁగియ రాఁబోలు
నేఁబట్టువడ్డప్పు డితఁడు దూత
దండింపఁ దగదని దశకంఠునకుఁ జెప్పి
నను నాఁడు విడిపించినాఁడు గాన
దోషాచరాకృతి దోఁప దీతనియందు
నయమార్గవరియ నాకుఁజూడ
వాలిఁజంపి మీరు వనచరేశ్వరపట్ట
మినతనూభవునకు నిచ్చుటెఱిఁగి
యన్నఁబాసి రాజ్య మర్థించి నినుఁగొల్వ
వచ్చినాఁడు కానవచ్చుఁగాక. ౯౦

మ. అటుగా కొండు తలంచివచ్చిన తెఱంగైనం గపిశ్రేణి ముం
దటఁ జక్రంజనఁ బోలదెవ్వరికి నీతం డెంతవాఁడన్న న
వ్వటుచూడామణిఁ జూచి రాముఁడను నీవాక్యంబులొప్పం గడుం
గుటిలుండైన భయాతురుం డితనిఁ గైకొంటిం బ్లవంగోత్తమా. ౯౧

ఆ. అభయదానమునకు నశ్వమేధాదులు
వేయు నీడుగావు విశదకీర్తు
లఖిల దిశల నెసఁగు నార్తు రక్షించిన
నట్లుగాన సందియంబు వలదు. ౯౨

క. ఇతఁడనఁగ నెంత శరణా
గతుఁడయిన దశాస్యునైనఁ గాతుఁ నాకుం
బ్రతిన యిదె వేగఁ దోడ్తెం
డితనిం గైకొంటి నభయమిచ్చితి నెమ్మిఁ. ౯౩

వ. అనినం గపినాయకుండు రఘునాయకుం గనుంగొని దేవా దేవర గుణంబులు విచారింప నిదియెంత. మీ రనుగ్రహించి నప్పుడ సర్వగుణ సమగ్రుం డితండు మాకుం బ్రియసఖుండు నిష్ట బంధుండును గా నర్హుండు. మీ యడుగులు గొల్వఁ దోడ్కొని వచ్చెదము గాక యనుచుం దగిన వానరవీరులతోడ నంబరంబున కెగసి తమరాక కెదురువచ్చు నవ్విభీషణు నాలింగనంబుచేసి సముచితాలాపంబుల ముదం బొదవించుచు శ్రీరామచంద్రుండు నీ కభయంబిచ్చె వత్తుగాక యనిన మంత్రి సమేతుండై యతం డిలకు నేతెంచి యారాజ బరమేశ్వరు పురోభాగంబున దండ ప్రణామంబు సేసి నిలిచి కృతాంజలి యగుచు నిట్లనియె. ౯౪

## విభీషణుఁడు శ్రీరాముని శరణుజొచ్చుట

ఉ. అర్కకులాధినాథ శరణాగతవత్సల దేవ యా జగ
త్కర్కశుఁడైన రావణుని తమ్ముఁడనయ్యు భవత్కటాక్ష సం
పర్కమునం గలంకమును బాసితి ధన్యుఁడనైతి నింక నీ
యర్కసుతాదులందొకఁడ నైతిఁ గృతార్థుఁడనైతి నావుడుఁ. ౯౫

మ. కరుణం జల్లెడు చల్లచూపు నిగుడఁ గంభీర వాక్యంబులం
బరమ ప్రీతి జనింపఁగా విభుఁడు సంభావించి నక్తంచరో
త్తర లంకంగల యాతుధానుల భుజాదర్పంబు నీ వేర్పడం
బొరి నాకంతయుఁ జెప్పుమన్న నతఁడా భూపాలుతో నిట్లనున్. ౯౬

వ. దేవా దేవకంటకుండగు దశకంఠుండు బ్రహ్మవరంబున సురాసురాదుల కజేయుండు. ఆతని యనుజుండు నాకగ్రజుండునగు కుంభకర్ణుండు లావున రావణుకంటె నెక్కుడనంగిన శూరుండు. దశగ్రీవున కగ్రతనయుం డింద్రజిత్తనువాఁ డభేద్య కవచుం డనార్యశరాసారుం డలక్ష్యగాత్రుండు నగుచుఁ జిత్రయుద్ధంబులు సేయం బ్రవీణుండు. ప్రహస్తుండను సేనానాయకుండు విక్రమావష్టంభవిజృంభియగు మణిభద్రుండను గంధర్వుం దోలిన వాలుమగండు. జగత్కంపనుండగు నకంపనుండును, కుంభుండును నికుంభుండును మహోదరుండును మహాపార్శ్వుండు నతికాయుండును మహాకాయుండును నరాంతకుండును దేవాంతకుండును నగ్నికేతుండును రశ్మికేతుండు ననువారలు మహావీరులు. దుర్వార బలగర్వంబుల నెవ్వరిం గైకొననివారు. మఱియు నపార సత్త్వసంపన్నులగు దోషాచరభటులు పదివేల కోట్లు లంకానగరనివాసులైనవారు. అనిన రఘువరుండు వీరరసావేశమున ౯౭

క. లోకాలోకము గడచిన
నాకసమున కెగసి చనిన నబ్ధింబడి ద
ర్వీకరలోకము సొచ్చినఁ
బోకార్తు దశాస్యు నతనిపురి నీ కిత్తున్. ౯౮

వ. అని రామచంద్రుండు లక్ష్మణుం గనుంగొని నీవు సముద్రోదకంబులు దెచ్చి లంకారాజ్యంబునకు విభీషణు నభిషేకంబు సేయుమని నియోగించె నా సమయంబున సుగ్రీవుం డిట్లనియె. ౯౯

చ. అనఘచరిత్ర మీకు శరణాగతరక్ష కులవ్రతంబు మీ
సునిశిత బాణజాలముల సోఁకున కోర్వకవచ్చి తా దశా
ననుఁ డభయంబు వేఁడికొనినం దగ వెట్లగునన్న నవ్విభుం
డినసుతుఁజూచి యట్లయిన నిచ్చెదవాని కయోధ్య నావుడున్.

తే. అఖిల వానరవీరులు నయ్యనుగ్ర
హంబుఁ గొనియాడి రంత నయ్యధిపునాజ్ఞ
నట్లు సౌమిత్రియును రాక్షసాధిపత్య
మునకు నభిషిక్తుఁజేసె నిం పెనయ నతని. ౧౦౦

# ౧. మన కర్తవ్యము

— శ్రీ కందుకూరి వీరేశలింగము

మనదేశము తన భావిక్షేమాభివృద్ధుల నిమిత్తమయి యిప్పుడు పిన్నలుగానుండి ముందు పెద్దలు కాఁబోవుచున్న విద్యార్థుల కొఱకె యెంతో యాశతో నెదురుచూచుచున్నది. ఈ ప్రపంచ నాటకమునం దిప్పటి పెద్దలు వినిపించుచున్న కథ యించుమించుగా ముగియవచ్చినది. వారివఱకందఱును వినిపించుచువచ్చిన పురాణకథాశేషమునే వృద్ధవాక్యములతోఁ గొంత కాలము వినిపించి కథాశేషు లయ్యెదరు. ఈ ప్రపంచ నాటకరంగమునందు మహాసామర్థ్యముతో క్రొత్తయాటలాడి హృదయరంజకముగా నూతనకథను వినిపించి సర్వజనులకు సంతోషమును గలిగింపవలసినవారు లేఁబ్రాయములో నున్న యిప్పటి విద్యార్థులే. వీరు తమ కథను జక్కఁగా నేర్చుకొని సర్వజన హృదయాహ్లాదకరముగాఁ బ్రయోగించిన పక్షమున రాఁబోవు విద్యార్థులును వీరిమార్గము నవలంబించి నీతి ప్రధానమైన కథను మఱింత వృద్ధిపఱచి దేశక్షేమలాభముల కొఱకు ధైర్యోత్సాహ సామర్థ్యములతో సర్వత్ర ప్రయోగించుచు వచ్చుటచేత మనదేశ మచిరకాలములోనే భూతలస్వర్గమయి సుఖ సంతోష నిలయము కావచ్చును. మనదేశ మెప్పుడయినను విద్యార్థుల మూలముననే వృద్ధికి రావలసియున్నది. అందుచేత మనదేశము స్వాభివృద్ధి కయి విద్యార్థుల కృషినే నిరీక్షించుచున్నది. దురాచార దూషితములు కాని నిర్మలమనస్సులుగల విద్యార్థులుగాక, సంవత్సర శతములనుండి పరంపరగా వచ్చుచున్న దురాచార వాసనలచేత యుక్తాయుక్త వివేకచింతను విడనాడి కఠినమనస్కులయియున్న వయోధికులు తమ చిన్ననాటి ప్రియల వాటులను మఱచి మనయూహలను, బోధనలను క్రొత్తగా నిప్పుడు నేర్చుకొని తమ ప్రాఁతయూహలను పూర్వాభిప్రాయములను మార్చుకొని దేశాభివృద్ధికయి పాటుపడుట సంభవించునా? వారు తా మభివృద్ధి పొందవలసినట్టియు, నిప్పటి యూహలనుబట్టి యితరుల నభివృద్ధి చేయవలసినట్టియు కాలము దాటిపోయినది. వారిని నూతనమార్గములకు త్రిప్పుటకయి మనము చేయు కృషిసహితము సఫలము కానేరదు. వారిని వారి యూహలకును, వారికర్మలకును, వారి విశ్వాసములకును విడిచిపెట్టి బాగుపడుటకుఁ గావలసినంత యాశయు నవకాశము నున్న చిన్న వారిని మంచిమార్గమునకుఁ దెచ్చుటకయి మన శక్తియుక్తుల నుపయోగింపవలెను.

మనము జనసామాన్యమునకంటె విద్యాధికుల మగుటచేత వారిస్థితిని బాగుపఱుచుటకయి కృషిచేయవలసిన భారమొకటి మనమీఁద పడుచున్నది. విద్య యెక్కువయిన కొలఁదిని విద్యాధిక్యముతో వచ్చు కార్యభారములను సహితము మనము వహించి నిర్వహించుచురావలెను. మనము విద్యా లాభమును మాత్రము పొంది యందువలన మన మీఁదఁబడిన భారమును భరింపనొల్లని పక్షమున ధర్మమును తప్పినవార మగుదుము. మృగమునకును, మనుష్యునకునుగల భేదము స్వార్థపరత్వమును విడుచుటతో నారంభమగును. విద్యాగంధములేక కేవల స్వప్రయోజనపరుఁడుగా నుండువాఁడు మృగప్రాయుఁ డనఁబడును. అట్టి మృగప్రాయుఁ డయిన స్వకార్యధురంధరుఁడు జ్ఞానసౌధముయొక్క యడుగుభాగమునైనను జేరలేక యంధకారబంధురమయిన పాతాళగుహయం దున్నవాఁడగును. వెలుతురులేక చీఁకటిలో నున్నవానికి తన దేహమొక్కటి తక్క వేఱేదియు తోఁపకుండుట వింత కాదుగదా! వాఁడు కొంచెము పయికివచ్చి జ్ఞానసౌధముయొక్క యడుగు భాగమును జేరి వెలుతురులోఁ బ్రవేశింపఁగానే వానికి గోడల నడుమనున్న భాగమును, దానిలో నున్నవారును గానఁబడుదురు. ఈ ప్రకారముగా మృగప్రాయుఁడు గాఢాంధకారమునుండి వెలువడి తన మృగత్వమును గొంత విడిచి కొంచెము మానవత్వమునుబొంది, నాగరికుఁడయి జ్ఞానజ్యోతియొక్క తేజస్సును దర్శింప నారంభింపగానే స్వార్థపరత్వమును గొంచెము విడిచి తన యింటనుండు భార్యాపుత్రాదులను, బంధువులను ప్రేమించి వారి క్షేమమునిమిత్తమయికూడ పాటుపడువాఁడగును. అతఁడే యింకొక మెట్టెక్కి యాపయిని మఱియొక్క మెట్టెక్కి క్రమక్రమముగా జ్ఞానసౌధముయొక్క యుపరిభాగమునకుఁబోయి నలుప్రక్కల దృష్టి వ్యాపింపఁజేసినకొలఁదిని క్రిందనున్నప్పుడు నాలుగుగోడలమధ్య నున్నదితప్ప మఱి యేదియుఁ జూడలేనివాఁ డంతకంతకు చుట్టును నున్న యిండ్లను, గ్రామములను, దేశములను వరుసగాఁ జూడ నారంభించి స్వప్రయోజనపరత్వచింత యంతకంతకు తగ్గుచురాఁగా క్రమక్రమముగా తనవారియిండ్లనియు, తనయూరనియు, తనదేశమనియు నభిమాన మేర్పఱచుకొని తన ప్రేమను వానిమీఁదికి సహితము వ్యాపింపఁజేసి సమయము వచ్చినప్పుడు వాసికని తోడుపడుచు వచ్చును. ఇట్లు దేశాభిమాన మెప్పుడేర్పడునో యప్పుడే దేశక్షేమము చేయవలెనన్న బుద్ధియు పుట్టి, దినదినక్రమమున ప్రేమానుబంధము దృఢపడును. ఆ మనుష్యుఁడే జ్ఞానముయొక్క యున్నత పదవిని బొంది పట్టవలె నుపరిభాగమున కెగసి పయినుండి క్రిందికి చూడఁగలిగిన పక్షమున అప్పుడాతని

దృష్టికి తనయూరును, తనదేశమును మాత్రమేగాక చుట్టునుగల యితర దేశములును గోచరములగును. ఇట్లు పయికెగసినకొలఁదిని వస్తువులు కానఁబడెడురీతిలోఁగూడ నొక విశేషము కలదు. ఉపరిభాగమున కెగసిన కొలఁదిని తన యిల్లంతకంతకు చిన్నదగుచు వచ్చి మిక్కిలి పయికిఁబోయి లోకమునంతనుజూచునప్పుడు తనయి ల్లామధ్య నదృశ్యమగును. ఈ ప్రకారముగానే జ్ఞానముయొక్క మహోన్నత దశను పొందినవాని దృష్టిపథము నందెప్పుడును లోకక్షేమ మంతయు నుండును గాని తన వారియొక్క క్షేమము మాత్రము ప్రత్యేకముగా నుండదు. దీనినిబట్టి విచారింపఁగా జ్ఞానికి ముఖ్యలక్షణము స్వప్రయోజన పరత్వమును పూర్ణముగా విడిచిపెట్టి లోక ప్రయోజనము నిమిత్తమయి చూచుచుండుట యని స్పష్టమగుచున్నది. జ్ఞానమే మనుష్య లక్షణ మగుటచే నిటువంటి లక్షణము గలవాఁడే నిజముగా మనుష్యుఁడని పిలువఁబడుట కర్హుఁడయినవాఁడు.

కాఁబట్టి యెల్లవారును స్వప్రయోజన పరత్వమును విడిచి పరోపకార పరాయణులయి మనుష్యనామమునకు పూర్ణముగా నర్హులగునట్లు ప్రవర్తించుటయే పరమార్థముగా భావించుకొని తమకృషి యంతయు నందునిమిత్తమే యుపయోగింపవలెను. ఇట్టిస్థితిని బొంద ప్రయత్నించుట మనుష్యజన్మ మెత్తినవాని కెల్లను పరమధర్మమే యయినను, అదియందఱికిని సాధ్యము కాకపోవచ్చును. ఎవ్వడును పూర్ణముగా నొకవేళ సాధింపలేక పోయినను పరోపకారము నిమిత్తమయి నిరంతరకృషిని జేయుచుండువాఁడు చాలవఱకు పొందవచ్చుననుట కావంతయు సందేహము లేదు.

ఇంకను బరోపకార మనఁగా నెట్టిది, దానినిచేయు క్రమమెట్టిది దానికయి ప్రయత్నించుటలో మన మాచరింపవలసిన ధర్మములేవి, అను నంశములను గొంచెము విచారింపవలెను. జనసామాన్యమునకు క్షేమాభివృద్ధులు కలిగించుటయే పరోపకార మగుటచేత దానిని గుఱించి చర్చింపవలసిన పనిలేదు. ఇంకను దానిని చేయు మార్గములను గూర్చి కొంచె మాలోచింపవలసి యున్నది. ఈ మార్గములను ప్రతి మనుష్యుఁడును విద్యార్థి దశలో నున్నప్పటినుండియు నేర్చుకొని మొదటినుండియు తదనుష్ఠానమున కర్హుఁడగుటకు కృషి చేయుచుండవలెను. కొందఱనుకొనునట్లు పాఠశాలలో పాఠములు వల్లించుటమాత్రమే విద్యార్థి ధర్మముకాదు. ముందు తన యిహలోక యాత్రకును, సుఖమునకును, దానిమూలమున దేశక్షేమాచరణ

మునకును తా నర్హుఁడగుటకు నేర్చుకొనుటయు విద్యార్థి ధర్మమే. ఈ యవస్థయే లోకమునకుఁ దాను ముం దుపయుక్తుఁడగుటకు నేర్చుకోవలసిన యుక్తకాలమగుటచేత విద్యార్థి యిప్పుడే సద్వర్తనమును, కార్యభారమునకుఁ దగిన నిజమయిన పౌరుషమునుగూడ నభ్యసింపవలెను. దేహబలము గలవారి మీఁద విద్యాబలము గలవారే లోకములో నధికారము చెల్లింపవల సిన వారయి యుండుటచేత వా రెప్పుడయినను మూఢజనులకు నాయకు లుగా నేర్పడి వారిని మంచిమార్గమున నడిపి దేశాభివృద్ధి చేయవలసిన వారే కాని పామరుల మెప్పును, స్తుతులను గోరి తమ విద్యకును, బుద్ధికిని అవమానము కలుగునట్లుగా వారిచే నడుపఁబడవలసినవారు కాఁగూడదు.

దేశాభివృద్ధికయి యాచరింపవలసిన ధర్మము లనేక విధములయి యున్నవి. ఈ దేశాభివృద్ధి మొట్టమొదట తనతో నారంభము కావలెను. అటు పిమ్మట తన కుటుంబమునకును, తన గ్రామమునకును, తన దేశమునకును క్రమక్రమముగా లోకమంతకును వ్యాపింపవలెను. మన యభివృద్ధికయి మొట్టమొదట నీశ్వరభక్తియు, సత్యానురక్తియు, ధర్మపరత్వమును, దుష్కర్మవిముఖత్వమును గలవారమయి మనయిహలోకయాత్రను పరిశు ద్ధముగాను సుఖప్రదముగాను జేసికొని మనల నీశ్వరుఁ డీ లోకమునుండి యే నిమిషమున తొలగింపనుద్దేశించినను శాశ్వతానందమును పొందుట కర్హు లముగా నుండునట్లు సదా ప్రవర్తించుచుండవలయును. మనలను సన్మా ర్గమునుండి తొలఁగించుటకై యింద్రియ సుఖవాంఛాదులను లుబ్ధులు సుఖాభాసబీజములను జవిచూపి వేఁటఁగాడు నూకలు చల్లి పిట్టల నాకర్షించు నట్లుగా మనహృదయఖగముల నాకర్షించుచుండును.

ఇట్లు విషయసుఖములు మనలను ధర్మపథమునుండి యాకర్షించిన ప్పుడు వలలోఁ బడితిమేని పాపకిరాతబృందములు మనలను బట్టుకొని బాధించి సకలాకృత్యములకును లోఁబఱచును. కాఁబట్టి మనజీవనమును పరిశుద్ధమయిన దానినిగాఁ గాపాడుకొనుట కయి మన మెల్లప్పుడును పాపము లనెడు శత్రువులతో పోరాడుచుండి వానిని మనహృదయ దుర్గము లను జేరనీయక తఱుముచుండ వలయును. బాహ్యశత్రువులతోఁ బోరాడు టకంటె నంతశ్శత్రువులయిన పాపములతోఁ బోరాడి వానిని నిర్జింపఁగలుగు టయే మన కెక్కువపౌరుషము. ఈ పాపశత్రువులను పూర్ణముగాజయించి పాఱఁదోలఁగలుగుట యీశ్వరసాహాయ్యములేక మన యల్పశక్తులకు సాధ్యముకాదు. ఈశ్వరసాహాయ్యమును బొందుటకై యీశ్వరారాధనము

కావలెను. ఈశ్వరునియందు పూర్ణమయిన ప్రేమను, విశ్వాసమును ఉంచి పాపశత్రువులనుండి కాపాడి యాత్మసుఖము ననుగ్రహింప నీశ్వరుని హృదయపూర్వకముగా ప్రార్థించుచు, ఈశ్వరాజ్ఞలను మీఱినందునకై పశ్చాత్తాపపడుచు, సర్వకార్యములయందును నాతనిచిత్తవృత్తి ననుసరించి వర్తించుచుండుటయే యీశ్వరారాధనము. ఈ యీశ్వరారాధనమును మఱచి యాత్మశక్తిని నమ్ముకొని కొంచె మేమఱియుండినపక్షమున, పాపపిశాచము దొంగవలె మనహృదయసదనమునందుఁ బ్రవేశించి యక్కడినుండి యీశ్వర భక్తిధనము నపహరించి మనలను దుఃఖముల పాలుచేయును. కాఁబట్టి పాపతస్కరుఁడు మన మనోవీథియందుఁ బ్రవేశింపఁగానే తెలిసికొని పరితాప పడి యీశ్వరుని ప్రార్థించి పాపమును బాఱఁదోలుటకై పిలిచి సేవించిన పక్షమున మనమనస్సులు మరల నిర్మలములగును. ఈశ్వరు నారాధింప వలసిన యీ ధర్మమే మతధర్మ మనఁబడును ఇదియే ధర్మము లన్నిటిలోను బ్రధానధర్మము; సమస్తసుఖప్రదాయకము. పాప మేమూలనయిన హృదయములోఁ బ్రవేశించి దాగియున్న దేమోయని యాత్మశోధనము చేయుచు నిత్యము నీశ్వరారాధనము చేయుచు మనవర్తనమును పరిశుద్ధమయిన దానినిగాఁ జేసికొనుచుండుటయే కాక మన బంధు మిత్రాదులను గూడఁ బరిశుద్ధులనుగాను, జ్ఞానులనుగాను, సుఖపడువారినిగాను జేయుచుండుట మన రెండవ ధర్మము.

ఇట్లన్యోన్యసుఖము నిమిత్తమయి పరస్పరసాహాయ్యముచేసికొను మనుష్యుల గుంపంతయుఁ జేరి కుల మనఁబడును. కులమనుశబ్దమునకు సమూహమని యర్థము. పరస్పరసుఖము నిమిత్తమయి జను లొండొరులలోఁ జేసికొనవలసిన ధర్మములు కులధర్మము లనఁబడును. ఇతరులను సుఖులనుగాఁజేయుటకుఁ దగిన బుద్ధియు, శక్తియు మనలో నీశ్వరుఁ డిమిడ్చి యుండుటచేతనే మనుష్యుఁడు మృగాదులకంటె నధికుఁ డగుచున్నాఁడు; ఆ బుద్ధిని శక్తిని లోకముయొక్క క్షేమాభివృద్ధుల నిమిత్త మెంతయెక్కువగా నుపయోగించిన మనుష్యుని కంతయెక్కువ ఘనతవచ్చును. ఈ లోకములో సమస్తసుఖములును, సమస్త క్షేమములును మతముయొక్క పరిశుద్ధత ననుసరించియే యుండునుగాన మనము జన సంఘముయొక్క క్షేమము నిమిత్తమయి చేయవలసిన మొదటి యుపకారము మతమును సాధ్యమయినంత పరిశుద్ధమయిన దానినిగా జేయఁబ్రయత్నించుట. ఈ ప్రయత్నములో మూఢజనులవలన ననేకకష్టములు సంభవించును. లోకములో నేపనియు కష్టపడక నెఱవేఱదుగనుక, మనము కులాచార సంస్కరణము నందును

కష్టములకు సహించి స్వప్రయోజనపరత్వమును త్యజించి యీశ్వర ప్రీతికరముగా పనిచేయవలెను. దేశాభివృద్ధి యెప్పుడును తమక్షేమమునకంటె లోకక్షేమమే యెక్కువగా భావించి తమప్రాణములను, శక్తులను, సంపదలను దేశమునకుధారపోసెడు పుణ్యపురుషులచేతనే యగుచువచ్చినది గాని యేదేశమునందును స్వప్రయోజనపరుల చేతను, కుక్షింభరులచేతను, స్వకుటుంబ పోషణ ధనార్జన పరాయణతాధురంధరుల జేతనుకాలేదు. కేవల కుక్షింభరులమైనపక్షమున మనకు మృగాదులకంటె నాధిక్యమేదియులేదు. మనకు ధనార్జనమే ముఖ్యకర్తవ్యముకాదు. మనము లోకములో నెంతధన మార్జించినను, అల్పకాలోపయుక్తమయినదే కాని యది స్థిరమయినది కానేరదు. మనము కష్టపడి సంపాదించిన గృహములును, ధనమును మనతోరాక యెప్పటిచోటనే యుండి కొన్నిసమయములయందు మన మరణానంతరమున బంధుపుత్రాదులకు కలహ కారణములుసహిత మగును. మనము న్యాయముగా నార్జించినధనమే మృత్యుదేవత మనకు ధనరక్షణ భారమును తప్పించిన తరువాత మాంసముకొఱకు వేచియున్న గ్రద్దలవలె తాము కష్టపడి గడించుకోక యితరు లార్జించినదాని నపహరింప వేచియుండు బంధువులకు కలహకారణమును, దుఃఖకారణము నగుచున్నప్పు డాధన మన్యాయార్జిత మగునేని చెప్పవలసినపని యేమున్నది? అప్పుడది దానిని పొందువారికేకాక గడించిన వానికిని దుఃఖహేతువగును. కాఁబట్టి మనల నెప్పుడో యొకప్పుడు విడిచిపోవునట్టియు, దుఃఖకరమగునట్టియు ధనమును కావలసిన దానికంటె నధికముగా సంపాదించి కూడఁబెట్టుటకు యత్నింపక మరణానంతరమున సహితము మనలను విడువక తోడుపడి సుఖమిచ్చెడు సత్యధర్మరూపమయిన సుస్థిరధనమును నార్జించుటకయి మనుష్యుఁ డధికకృషి చేయవలెను. ఇతరులకు మనము చేయవలసిన రెండవ యుపకారము దుర్నీతి దురాచారములను తొలఁగించి వారిని నీతిమంతులనుగాఁజేయుట. సత్యవర్తనముగలిగి యితరులను వంచింపక పరస్త్రీ పరధనాదుల కాశపడక న్యాయమార్గమున సంచరించుట నీతి యనఁబడును. నీతిని విడిచిన మత ముండనేరదు. జనసామాన్యముయొక్క క్షేమసంతోషములకు పరిశుద్ధమయిన యీశ్వరోపాసన మెట్లావశ్యకమో యట్లే నీతివర్తనము నావశ్యకమయినదగుట చేత దానిని స్థాపించుటకుఁగూడ మనము విశేషప్రయాసము పడవలసియున్నది. కొందఱు మనదేశములో మతము పేరు చెప్పియే నీతి బాహ్యములయిన దుష్కృత్యము లనేకములుచేసి చేయించి హృదయమునుండి దయాగుణమును తొలగించి కొంతవఱకు మనుష్య స్వభావమునే రూపుమాపు

చున్నారు. దేవుఁడందఱియందును సమానదయ గలవాఁడయి మనకిచ్చిన మృదుహృదయములనే వారికిని ప్రసాదించినప్పుడు మత ధర్మములలో నిట్టి వ్యత్యాస మేల కలుగవలెనని యాలోచింపఁగా వారు దేవుఁ డనుగ్రహించిన స్వాభావిక మతమును విడిచి మనుష్య కల్పితములయిన యస్వాభావిక మతముల నవలంబించుటవలన నీయనర్థమంతయు పొసఁగినదని స్పష్టపడుచున్నది. మతముతో చేరియున్నను, చేరియుండకపోయినను సమస్తవిధములైన దుర్నీతులను తొలఁగించుట దేశక్షేమమున కత్యావశ్యకము. కాఁబట్టి విద్యాధికులయిన వారందఱును నీతిమతవిషయముల రెంటియందును గల దోషముల నితరులకుఁ జూపి వానిని వారు దిద్దుకొనునట్లు చేయవలెను. జనులు తమ దోషములను దిద్దుకోలేకపోవుటకుఁ గల యొక గొప్పకారణము దురభిమానము. తానే గొప్పవాఁడ ననియు తనకు తెలియనిదేదియు లేదనియు జనుఁ డెప్పుడు దురభిమానమును పూననారంభించునో యప్పటినుండియు నతఁడు స్వలోపములను దిద్దుకొని యభివృద్ధిని బొందుట కవకాశము లేనివాఁడయి చెడుట కారంభించును. ఈ దురభిమానము జనులందఱిలోను వ్యాపించినపక్షమున దేశముయొక్క దుర్గతి వేఱుగఁ జెప్పవలసినదే లేదు. సమస్త విషయములయందును మన పూర్వులు సర్వజ్ఞులనియు, వారికిఁ దెలియని దితరుల కేదియు తెలియదనియు, మన మితర దేశస్థులవలన నేర్చుకోవలసిన దేదియు లేదనియు మన వారిలో నొక దురభిమానము బలిసియున్నది. ఈ దురతిశయమే మనవారిని తమ దోషములను విమర్శించి తెలిసికొననీయకయు, నితరుల గుణాంశములను గ్రహింపనీయకయు దేశము నంతకంతకు చెఱుపుచున్నది. జనులకు నాయకులయి నడప నపేక్షగలవారు కొందఱు తమ వారి తప్పులను జూపి దిద్దింపఁ జూడక తుచ్ఛమయిన జనుల మెప్పున కాశపడి సర్వవిషయములయందును మన పూర్వులు పరిపూర్ణులని బోధించి స్తుతించి జనులలో దురభిమానమును, దురతిశయమును బలియునట్లుచేసి తా మేమో దేశాభిమాను లయినట్లు నటించుచున్నారు. దేశాభిమాన మెప్పుడును జనుల లోపములను జూపి వానిని తొలఁగింపఁ బాటుపడుటలో నుండునుగాని నీచమయిన పామరజనానురాగము నపేక్షించి వారిదోషములను గుణములని భూషించి దేశ మభివృద్ధి పొందకుండ చెడఁగొట్టుటలో నుండదు. ఈ యపూర్వదేశాభిమానులు క్షణభంగురమయిన మూఢజనానురాగము నిమిత్తము వారి మూఢవిశ్వాసములను, మూఢాచారములను భూషించుటయేకాక వారితోఁగలిసి వానిని సంస్కరింపఁ గోరువారి నెల్ల బరిహసించుటలో నఖండపాండిత్యమును జూపుచున్నారు. ఇట్లు చేయుట దేశాభిమాని

లక్షణము కాదు. నిజమయిన దేశాభిమాని యెప్పుడును పరోపకారచింతయు, ధర్మచింతయుఁగలవాఁడయి తనవారి లోపములను పాపములను నిర్భయముగా విప్పిచూపును. ఇట్లుచూపుటవలన దురభిమానులు దూషించి ద్వేషించుటయు, కపటదేశాభిమానులు పరిహసించుటయు సంభవించును. అయినను దేశాభిమాన మాననీయుఁడు దేశక్షేమమునే మనస్సునందుంచుకొని యట్టిదౌర్జన్యములకెల్ల తలయొగ్గి స్వకృత్యమును ధైర్యముతో నిర్వహించుచు రావలెను. ఇట్లు చేయక విద్యాధికులు తమ వివేకములు పాతిపెట్టి జనులకు నాయకులు కావలెనన్న దురాశచేత స్తోత్రప్రియులయి విద్యావిహీనుల మూఢ విశ్వాసములను శ్లాఘించుచు వారిచే మంచివారనిపించుకొనుటకయి వారివలె మాటాడుచు వారివలె వర్తించెడుపక్షమున నచిరకాలములోనే తాముసు మూఢులయి మూఢులకు నాయకులగుటకు మారుగా మూఢులకు దాసులయి మూఢులను నడుపుచున్నామన్న భ్రమతో మూఢులచే నడపఁబడువారయి విద్యాధికులన్న పేరున కపాత్రులగుదురు.

విద్యాధికులమాట యటుండఁగా స్వగౌరవమునందు దృష్టిగల విద్యార్థులు సహితము తా మభ్యసించుచున్న విద్యకును, బుద్ధికిని నపఖ్యాతి కలుగునట్లుగా నిటువంటి యపాత్రుపుఁబనికి లోఁబడఁజూతురా? ధర్మశూరులయి తాము సత్యమని న్యాయమని నమ్మిన రీతిగాఁ బ్రవర్తించుచుఁ దాము నమ్మినట్లుగా నితరులకు నిశ్శంకముగా బోధింపక మూఢుల మెప్పునకై మూఢవిశ్వాసములను, దురాచార దోషములను శ్లాఘింపఁ జూతురా? పామరజనవిరోధమునకు భయపడి సత్కార్యపక్షమున నిలిచి సత్కార్యాచరణ ధైర్యము చూపలేని మగవా రెన్నఁడయిన నాయకులగుదురా? జనద్వేషమునకును, పరిహాసములకును, బాధలకును వెనుదీయక పామరుల యొక్కయు, ధర్మభీరుల యొక్కయు దురభిప్రాయమును గణనచేయక యితరులతోడు లేకపోయినను భయపడక యసహాయశూరులై యప్రియమయిన సత్యమార్గమును జూపు ధైర్యముగల పౌరుషభూషితులే కడపట నాయకులగుదురు. అట్టివారు మొదట కొంతకాలము దూషింపఁబడువా రయినను తరువాత చిరకాలము భూషింపబడువా రగుదురు. గుణాగుణగ్రహణము చాలని పామరుల మెప్పుతో మనకేమి ప్రయోజనము? మనపనినిజూచి తెలిసినవారు మెచ్చుకొన్నప్పటివలె నవివేకులు మెచ్చుకొన్నప్పుడు సంతోషము కలుగునా? అనభిజ్ఞులు వేయిమంది మెచ్చుకొనుటకంటె నభిజ్ఞుఁడయినవాఁ డొక్కఁడు మెచ్చుకొనుట శ్రేష్ఠతరము కాదా? కాఁబట్టి మన కెప్పుడును బుద్ధిమంతుల యొక్కయు మంచివారి యొక్కయు మెప్పుమాత్రమే యపే

క్షణీయము. జనులలో విశేషసంఖ్యాకు లెప్పుడును విమర్శలేని మూఢశిరోమ ణులుగా నుండురుగాన వారిమెప్పెప్పుడును కోరఁదగినదే కాదు. కాఁబట్టి మంచివా రందఱికంటె నెక్కువ మంచివాడును, బుద్ధిమంతు లందఱికంటె నధికబుద్ధిమంతుఁడును, వివేకు లందఱికంటె ఘనవివేకియు నయిన యొక్క యీశ్వరుని మెప్పునకయి మాత్రమే మనము చూడవలెను. అతని మెప్పొక్కటియే శాశ్వతమైనది. తక్కిన మెప్పులన్నియు నెండమావుల వంటివి. కాఁబట్టి యెవ్వరేవిధమున దూషించినను పాటిగాఁ బట్టక మత విషయమునందును, కులాచార విషయములందును, నీతివిషయములందును జనుల మెప్పును కొరక ఈశ్వరప్రీతిని మాత్రమేకోరి, సర్వాపదలకునోర్చి దేశ క్షేమమునకయి పాటుపడవలెను.

మనము జనులకుఁ జేయవలసిన యింకొక యుపకారము కుల స్త్రీల లోను, సామాన్యజనులలోను విద్యాభివృద్ధిజేయుట. మనమెంత తెలివిగలవా రమైనను మన స్త్రీలను, మనపొరుగువారిని మనతో సమానముగా తెలివిగల వారినిగాఁ జేయక వారిని మూఢత్వములో నుంచిన పక్షమున మనము విద్యా లాభమువలన సంతోషమును పూర్ణముగా పొందలేక పోవుటయేకాక వారి మూఢత్వమునుబట్టి మన మనేక కష్టములు పడవలసినవార మగుదుము.

జనులకును, స్త్రీలకును సద్విద్య చెప్పించిన పక్షమున ననేక దురా చారములను వారే తొలగించుకొని దేశక్షేమమునకు తోడుపడుదురు. అనేక కష్టములను మఱపించి హృదయము నానందపరవశముగాఁజేసి మనకాంత లను దేవతాకాంతలనుగాను, మన గృహములను భూలోకస్వర్గములనుగాను మార్చెడి యద్భుత శక్తి గల గానవిద్యను కులాంగనలకు నేర్పి కుటుంబ ములు సంతోషస్థానములగునట్లు చేయుటయేకాక, అమృతోపమాన మయిన యా సద్విద్యను పండువంటి సంసారములను పాడుచేయుటకు కంకణము కట్టుకొన్నట్టియు, పాతకములలో కెల్లను ఘోరపాతకమయిన జారత్వమును కులవిద్యనుగాఁ జేసికొనుటచే మానవజాతి కంతకును దీఱనియవమానము తెచ్చుచున్నట్టియు వేశ్యలను పేరుగల పెనుభూతముల చేతులలోనుండి విడిపించుట కయి ప్రయత్నించుట దేశాభిమాన లేశము గలవారి కందఱికిని ముఖ్యకర్తవ్యము. స్త్రీలకు నీతివిద్య మొదలగునవి యావశ్యకము లని ప్రత్యేకముగాఁ జెప్పవలసినపని లేదు. తల్లియయి బిడ్డలకు విద్యాబుద్ధులు నేర్పవలసినదియు, గృహమునకు రాణియై కుటుంబపరిపాలనము చేయ వలసినదియు గృహపత్నియే యగుటచేత, తన సద్వర్తనమునుజూచి బిడ్డలు

సద్వర్తనము నేర్చుకొని వర్తించునట్లు చేయుటకును ఏకేశ్వరారాధనముచేయు చు సమస్త సద్విషయములయందును విద్యాధికుఁ డయిన భర్తతో నేకీభవించి లోకోపకారకార్యములయం దెల్ల నాతనికి నిజమైన సహధర్మచారిణిగా నుం డునట్లుచేయుటకును గావలసినంతవిద్యను సంసారమును ససారముగాఁ జేసికొని సుఖింపఁగోరు ప్రతిపురుషుఁడును గృహిణికి తప్పక చెప్పించవలెను. పురుషునకు భార్య యర్ధశరీర మగుట సర్వజనాదరణీయమైన నిర్వివా దాంశ మగుటచేత భార్య విద్యాగంధములేని మూఢురాలగునేని యాయర్ధ శరీరము పక్షవాతపీడిత మయినట్లు కదలక మూఢత్వభారముచే సదా క్రిం దికి దిగలాగుచుండుటనుబట్టి చదువుకొన్నభర్త సంసారసముద్రములో సుఖ ముగా తేలలేక యజ్ఞానాంధకారములో విచార జలావర్తమునందుఁబడి తల క్రిందుగా మునిఁగిపోవును; అట్లుగాక భార్య జ్ఞానవాసనగల విద్యావంతురా లగునేని యాయర్ధశరీర మారోగ్యోత్తేజిత మయినట్లు కరలాఘవము చూపి వివేకప్లవముచే సదా పయికి తేల్చుచుండుటనుబట్టి చదువుకొన్న భర్త సం సారసాగరములో సుఖముగా నీఁదుచు జ్ఞాన తేజస్సులో నానంద ద్వీపము ను జేరి తరించును. కాఁబట్టి విద్యాధికు లయినవారు తమ భార్యలకును, తోడఁబుట్టిన పడుచులకును, కూఁతులకును సద్విద్యను జెప్పించి తమతో సమాన వివేకముగల వారినిగాఁ జేయుటకయి సర్వప్రయత్నములను జేయ వలెను. అజ్ఞానాంధకారమునఁబడి జ్ఞానతేజోదర్శనములేక పుట్టుగ్రుడ్లవలె నున్న మనదేశపు కులాంగనల కన్నులు తెఱచి విద్యాదీపముచేత వారికి పదా ర్థవిజ్ఞానము కలుగఁజేసి యననుభూతపూర్వమయిన నూతనసుఖమును లభింపఁజేయుటకయి కృషిచేయుట పురుషనామధారుల కెల్లను బరమ ధర్మము. ప్రతివిద్యాధికునికి స్త్రీవిద్యాభివృద్ధిని జేయుటయెంతధర్మమో జనసంఘమునకు విద్యాభివృద్ధి చేయుటయు నంతధర్మమే. విశేషసంఖ్యాకు లెల్లయెడల నజ్ఞానాంధకారములోఁ గన్నుగానక యంధులవలెతడవులాడుచు కష్టపడుచుండఁగా వారిమధ్య నల్ప సంఖ్యాకు లక్కడక్కడఁ గన్నుతెఱచి జ్ఞానదీపముచే వారిదురవస్థను జూడఁగలిగియు దయతో వారిగతిబాగుచేయఁ జూడక స్వసుఖమును జూచుకొనుచుండుట మానవధర్మమగునా? జనబా హుళ్యము జ్ఞానమునం దభివృద్ధిని బొందినగాని దేశమభివృద్ధి పొందనేరదు. అందఱును మూఢులయి కొందఱుమాత్రము వివేకులగుటచేత మూఢజనపరి వృతులయిన విద్యాధికులకును సంసర్గదోషమువలన బహునష్టములు కలుగును. కాఁబట్టి విద్యాధికులు తాము పొందిన విద్యాలాభమును జనసా మాన్యమునకును గలిగించుటకయి శ్రమపడవలెను.

రాజ్యాంగవిషయములయిన స్వాతంత్ర్యములనుగూర్చి ప్రజలకు తెలివి గలిగించుటయు జనులకొక యుపకారమే. పూర్వోక్తములయిన మత నీతి కుల జ్ఞానవిషయములు నాలిగింటియందును పనిచేయువారిప్పుడంతగా మనదేశమునందుఁ గానఁబడకపోయినను రాజ్యాంగ విషయములయందు ప్రసంగించుటకు మాత్ర మనేక వక్తలు బయలుదేఱుచున్నారు. మతసంస్కారాదులలో బయలుదేఱక రాజ్యాంగ విషయములలోమాత్ర మింత మంది దేశాభిమానులు బయలుదేఱుటకు కారణమేమని కొందఱడుగ వచ్చును. రాజ్యాంగవిషయములందు శ్రమ పడవలసిన యక్కఱలేకయే సులభముగా ప్రసిద్ధివచ్చుటయు స్వప్రయోజనపరత్వమును గొంతవఱకీ సాహసమునకుఁ గారణములని తోఁచుచున్నది. కొంచెము చదువుకొన్నవాడెల్లను తాను ప్రభువయి స్థానిక ప్రభుత్వము చేయుట కర్హుడనయినాననుకొని తనకు జనపరిపాలకత్వము లభింపవచ్చునన్న యాశతో పనిచేయుచుండవచ్చును. అయినను రాజ్యాంగ విషయములందు సహితము స్వప్రయోజన పరులుచేయు కృషివలన నిజమయిన స్వాతంత్ర్యములును, లాభములును కలుగనేరవు. మనము ముందుగా నీతియందువృద్ధిపొందినంగాని రాజ్యాంగ స్వాతంత్ర్యములను పొందుట కర్హులము కాఁజాలము. నీతి వృద్ధికి మతాభివృద్ధి కావలెను. మన మతసత్యము లనేకములు దేశభాషలలోలేక జనసామాన్య దురవగాహమయిన సంస్కృతభాషలోనుండి జనసంఘమున కందని మ్రానిపండ్లయి స్వార్థపరులైన మతాచార్యుల పిడికిళ్ళలోనుండి విపరీత ప్రయోజనముకలవయి శిష్యహృత్తాపహారులుగాక విత్తాపహారులుమాత్రమయి యున్న గురువులకు జీవనాధారము లగుచున్నవి. రాజ్యాంగ స్వాతంత్ర్యముల నిమిత్తమయి యత్నించుట కంటె ముందుగా మన కులాచారాదులను సంస్కరించుకొని తత్స్వాతంత్ర్యములను పొందుటకయి కృషిచేయవలెను. ఇంటి గాఢాంధకారమును తొలఁగించుకోలేనివాఁడు బయట వెలుతురు నెట్లు వ్యాపింపఁజేయఁగలుగును? మన భార్యలు విద్యాదీపములేక యవిద్యాంధకారములో మునిఁగియుండఁగాను, మనబాలురు మంచి నీతియు మతమును లేక చెడుత్రోవలు త్రొక్కుచుండఁగాను, మన వితంతు పుత్రికలు మన యనాదరముచేత ననాథలయి యావజ్జీవనము సుఖహీనలయి బాధపడుచుండఁగాను స్వగృహమును బాగుచేసికోలేని మనము దేశమునెట్లు బాగుచేయఁగలుగుదుము? మన భార్యాపుత్ర బంధువర్గమును ప్రేమించి మంచిస్థితికి దీసికొనిరాలేని మనము లోకము నెట్లు మంచి దశకు దీసికొని రానేర్తుము?

మన మిప్పటికి భార్యతోఁగూడి బహిరంగముగా భోజనముచేయుటకు సాహసింపలేము; కుటుంబమునంతను ముందుంచుకొని కలిసి యేకేశ్వరుని ప్రార్థన చేయలేము; అతిబాల్య వివాహములను మానలేము; ఇతర దురాచారములను విడువలేము. ఇట్టి యల్పాంశములలో మనము బాగుపడి మన కుటుంబమును బాగుపఱచుకోలేని మనము లోకము నేమియుద్ధరింపఁగలుగుదుము? బాహ్యరోగములచే దేహములు కృశించుచున్నప్పుడు ఖేదపడి మందులు వేయించుకొనుచున్నట్లే పాపరోగములచే మన యాత్మలు కృశించుచున్నప్పుడు దుఃఖపడి తన్నివారణార్థమయి యీశ్వర ప్రేమామృతౌషధము నేల పానముచేయఁ బ్రయత్నింపరాదు? పొలములలో పయిరుపెట్టి తోఁటలువేసి ఫలానుభవము నపేక్షించునట్లు బీడుపడియున్న మన హృదయక్షేత్రములను బాగుచేసికొని భక్తిసస్యములను పుణ్యఫలవృక్షములను వృద్ధిపొందించి పాపకంటకములను పెల్లగించి యేల శాశ్వతములయిన సత్ఫలములనుబొంది సుఖింపఁబాటుపడరాదు? ఈ పనుల కన్నిటికిని బ్రతిబంధములు మనము సత్యములని ధర్మములని నమ్మినవాని ననుష్ఠించుటకు ధైర్యము పూనలేకపోవుట. మనము వట్టి బోధనలు చేయుటకంటె బోధించిన ధర్మముల ననుష్ఠించి చూపుట మన కధికకర్తవ్యము. అనుష్ఠానము లేకపోయినపక్షమున మన యుపదేశములన్నియు నున్మత్తప్రలాపములవంటివయి నిష్ఫలమగును. స్వప్రయోజనపరత్వమువలనను, మాంద్యమువలనను, ఉపేక్షవలనను, భయమువలనను మనకు ధర్మమయిన పనిని చేయుటకు మనము వెనుకతీసినపక్షమున మన మొక్కరమే చెడుటకాక కపటవర్తనులనుజేసి మనసంతతివారికి సహితము చెఱుపుచేసినవారమగుదుము. మన మనోనిశ్చయ ప్రకారముగా నడుచుకొన్న యెడల మనకీలోకములో మూఢులవలనఁ గొన్ని కష్టములు రావచ్చును, వచ్చిననేమి? రానిండు. మనకు దేశాభిమానమున్న పక్షమునను, సత్యాదరమున్న పక్షమునను, ఈశ్వర భక్తియున్న పక్షమునను, కష్టములకు వెఱచి మన మణుమాత్రమును సత్కార్యములనుండి మరలరాదు. కార్యసాఫల్యమునకయి మనమెప్పుడును కష్టములతో పెనఁగులాడుచునే యుండవలెను. అదియే దేవుని యేర్పాటు. ఆ కష్టములతోడి పోరాటమువలననే మనము మనోదార్ఢ్యమునుబొంది కార్యదక్షుల మగుదుము. మన సత్కార్యాచరణమువలన మన కిక్కడ కష్టములే కలుగుచున్నను లోకమునకైనను మేలుకలుగకపోదు; మన సద్వర్తనమునుజూచి యనేకులు మంచి నడత నేర్చుకొని సుఖపడకపోరు. అందుచేత మనము మృతులమయినను, మన కార్యములమూలమున భూమిమీఁద నెప్పుడును జీవించియున్నవారమే

యగుదుము. కాఁబట్టి మిత్రులారా! మీయుపేక్షను, మాంద్యమును విడిచి యిఁకనైన సత్కార్యములకు దీక్షవహింపుఁడు; మాటలు చాలించి శీఘ్రముగా కార్యములకు పూనుఁడు. ధర్మచింతయు, నీశ్వరభక్తియు లేకపోవుట చేత నాచరణము లేక యుపన్యాసములును, సభలును వ్యర్థములగుచున్నవి. కాఁబట్టి ధర్మచింతను, ఈశ్వరభక్తిని గలవారమై పరిశుద్ధజీవనములను బొంది మృగస్థితినుండి దేవస్థితికి లేవఁ బ్రయత్నింతము. మన కిట్టిపనులకు ధైర్యసాహసములనుగలిగింప సర్వాభీష్ట ఫలప్రదాతయైన పరమేశ్వరుని త్రికరణశుద్ధిగా వేఁడుకొందము.

# ౨. కవి

—శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహము

జంఘాలశాస్త్రి ఇట్లుపలికెను:

ఎక్కడజూచిన జిగజిగ, ఎక్కడజూచిన మిలమిల, ఎక్కడజూచిన నీరు, ఎక్కడజూచిన పరిమళము, ఎక్కడజూచిన వెలుగు, ఎక్కడజూచిన బయలు, ఎక్కడజూచిన రంగు. ఆహాహా! ఏమిదింత! ఏమిచిత్రము! పచ్చని బయళ్ళు! ఫలములతో నిండినచెట్లు, పుష్పములు గుత్తులు గుత్తులుగానున్న లతలు, భూమినుండి యుబికి యుబ్బెత్తుగలేచు కొండలు, స్వాదుజలభరితములగు నదులు, నొడ్డులేని సముద్రము, నంతములేని యాకాశము, తేజోమయములగు గ్రహములు, కంటికి తేజము, చెవికి హాయి, యొడలికి చలువ, ఘ్రాణమునకు సౌరభము, జిహ్వకు రుచినిచ్చునవిగదా! ఈ తేజము కంటె, నీహాయికంటె, నీచలువకంటె, నీసౌరభముకంటె, నీరుచికంటె, విలక్షణమైన, యాశ్చర్యకరమైన, యనుభవైకవేద్యమైన, యానందము ప్రకృతి దర్శనమున మనస్సున గల్గుచున్నదిగదా! ఆ యానంద ప్రభావమున మనసిట్టియిట్టి తెలికయై, అట్టియట్టి విస్తీర్ణమై ప్రకృతియందు వ్యాప్తమై లీనమైపోవుచున్నదిగదా! ఏవస్తువును గాంచిన సౌందర్యామృతము వర్షించుచున్నట్లగపడుచున్నదిగదా! ఆహా! ఆకసమున నీవైపునుండి యావైపునకు వ్యాపించిన యింద్రధనుస్సును జూడగోరి దృష్టి, మనస్సు, నాత్మయు నింద్రధనుస్సు వంపులతో, రంగులతో, వ్యాప్తితో, సౌందర్యముతో గలసి, ప్రకృతి సౌభాగ్యదేవతకు మంగళపుటారతులిచ్చుచున్నవికదా! ఒక్క గులాబిపువ్వులోని సారళ్యము, సౌందర్యము, సౌరభము, నాలోకింపబోయి, యాస్వాదింపబోయి, యనుభవింపబోయి, యాపుష్పసౌభాగ్యములో కలసి, యా కేసర మార్దవమున నార్ద్రమై యామకరంద బిందుసందోహమున లీనమై మనసట్టియట్టి తన్మయత్వమును జెందుచున్నదే! తుట్టతుదకొక గడ్డిపోరకలో బరమేశ్వరుని కరుణ, పరమేశ్వరునిలీల, పరమేశ్వరుని జ్ఞానము, పరమేశ్వరుని యానందము, పరమేశ్వరుని మహిమము, భావించి, ఆ మూర్తిని సేవించి సేవించి, ఆ శక్తిని ధ్యానించి ధ్యానించి తరింపవచ్చునుగదా! ప్రకృతి సామంజస్యమునకు, ప్రకృతి సామీచీన్యమునకు, వలచివలచి వశుఁడై వశుఁడై సౌందర్యగీతము లరచియరచి, వ్యక్తిత్వమును మరచిమరచి, తన్మయుఁడగు నాతఁడు కవి. తానువలచిన ప్రకృతి చూచినకొలఁది, చూచినకొలఁది,

సుందరస్వరూపయై కానబడునే. అఘ్రాణించినకొలది నధిక పరిమళభరి తయై కానబడునే. కౌగిలించినకొలది, కౌగిలించినకొలది, కఠినతలో మెత్తన, మెత్తనలో కఠినత, కఠినతలో కఠినత, మెత్తనలో మెత్తన, వేడిలో జలువ, చలువలో వేడి, వేడిలో వేడి, చలువలో చలువ నిముసనిముసమున కధికత రముగ గానబఱచుచున్నదే. ముద్దుపెట్టినకొలది, పెట్టినకొలది ముద్దులో తేనె, ఆ తేనెలో కలకండ, యా రెంటిలో ద్రాక్షపండ్లరసము, నా మూటిలో పద్మ సౌరభము, అన్నాల్గింటిలో శిరీషపేశలత, క్షణక్షణ ప్రవర్ధమానమగుచు కాన బరచుచున్నదే. ప్రాకులాడినకొలది ప్రాకులాడినకొలది వన్నెలు, చిన్నెలు, వొరగులు, వొయలులు, తళుకులు, బెళుకులు, వగలు, వద్దికలు, నేకోత్తరాభి వృద్ధిగా గానబఱచుచున్నదే! మల్లెపూవులలో, రెల్లుపూవులలో, నట్టెయట్టె మందహాస మొనర్చుచున్నదే. చక్కనిచుక్కల మాటునజేరి, కాముకుడైన కవిని కన్నిట్టె యట్టె గీటుచున్నదే. పర్వతముల ప్రక్కజేరి, తెల్లని జిలుగు పయ్యెదతో పయోధరము లాంధ్రవనితవలె గూఢతయు ప్రత్యక్షతయు గాకుండ మాటుకొనుచు, బయలుసేయుచున్నదే.

అంభోదరముల చెంతనిలచి, మొగము ముడుచుకొని ధుమధుమలా డుచు, కంటివెంట నిప్పులుగ్రక్కుచు, బడబడాయమాన శబ్దములతో కఠో రముగ ఘూంకరించి, ఘూంకరించి, స్త్రీనైజము ననుసరించి, ధారాపాతముగ కన్నీరు విడచుచున్నదే. గంగావాల్గాది ముక్తాహారాలంకృత గళసీమయై, నక్ష త్రవార పుష్పవిరాజిత కేశబంధయై, భానుమండల సిందూరతిలక ప్రభాభా సమాన ఫాలసీమయై, పద్మపన్నీర చంపకశేఫాలికాది పుష్పపరిమళభరిత నిశ్వాసయై, సర్వగోళ సంచలనోద్భూత మహారవ గీతామాధురీ రమాధురీ ణయై, ప్రకాశించు నీ ప్రకృతికాంత చూచిన చూపులకు, పలికిన పలుకు లకు, పాడిన పాటలకు, ఆడిన ఆటలకు, చేసిన చేష్టలకు నధీనుడై పరవ శుడై కవి రసమయుడై విరాజిల్లునే. సర్వాంగసుందరయై, బంగారుప్రాయ మునమున్న వేశ్యాకాంతను విటుడెంత గాఢముగ ప్రేమించునో, ప్రేమించి దాని పాదములయొద్దనే ఈడిగిలబడి, దాని మొగమునందే సదా దృష్టిధ్యాన ముల నిల్పుకొనియుండునో, ప్రకృతి ప్రమదాశిరోమణి నంతకంటె గాఢ ముగ ప్రేమించి, యామె కొంగుదగిలిన జాలునని, ఆమె ముఖసౌరభమబ్బిన భాగ్యమని, ఆమె యవయవవర్తులత కనబడిన నదృష్టమని, అమె చిరునవ్వు వెన్నెలచే మనస్సు చల్లబడిన స్వర్గమని, ఆమె క్రీగంట తన్ను కటాక్షించిన మోక్షమని, కవి యామెను నేత్రపుష్పములచే, వాక్పుష్పములచే, మనః పుష్పముచే నారాధించుచుండునే! అకుపచ్చని యతలపుగాగరా కట్టి, పూల

రవిక దొడిగి, పంటకాలువల యొడ్డునను, జలప్రపాతముల ప్రక్కలను, నటివలె తాండవించుచుండ కవి మహానందమున లయానుసారముగ గీత ములుపాడుచు, చేతులతో దాళములువైచుచుండునే. ఒడలు భయంకర ముగ నదరుచుండ నోటివెంట బొగలు, గంధకపు జ్వాలలు, రాతినీరు గ్రక్కుచు రౌద్రస్వరూపిణియై, చెలరేగుచుండ, నొదిగి, యడగి, శోకసంతప్త చిత్తుడై, కన్నీళ్ళతో కవి కరుణగీతముల బాడుచు, గరగిపోవుచుండునే. పండుటాకుల నడుమ, శిథిలములైన మహాభవనముల నడుమ, సంధ్యా రాగము వెనుక సన్యాసినివలె, కాషాయాంబరధారిణియై, యస్తమించుచున్న సూర్యుని జూచుచు, నాలోచన భావమున నిశ్శబ్దముగ నడగియుండ, కవి జగదశాశ్వతతత్త్వమును, సర్వసంగపరిత్యాగమును బోధించు వైరాగ్యగీత ములు పాడి, తానుకూడ కాషాయమాత్రధారియై, నిర్మలుఁడై, నిర్లేపుఁడై, నిస్సంగియై, నీరయిపోవునే. నవ్విన నొక్కసొగసు, బెదరించిన వేరొక్క సొగసు, శిరఃకంపన మొనర్చిన మఱియొక సొగసు, రౌద్రమున ఝూంకరిం చిన నికనొక్కసొగసు, నేడ్చిన మఱియింక నొక్కసొగసు, బతిమాలిన మఱి మఱి యింక నొక్క సొగసుగల ప్రకృతికాంత కధీనుఁడై కవి సౌందర్య క్షీరవారాశిలో నొకపుడు చేబారలువైచి, యీదుచు మఱియొకపుడు కదలిన ట్లగపడక నిల్వుటీత నీదుచు, వేరొకపుడు రెండుచేతులు జోడించుకొని, వెలి కిలబడి యీదుచు, నింకొకపుడు సౌందర్యామృతమును కడుపునిండగ్రోలి కదలలేకుండ, నలసిసొలసి, యేతరంగముమీదనో తలయుంచి, యొక్క నిమేషకాలము మైమరచి పడియుండునే. నోటివెంట, కనులవెంట, చెవుల వెంట, ముక్కువెంట, లావణ్యామృతము నధికముగా గ్రోలుటచే గెక్కు గెక్కుమనుచు, నూపిరియాడక, బుడుక్కున మునిగి, యొక్కసారి తేలి, మఱియొక్క మున్కలోన మృతమయుఁడై యద్వైతస్థితి నొందునుగదా!

బాహ్యప్రకృతియే యింత యనిర్వర్ణ్యమై, యద్భుతమై, యప్రతిహ తమైయుండ దీనినిమించిన ప్రకృతి వేరొక్కటి యున్నది. అదియే యాంతర ప్రకృతి. బాహ్యప్రకృతి యెంత వివిధమో, యెంతవిపులమో, యెంత విస్మ యజనకమో, అంతరప్రకృతి యంతకంటె వివిధము, అంతకంటె విపులము, అంతకంటె విస్మయజనకము. దానిలో ప్రకాశించుచున్నది యెండయా కాదు, వెన్నెలయా కాదు. ఎండయు వెన్నెలయుకలసి, యెండయు వెన్నె లయుకాని యొక వింతకాంతియై, వింతలలో వింతయై వెలిగిపోవుచున్నదే. లక్షసూర్యులు, కోటిచంద్రు లొక దాని ప్రక్క నొక్కటి, యొకదానిలో నొక్కటి యేకకాలమందు ప్రకాశించు చున్నవే. ధ్వనికంటె, వెల్తురుకంటె,

విద్యుచ్ఛక్తి కంటె నెక్కువ వేగవంతములైన వింతవింత బారుమెఱపులేవో నుల్కాసహస్రములతో కొఱవిదయ్యాపు గోటులతో లోన జఱజఱమనుచు న్నవే. అంతరప్రకృతి లోని రత్నములముందు, మీ పిట్టువజ్రము, మీ కోహి నూరువజ్రము దిగదుడుపునకైన నక్కరకువచ్చునా? అంతరప్రకృత్యాకాశ మున గలుగు నింద్రధనుస్సులముందు, బాహ్యప్రకృతిలోని యింద్రధను స్సులు వెలవెలలాడుచున్నవే! నిస్తేజస్కము లగుచున్నవే! మాసి మాయ మగుచున్నవే! అంతశ్శక్రచాపములలో వట్టిరంగులుమాత్రమేనా? కాదే. రంగులో శబ్దమో, ఆ శబ్దములో పరిమళమో, ఆ పరిమళములో మాధు ర్యమో, ఆ మాధుర్యములో చలువయో, అన్నిటిలో ననిర్వచనీయమైన సౌం దర్యమో, అహా! అహా! ఏమి యంతఃప్రకృతి. ఏధరణీకంపములైన, నేయగ్ని పర్వతోత్క్షేపములైన, నేగాలివానలైన, నాంతర ప్రకృతిలోని సంక్షోభముల కీడు వచ్చునా? ఎనిమిది దినముల యుద్ధమున్నది, పదునెనిమిది దినముల యుద్ధ మున్నది, మూడు సంవత్సరముల యుద్ధమున్నది, ఏడుసంవత్సరముల యుద్ధమున్నది, నూరుసంవత్సరముల యుద్ధమున్నది. కాని సృష్ట్యాదినుండి కామక్రోధాదులయుద్ధ మవిచ్ఛిన్నముగ నాంతరప్రకృతిలో జరుగుచున్నదే. రామరావణ యుద్ధమైన, భారతయుద్ధమైన, ఐరోపామహాసంగ్రామమైన, నవియన్నియునైన, నరిషడ్వర్గ సంక్షోభముముందెంత? పిడుగుపాటుముందు పికిలికూతలు గావా! సముద్రపు హోరుముందు సరుగుడు చెట్ల గానము కాదా? అట్టి బాహ్యప్రకృతికి, నిట్టి యాంతర ప్రకృతికి, నేమి సంబంధము న్నదో, యేమి భేదమున్నదో, దానిలో దిరుగునప్పు డేమియానందమో, దీనిలో దిరుగునప్పు డేమియానందమో, ఆయానందమున కీయానందమున కెచ్చట సామ్యమో, యెచ్చటభేదమో, యనుభవమున గనిపెట్టజాలిన యాతఁడు కవి. చెట్టుమొదలే కొమ్మయై, కొమ్మయే యాకై, యాకే చిగురై, చిగురే పుష్పమై, పుష్పమే మకరందమైనట్లు, బాహ్యప్రకృతియే జడత్వమును ద్యజించి, భారమునువదలి, మోటుతనమును విడచి, క్రమముగా సున్నితమై, మృదులమై, తేలికయై, వేగవంతమై, సూక్ష్మతమమై, విపులతరమై యాం తరప్రకృతిగ మారెనో, కాక యాంతర ప్రకృతియే క్రమముగ మందమై, బరువై, కఠినమై, మొద్దయి బాహ్యప్రకృతిగ మాఱెనో తెలిసికొనగోరి యొక్క సారియే, యందులో నొకకాలు, ఇందులో నొకకాలుంచి, అందులో నొకచేయి, ఇందులో నొక చేయియుంచి, అందులో నొక కన్నిందులో నొక కన్నుంచి, పరిశీలించి, కాశిపట్టుబట్టకు, మెరుగువైపు, మోటువైపులెట్లో, అట్లేయని యనుభవమున కనిపెట్టజాలిన యాతఁడు కవి. అట్లు కనిపెట్టి, యాకృతిచే

రంగులచే, రుచిచే, బరువుచే, స్వభావముచే, గతిచే, భేదములైన యావస్తువు లన్నిటికి, లోపల వెలుపల నొక విలక్షణమగుశక్తి నిండియున్న దనియు, సృష్టములగు సర్వపదార్థములుకూడ నామహాశక్తి సాగర మందలి తరంగములు, తుంపరలు, బుద్బుదములు, ఫేనములని యావేశమున కనిపెట్టజాలిన యాతడు కవి. అందుచే నేకత్వమే బహుత్వముగా నున్నదికాని, బహుత్వమసత్యమనియు, నేకత్వమే సత్యమనియు గనిపెట్టునాతడు కవి.

ఈ శక్తియందుమాత్రము కవికి, వేదాంతికి సామ్యమున్నది. ఉత్తమమైన కవిత్వము వేదాంతముకంటె భిన్నముకాదు. "Poetry is the highest philosophy" అని పాశ్చాత్య విమర్శక చక్రవర్తి చెప్పినాడు. జగత్తత్త్వమునుగూర్చి, పరబ్రహ్మ తత్త్వమునుగూర్చి పలికిన వేదర్షులందఱు మహాకవులు కారా? జగత్పుస్తకమును జదివి, దానియర్థమును గ్రహించి, దానిభావమును గుర్తెరిగి, దాని రచియించిన మహాశక్తియొక్క తత్త్వము ననుమానింపగలిగిన యాతడే కవి. భూమిలోనుండు గాజురాయి మొదలుకొని, నంతరిక్షమున నత్యంత దూరమందుండు చుక్కవఱకు సమస్తపదార్థములందు నీతిని, శాసనమును, ప్రేమమును, సౌందర్యమును, మతమును, నవిలంఘ్యక్రమమును, బుద్ధినైశిత్యముచే గనిపెట్టజాలిన యాతడు కవి. ఫలభారమున వంగినచెట్లు ప్రపంచమున కేమి బోధించుచున్నవి? విద్వాంసుడు వినయవంతుడై యుండవలయుననియే కదా? ఉదయముననే భరతపక్షి తుఱ్ఱుమని సూర్యునివంక కేల యెగురుచున్నది? నిద్రావస్థలో, నిస్సహాయ స్థితిలో రక్షించిన భగవంతుని పాదములపై మనుజునియాత్మ కృతజ్ఞతా వందనములతో నుబ్బెత్తుగ నెగురవలయునను మతమును బోధించుటకేగదా? గులాబిపాదపై నొక పూవును మనములాగగా దాని పైకొమ్మపైనుండు పువ్వు తానుకూడ వంగుట యెందులకు? ఒకచెంప గొట్టువానికి రెండవ చెంపగూడ చూపుమని ఏసుక్రీస్తుడెందులకు బోధించెనో యందులకే. పురపాలక సంఘమువారి వీథి దీపమేమని బోధించుచున్నది? తా నంతస్తాపముచే దహింపబడిన సరియే, పరులకు మేలొనర్పుమను స్వార్థపరిత్యాగ మహాపాఠమును బోధించుటలేదా? కన్నులున్న వానికి, మనసున్న వానికి రాతిలో నీతియున్నది. మట్టిలో మతమున్నది.

అట్లు చూచువాడు కవి. చూచి యూరకుండునా? ఆవేశమూరకుండ నిచ్చునా? ఆనందము పొరలిపోకుండ నాగునా ? లోపల చిత్తము తాండవించునప్పుడు, జిహ్వపై శారద తాండవింపకుండునా ? కులకంఠ కలస్వనము

లతో నొకప్పుడు, శ్రీనివాస దేవాలయ ఘంటా ఘణ ఘణ ధ్వనులతో నొక ప్పుడు, శ్రీశైలేశ్వర శంఖారావములతో నొకప్పుడు, ఆఫ్రికాదేశ పంచానన భయంకర గర్జారావములతో నొకప్పుడు పలికి, చిత్తోత్సాహమును, చిత్తోద్రేక మును, నప్రయత్నముగ ననర్గళముగ వెల్లడించు నాతఁడు కవి. ఎవనిపలుకు లొకప్పుడు గంగా ఝురీవేగ సన్నిభములో, ఒకప్పుడు పుత్రుని యాలింగనము వలె చల్లనలో సంతోషజనకములో, కుతూహలప్రదములో, ఒకప్పుడు పన్నీటి తుంపరవలె పరిమళభరితములో, ఒకప్పుడు వీణానాదమువలె మధుర మధుర లలిత లలితములైన హృదయాకర్షకములో, ఒకప్పుడు వేదవాక్కుల వలె శాసనములో, ఒకప్పుడు నిస్సంబంధములుగా గానబ డుచు, దూరస్థములుగ గానబడుచు, మెలికలై ప్రక్కబాటున బోవుచు, తిరుగుడులై వెనుకబాటునవచ్చి కాళ్ళు, చేతులు, మనస్సు గట్టిగాగట్టి డబ్బాటున మోసముతో స్వాధీనపఱచుకొనుదాక స్వభావము తెలియని పలుకు లొకప్పుడు, రివ్వుమని పైకిబోయి, యచ్చట నింద్రచాప వర్ణముల బూలనుదిమ్మరించి క్రిందజాఱిపోవు పలుకు లొకప్పుడు, నుపయోగించు సమయానుసార సర్వతోముఖ సమ్మోహినీకరణ సరస్వతీమూర్తి యగు నాతఁడు కవి. పైకి మందుఁడై, బాహ్యప్రపంచజ్ఞాన శూన్యుఁడై, జడుడై యాం తరప్రపంచమునే గాఢముగ నవలోకించుచు గోచితో గొంగళిపాతతో, నెడమ చేతివెదురుకఱ్ఱతో, కుడిచేతి కుండతో, కడుపులో నాకలితో, నడుముపై వం పుతో, శిరముపై కంపతో బిచ్చగాడై, మాధుకర మెత్తుకొనుచు నొకపుడు, ధర్మసింహాసనాధిష్ఠాతయై, కిరీటాంగదధారియై, స్వర్ణ వేత్రధరసేవితుఁడై, యొకచేత ధర్మశాస్త్రమును, నొకచేత కత్తినిధరించి, ఒకయడుగు చందన మున, నొకయడుగు నగ్నియందుంచి, ప్రజలను యథాన్యాయముగ బరిపా లించుచు నొకపుడు, ముండియై, దండియై, కాషాయాంబరధారియై, బ్రహ్మ వర్చసము ముఖమున తవఱింప, నుపదేశముద్రను వహించి, యుపనిషత్సా రమును బోధించుచు నొకప్పుడు, చిఱువెంట్రుకలతో, పాలబుగ్గలతో, కంటి కాటుకతో, మాటిమాటికి పైకెత్తుచున్న నడుముతో, చముురుతలతో తొట్టి లోని బొత్తులతో, పండుకొని వ్రేలు నోటబడక, వెక్కివెక్కి యేడ్చుచు నొక ప్పుడు, నిట్లు భావనా ప్రపంచమున, భావనాటకమున, భావనారంగమున, సర్వవేషధారియై, బాహ్య ప్రపంచాతీతుడై, తన ప్రపంచమున దానొక్కడై సర్వమైయుండునాతఁడు కవి.

ఎదుటలేని వస్తువుల వర్ణించునపు డాంతరదృష్టితో, వజ్రధార కంటె వాడియైన యాంతరదృష్టితో, నావస్తువుల యాకృతి, రంగు, రుచి, వాసన, ధ్వని, స్పర్శము మొదలగునవి పరిశీలించి, వానిబాహ్యాంత స్స్వరూపముల నెట్టయెదుట బెట్టగల యింద్రజాల మహేంద్రజాల విద్యావిశారదుడగు నాతఁడు కవి. ఏయేవస్తువుల నెట్లెట్లు వర్ణించిన నవి స్వస్వరూపములతో ప్రత్యక్షములగునో, అట్టిచాకచక్య సంపత్తితో కొన్నిటిని బలిష్ఠములైన నాల్గు జటకాలతోనో, కొన్నిటిని బలిష్ఠములైన మూడు వ్రేతలతోనో, కొన్నిటిని తేలిక తేలిక లేతలేత యగు పదివ్రేటులతోనో నిర్మించి యెంతదూరముననో, ఎన్ని మూలలలోనో దాగియున్న వానిని సాక్షాత్కరింపజేయగల సమయానుసార శబ్దార్థగుంభనాసమర్థుడగు నాతఁడు కవి. ఎవనిబొమ్మలు మాటలో అతఁడు చిత్రకారుడగునట్లే, యెవనిమాటలు బొమ్మలో యతఁడు కవి.

నాయనలారా! కవియొక్క ప్రధానశక్తులను చెప్పుచున్నాను. ఇట్టి శక్తుల కుదాహరణములు మన భాగవత రామాయణాది గ్రంథములనుండి యెత్తి చూపునెడల నాల్గుదినములకైన నీ యుపన్యాసము తెమలదు. కవిలక్షణముల మాత్రమే చెప్పెదను. ఇది సులభముగ మనస్సున బ్రవేశించు విషయము కాదు. కావున సావధానచిత్తముతో వినవలయును. వస్తువర్ణనశక్తి నింతవరకు జెప్పియుంటిని. పరుల సుఖదుఃఖాద్యవస్థా భేదములను తన విగాజేసికొని, పరుల హృదయములందుదూఱి తన్ను పూర్తిగ మరచి .తన వ్యక్తిత్వమును పూర్ణముగ దుడిచిపెట్టి, వారిహృదయములందైక్యమై, వారట్టి యవస్థాభేదములందెట్లు మాటలాడుదురో, యెట్లుగంతులిడుదురో, యెట్లు కూలబడుదురో, యెట్లేడ్తురో, అట్లుమాటలాడి, అట్లుపాడి, అట్లు గంతులిడి, అట్లు కూలబడి, యట్లేడ్చునాతఁడు కవి. కళత్ర విహీనుడగు నిర్భాగ్యుడేడ్చిన ట్లొకపుడు, పుత్రోదయమైన భాగ్యవంతుడగు వృద్ధుడుప్పొంగి మహానందమున నేలలాడినట్లొకపుడు, సందిగ్ధావస్థతో నెటుచేయుటకుదోపని యాపన్నునివలె నూగులాడి యొకపుడు, నపకారియగు శత్రుడెదుట బడిన వీరాగ్రేసరునివలె, కత్తిజళిపించి, ఝాంకరించి, సంహరింపబోవుచు నొకపు డిట్లే యంద రాడవలసిన యాటలు తానే యాడి, తానే పరవ్యక్తులైనట్లు మాటలాడుచు రసవ్యక్తిసంఛన్న పూర్వక పరవ్యక్తిప్రవేశ పాండితిమండితుడగు నాతఁడు కవి.

అంతరప్రపంచములోని రూపశూన్యములైన రసభేదములు, నవస్థాభేదములు నక్షిగోచరములు కాకుంటచే వానిని వివరించి, విస్పష్టముగా మన యెదుట బెట్టవలసివచ్చినప్పుడు బాహ్యప్రపంచమున మన కనుభవములో

నున్న వస్తువులను జట్టు భట్టు సందర్భానుసారముగ నుపమలొనర్చి, తెలి యని వానిని తెలియునట్లొనర్చి, చీకటిపై వెల్తురును ప్రసరింపజేయు విజ్ఞాన తేజశ్శాలియగు నాతఁడు కవి. మనస్సంకల్పములు, చిత్తవికారములు, బుద్ధి భ్రమములు, వివిధ రసస్ఫురణములు, వర్ణ్య విషయములై నప్పు డా యగో చర పరిస్థితులను తెలియబరచుటకు బాహ్య ప్రపంచమునందలి సామ్య పరిస్థితుల సాహాయ్య మావశ్యకము. అంతర ప్రపంచమునందలి యజ్ఞవిష యములనెల్ల సూక్ష్మముగా, సునాయాసముగా, సుప్రశస్తముగా, నత్యంత సముచితములైన యుపమలతో లంకెవేసి, మనస్సుతోనైన స్పష్టముగా గ్రహిం చుట కవకాశములేని వానిని గంటితో చూచునట్లుచేయు ప్రకృతిజ్ఞానపరిపూ ర్ణుడైన యాతఁడు కవి. కవి ప్రాశస్త్యము సముచితోపమాసంఖ్యనుబట్టి గ్రహింపవచ్చును. శ్రీమద్రామాయణమునందు వాల్మీకి ఉపయోగించిన యుపమలకు హద్దులేదు. తులసీదాసుని రామాయణమునందుకూడ ఉప మలు విశేషముగ నున్నవి. కాళిదాసునిలో, షేక్స్పియరులోకూడ నట్లే యున్నవి. మనఃప్రపంచమునందలి యవస్థాకోటులకెల్ల బాహ్య ప్రపంచ మున నుపమానకోటు లున్నవి. కవి వానిని గ్రహింపవలయును. అది యిదియు నొకటే. అది యిదియు నొకటే యనుటకు సామ్యముకొరకు గవి యెట్లు ప్రకృతిని పరిశీలించునో, అది యిదికాదు. అదియదికాదు (నేతి, నేతి) యని పల్కుటకు వేదాంతియు నట్లే ప్రకృతిని పరిశీలించును. సామ్యపరిజ్ఞాని కవి. భేదపరిజ్ఞాని వేదాంతి. సామ్యము తెలియనిదే భేదము తెలియక బోవుట నిజమే. భేదము తెలియనిదే సామ్యము తెలియకపోవుటయు నిజమే. కాని కవియందు సామ్యజ్ఞానము విశేషముగ నుండును. వేదాంతి యందు విభేదజ్ఞానము విశేషముగనుండును. ఇది స్థూలమైన నిర్వచనమని యెరుగవలయును. అపదార్థములైన యంతరంగావస్థలకు పదార్థత్వమిచ్చి, ప్రత్యక్షముచేయుట కుపమాలంకారము మహాకవులందరును మిక్కలి విరివిగా వాడియున్నారని చెప్పియున్నాను. బాహ్యపరిస్థితులను వెల్లడించు నప్పుడుకూడ కవు లుపమలను వాడినారు. వాడుచున్నారు. వాడగలరు. ఇది కేవల మావశ్యకము కాదు కాని యలంకారమునకు, చమత్కారమునకు, సౌందర్యమునకు, వస్తువైశద్యమునకు కవు లట్లుచేయుదురు. మఱియు కవులు మఱియొకవిధములైన యుపమలనుకూడ వాడుచున్నారు. అవి యేవనగ బాహ్యావస్థలను వెల్లడించునప్పు డాంతరావస్థల నుపమలుగ దీసికొ నుచున్నారు. ఇది కేవలము విరుద్ధము. దీనివలన విస్పష్టతలేదు. సరికథా

మరింత యస్పష్టత సంభవించును. రవంత తెలిసిన దానిని తెలుపగోరి తెలియని దానినిగా చేయుచున్నారు.

ఇట్టి క్లిష్టపరిస్థితుల కుదాహరణములు కొన్నియిచ్చెదను. మహాకవిశిఖామణియైన వాల్మీకి నుండియే యిచ్చెదను. అశోకవనమందుండెడి సీతాదేవిని వర్ణించునప్పుడు శుక్ల పక్షాదియందలి చంద్రరేఖవలె నున్నదని చెప్పినారు. ఇది తెలిసినది. "పినద్ధాంధూమజాలేన శిఖామివ విభావసోః" అని మరియు చెప్పినారు. ధూమజాలముచే గప్పబడిన యగ్నిజ్వాలవలె నున్నదని చెప్పినారు. ఇదికూడ తెలిసినది. కాని "స్మృతీమివ సుసందిగ్ధాం కీర్తింనిపతితామివ, నిహతామివశ్రద్ధా మాశాంప్రతిహతామివ, బుద్ధిం సకలుషామివ" అని యనేకములైన యంతరావస్థల నుపమలుగాజేసినారు. సందిగ్ధమైన స్మృతివలె, నిపతితమైన కీర్తివలె, నిహతమైన శ్రద్ధవలె, ప్రతిహతమైన యాశవలె, కలుషమైన బుద్ధివలె సీతాదేవి యున్నదని చెప్పుటవలన, సీతను గూర్చి తెలియకపోవుటయేకాక, తెలియని యవస్థాభేదము లెన్నియో మనపై బడినవి. ఈ పద్ధతి సమంజసము కాదేమో? కాని యావాల్మీకి తిరుగబడి "నా పుస్తకము నిన్నుజదువుమన్న వాడెవడు? నీకు తెలియుటకొరకే నేను కవిత్వము చెప్పవలయునా? ఒకనికి తెలియుట యనునది కవితోద్దేశమా? నా యుత్సాహముకొలది, నా యిష్టమువచ్చినట్లు, నాసంతోషముకొఱకై నా కొరకే పాడుకొంటి" నని మనల ధిక్కరించునెడల మనము కొంత సేపటి వరకు మూగలమై యుండవలసి వచ్చునేమో! వాల్మీకిమహర్షిచెప్పిన యధిక్షేపణము నిజమే. మామిడిచిగురు వగరున జీర వదలిన కంఠముతో కలకంఠ మెవనికొరకు బాడుచున్నది? మధుపాన మొనర్చి పాడు తుమ్మెద నీవు వినుటకే పాడుచున్నదా? ప్రకృతి జ్ఞానాస్వాదనమున మత్తిల్లి మైమరచి వినువారు లేకున్నను, వ్రాయువారులేకున్నను, ఆత్మసంతోషముకొఱ కానందగీతములను బాడు గాయకశిఖామణి కవి.

"అభ్రకం రససిందూరం గంధకం టంకణం సమ"మ్మను యోగమునను సరించి, ఆయావస్తువులను గలిపి సిందూరభూషణమును జేయు వైద్యునివలె, వివిధములయిన రంగులను, చిత్రవిచిత్రములగు పాళ్ళతో గలిపి, యొకవింతరంగును చేయు చిత్రకారునివలె రామాశుగ సన్నిభమైన దృష్టిని పదునాల్గు భువనము లొక్కవిసరున ముందునకు వెనుకకు బఱపి సర్వవస్తుజాలమును పరిశీలించి, ఆ వస్తువులలో దేనిదేని నేయేవిధముగా గలిపిన బాగుగానుండునో యోజించి యట్లుకలిపి నూతన వస్తువులుగ జేసి,

వానినుంచుటకు తావు, వాని బిలచుటకు పేరు కల్పించి వానిని వాగ్రూపము లగు ప్రతిమలను జేసి మనయెదుట బెట్టగల యద్వితీయ ద్వితీయ సృష్టి కళాబ్రహ్మయగు నాతఁడు కవి.

కవి పిచ్చివాడనుట సత్యమే. ఎట్టి పిచ్చిలో నేమాత్రమును వెగటు లేదో, ఎట్టి పిచ్చి జగదుద్ధరణ పటిష్ఠమో, ఎట్టి పిచ్చిలో జ్ఞాన విజ్ఞానములు దుర్నిరీక్ష్యమైన తేజస్సుతో వెల్గునో, ఎట్టి వెఱ్ఱికి వేయి విధములుగాక కోటి విధములైనను పరమార్థగ్రహణ విధానమున నొక్కటేవిధము గలదో, యెట్టి వెఱ్ఱి వెఱ్ఱులన్నింటికంటె వెఱ్ఱిదో అట్టి వెఱ్ఱిని, అట్టి లోకాతీతమైన వెఱ్ఱిని, అట్టి వెఱ్ఱిలేని వెఱ్ఱిగల్గి తాను ధన్యుఁడై లోకమును ధన్యము జేయు నాతఁడు కవి.

ఆ. మల్లెపూవు దూఱి మధుపంబుతో బాడి
గంధవాహుతోడ గలసి వీచి
యబ్ధిలోన మున్గి యౌర్వవహ్ని గ్రాగి
నీటిబుగ్గయగుచు నింగి బ్రాకి
తోకచుక్కతోడ డీకొని శ్రమజెంది
సాంధ్యరాగనదిని స్నానమాడి
తనువునింద నింద్రధనుసు రంగులుపూసి
కైరవాప్తుసుధను గైపు జెంది
గోళ గాన రుతికి మేళవింపుగ బాడి
పాడి యాడి యాడి పాడి సోలి
భావనామహత్వపటిమను బ్రహ్మమై
పోవుకవికి గోటి మ్రొక్కు లిడుదు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

---

## ౩. రామకృష్ణ పరమహంస

—శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము.

ప్రాపంచిక భోగములపై నేవ గలిగి, బాల్యమునందే విరాగులయి, ఈశ్వర భక్తులయి జీవయాత్ర గడపిన మహాత్ములు పూర్వకాలము నందే గాక యిప్పటికిని హిందూదేశమున నచ్చటచ్చట గనబడుచున్నారు. స్వామి దయానంద సరస్వతి, మహర్షి దేవేంద్రనాథ టాగూరు, బ్రహ్మానంద కేశవ చంద్రసేనుడు, రామకృష్ణ పరమహంస మొదలగు వారందుకు దృష్టాంతములుగ నున్నారు. అందు దయానంద సరస్వతి కొంత ప్రాతపద్ధతిని కొంత క్రొత్తపద్ధతి నవలంబించిన మహాత్ముడు. దేవేంద్రనాథుడును, కేశవ చంద్రసేనుడును పూర్వపద్ధతినుండి విడివడి కేవలము క్రొత్తపుంతనే త్రొక్కి జన సామాన్యమున కనిష్ఠమయిన మతము నవలంబించిన విరాగులు. రామకృష్ణ పరమహంస కేవలము ప్రాచీన మార్గము ననుసరించి పరమభక్తుడయి దేశ స్థుల కందరకు నిష్టుడయిన మహాయోగి. ఈతనిచరిత్ర మనేకాద్భుతములతో నిండియుండును. ఆ యద్భుతములలో పెక్కింటి నీ కాలమువారు నమ్మ జాలరు. అయినను పరమహంస శిష్యులలో నగ్రగణ్యుడగు వివేకానంద స్వాములవారు వ్రాసిన చరిత్రనుబట్టి నేను వాని జీవితము నిచ్చట సంగ్రహముగా వ్రాసెదను.

రామకృష్ణ పరమహంస 1833 వ సంవత్సరమున ఫిబ్రవరి నెల 20 వ తేదీని బంగాళాదేశమున హుగ్లీ జిల్లాలోని కమర్పకూరను (కామారిపుష్కరము) గ్రామమున జన్మించెను. అతని తండ్రి పేరు ఖుదీరామ చటోపాధ్యాయులు. తల్లిపేరు చంద్రమణీదేవి. అతని తల్లిదండ్రు లిద్దరు యోగ్యతకు మిక్కిలి ప్రసిద్ధికెక్కి గ్రామస్థులందరిచేత గౌరవింపబడుచు వచ్చిరి. ఖుదీరామ చటోపాధ్యాయుల సత్యనిరతిని, దైవభక్తిని దెలుపుటకు రెండుదాహరణల నిచ్చుచున్నాము. అతడు పూర్వము 'దేరి'యను గ్రామమున గాపురముండువాడు. ఆ యూరి జమీందారు డొకవిషయమున దప్పుసాక్ష్య మిమ్మనియు, నీయకుండిన వానిం జిక్కుల బెట్టెదననియు బెదరించినందున నతడబద్ధమాడజాలక ఆ యూరువిడచి కమర్పకూరునకువచ్చి తనజీవితశేష మచ్చటనే గడపెను. ఒకనాడతడు తన కూతుంజూచుటకు బయనమయి పోవుచుండగా మార్గమధ్యమున నప్పుడే క్రొత్తగా బయలుదేరిన దళములుగల

యొక మారేడుచెట్టు కనబడెను. మారేడుదళములతో శివపూజచేయుట యత నికి మిక్కలి ప్రియమగుటచే బ్రయాణమింకొక యప్పుడు సేయవచ్చును. ఈ యదనుతప్పిన బిల్వదళములు మఱియొకప్పుడు దొరకునాయని పయన మును గట్టిపెట్టి చెట్టెక్కి మారేడుదళముల గోసి, యొడినిండ వేసికొని వెనుక కుంజని యిల్లుచేరి మనసార శివపూజచేసెను. అతనివద్ద వాక్శుద్ధిగలదనియు, శుభముకాని, అశుభముకాని యాతడన్నట్లు జరుగుననియు జనులు నమ్మిరి. చటోపాధ్యాయుడు యాత్రనిమిత్తము గయకుబోయియుండ నందు గదాధరు డగు శ్రీమహావిష్ణువతనికి కలలోగనబడి వానికడుపున కొడుకయి పుట్టుదునని చెప్పెనట. అందుచే నతనికి తండ్రి గదాధరుడని పేరుపెట్టెను. కాని యిటీవల నెందువలననో యతడు రామకృష్ణుడను పేరం బరగె.

రామకృష్ణు డాఱవయేటనే పురాణములు చెప్పెడివారి యొద్దకుబోయి భారత భాగవత రామాయణాది కథల నెరింగెను. అతని కంఠధ్వని మధు రమును గంభీరమునైనయది. సంగీతమునందించుక ప్రవేశము గలుగుటచే శ్రావ్యముగ బాడగలవాడట దేవాలయములందలి విగ్రహములు చక్కగా చెక్కబడినవో లేవో తెలిసికొనుట కతనికి సహజనైపుణ్యముగలదట. అతడు కడుబాలుడయినను గ్రామము నందలి పెద్దలు, చుట్టుప్రక్కలవారు, దేవతా విగ్రహముల ముందు వానికి జూపి యతడు మెచ్చిన తరువాతనే ప్రతిష్ఠల జేయుచువచ్చిరి. రామకృష్ణున కద్భుతమయిన జ్ఞాపకశక్తి గలదు. ఒకమారు భాగవతు లా యూరికివచ్చి జలక్రీడలాడగా నా బాలుడదిచూచి కథయం తయు జ్ఞాపకము పెట్టుకొని తరువాత దోడిబాలురచే నాకథ యాడించెను అయన వసియించు గ్రామము జగన్నాథ క్షేత్రమునకు బోవు దారిలో నుం డుటచేత యోగులు, సాధులు, సన్యాసులువచ్చి ఆయూరి సత్రములో బస చేయుచుండిరి. అప్పుడు రామకృష్ణుడు వారియొద్దకుబోయి వారివలన ననే కాంశముల గ్రహింపుచు వచ్చెను.

తనయూరి జమీందారుడు మృతినొందగా నుత్తర క్రియల సమయ మున చుట్టుప్రక్కల పండితులనేకు లచ్చట చేరిరట. ఆ సమయమున వారికి వేదాంత విషయమున నొక సందేహము దోప వారు చర్చలు చేయు చుండ బాలుడగు రామకృష్ణు డచ్చటకేగి సందియ మవలీలగా దీర్చెనట. పండితులందరు వానిని మహానుభావుడని కొనియాడిరి. రామకృష్ణుని పెద్ద యన్న రామకుమార చటోపాధ్యాయులు సంస్కృతమున పండితుడై కలకత్తాలో నొక పాఠశాల పెట్టెను. తండ్రి రామకృష్ణునకు బదియావయేట

నుపనయనముజేసి చదువునిమిత్తము వానిని పెద్దకుమారుని కప్పగించెను. రామకృష్ణు డాబడిలో కొన్నినాళ్ళు చదివి యెంతకాలముచదివినను నాలుగు రూకలు సంపాదించుటకు వినియోగించు విద్యలేకాని మోక్షసాధనమయిన చదువులేదని విసువుచెంది, ఆ బడిలో చదువుకొనుట మానెను.

1853 వ సంవత్సరమున కలకత్తానగరమున కైదుమైళ్ళ దూరమున రాణి రాసమణి యను జమీందారురా లొకర్తె దక్షిణేశ్వరస్వామి యాలయమును గట్టించెను. ఇది హిందూదేశమున శ్రేష్ఠమయిన కోవెలలలో నొకటి. ఆ యాలయమునకు రామకృష్ణుని యన్న అర్చకుడుగా నేర్పడెను. ఆలయ ప్రతిష్ఠ జరిగిన దినమున నిరువదివేలమంది కన్నప్రదానము జరిగెను. గుడి కట్టించిన యామె శూద్ర స్త్రీ యగుటచే నామె కట్టించిన యాలయమున భుజించుట యశాస్త్రీయమని రామకృష్ణుడంత యన్నప్రదానము జరుగుచున్న ఆ యాలయమున భుజింపక, సాయంకాలమువర కుపవాసముండి కొంచెమటుకులు తిని, రాత్రి కలకత్తాకు పోయెను. తరువాత కొన్ని నాళ్ళకు సోదరుడు వచ్చి తనవద్ద నుండుమని బ్రతిమాలుటచే తన యన్నము తాను గంగయొడ్డున వేరేవండుకొందునని చెప్పి యన్న నొప్పించి, అతనితో గలసియుండుటకు పోయెను. అట్లు కొంతకాలము జరుగ సోదరునకు శరీరమందనారోగ్యము కల్గుటచే రాణి రాసమణియొక్క అల్లుడగు మధురనాథుడు రామకృష్ణునే కోవెల కర్చకుడుగా నియమించెను.

అత డాపనిం బూని దక్షిణేశ్వరస్వామిని శ్రీకాళికాదేవిని అనుదినమును బూజించు చుండగా అతనికి కాళియం దత్యంతభక్తి నెలకొనియెను. పూజానంతరమున రామకృష్ణుడు దేవీవిగ్రహమువద్ద గూర్చుండి కొడుకు తల్లి యొద్ద మారాముచేసి యడిగినట్లు "అమ్మా! పలుకవే, నాగతియేమి సెప్పితివే" అని పిలుచుచు ఎడతెగక ప్రార్థించుచుండును. ఆ దేవి తన మాత యనియు, జగన్మాతయనియు నతడెంచుచు తాను నివేదన చేసిన యాహారమామె నిజముగా భక్షించుచున్నదను కొనెను. ప్రార్థించుటయేగాని యాతడెన్నడును రెండవ పనిచేయకుండుటచే వాని బందుగు లతడు వెఱ్ఱిథోరణిలో బడినాడనినమ్మి, పెండ్లిచేసినచో కొంతవరకు దృష్టి మఱలు ననుకొని వివాహము దలపెట్టిరి. పెండ్లిచేయుటకు తనవారు తలపెట్ట నతడు తనకు రామచంద్ర ముఖోపాధ్యాయుడను నొక బ్రాహ్మణుని కూతురు శారదామణిదేవి యను నుత్తమబాలిక భార్యయగునట్లు విధింపబడినదనియు, వానియొద్దకు బోయి యడుగుమనియు దనవారితో జెప్పెను. వారామాటల కద్భుతపడి

వెంటనే ముఖోపాధ్యాయుని యెద్దకు బోయి యడుగ నతడంగీకరించి యైదేండ్ల వయస్సుగల తన కూతును వానికిచ్చి వివాహము చేసెను. వివాహమయిన పిదప మరల రామకృష్ణుడువచ్చి ఆలయంబున నర్చకత్వము చేయబూనెను.

వివాహము జరిగినదిగాని చుట్టము లనుకొన్నట్లు వాని మనోవైకల్యము మాత్ర మించుకయు దగ్గక మఱింత హెచ్చెను. ఈ పర్యాయ మతడు ప్రార్థనము సేయుటయేగాక యహోరాత్రము లొక్క మచ్చున నెడతెరపిలేక తల్లీ నాకు ప్రత్యక్షము కావేమే యని పెద్ద పెట్టున నేడ్వసాగెను. ప్రతిదినము సాయంకాల మయినతోడనే “అయ్యో! తల్లీ! మరల నొకదినము గడచి పోయినది. ఇక ప్రత్యక్షమగుట యెన్నడే” యని విలపించును. చూచినవారిలో కొందరు పిచ్చియెత్తినదనిరి. మరికొంద రాయేడుపుచూచి వానికి దారుణ రోగబాధకలదనిరి. మధురనాథుడది రోగమేయనుకొని తగు చికిత్స చేయించుటకు గొప్ప వైద్యుల వద్దకు తీసికొని పోయిచూపెను. వైద్యులెవ్వరును వాని రోగము కనుగొనజాలరైరి. తుదకొక మహావైద్యుడు వానికది రోగముకాదనియు, అతడు మహాయోగియనియు చెప్పెను. అతడొకప్పుడు భక్తిపారవశ్యముచేత దేవికి సమర్పింపదలచిన పూలదండలు తానే మెడలో వైచుకొనును. మధురనాథుడది మొట్టమొదట చూచి కోపించెను. కాని పిమ్మట వానిమహిమ నెరిగి యూరకుండెను. రామకృష్ణుడు గుడిలో నర్చన సేయుటకు వీలులేనియవస్థలో నుండుటచేత నతని నాపనిలోనుండి తప్పించి మధురనాథు డతని మేనయల్లుని నియమించెను.

ఇట్లుండ నెంతకాలమునకు దనకు దేవి ప్రత్యక్షము కాలేదని నిరాశ చెంది రామకృష్ణుఁడు మృతినొంద దలచుచుండగా నొడలు తెలియక పడిపోయెను. ఇది కొందరు మూర్ఛయనుకొనిరి. కాని యది మూర్ఛకాక సమాధియయ్యెను. ఈ సమాధిలో వానికి కాళికాదేవి ప్రత్యక్షమై వాని ననుగ్రహించెను. అంతట నతడించుక యూరడిల్లి యుండెను. అదిమొద లతడు మరణము నొందువరకు బలుమారులు సమాధి ప్రవేశము చేయుచునే యుండెను. అతడు సమాధిలో నున్నపుడెంత ఘనవైద్యులువచ్చి చేయి చూచినను నాడి గనబడదయ్యె.

ఈ యద్భుతమున కెవ్వరును కారణము చెప్పజాలరయిరి. సమాధిలో తనకు దేవి తరచుగా ప్రసన్నురాలగుచుండుట నిజమో లేక తన మనోభ్రమయో యని యొక్కొక్కమా రతడు సందియపడుచు దాని యథార్థ

మును గనుగొనుటకై అదివర కెన్నడును జరుగని యొక కార్యము జరిగినచో దేవిప్రత్యక్షముమాట నమ్మెదనని యతడు దేవితో చెప్పుచుండును. ఎట్లన రాణి రాసమణియొక్క కుమార్తె లిద్దరు తమయంతఃపురము విడిచి యాలయముముందు మఱ్ఱిచెట్టు క్రిందకు వచ్చి తనతో మాటలాడినచో దేవి ప్రత్యక్షమగుట నమ్మెదనని దేవితో పలికెను. రాసమణి కూతు లిద్దరును ఎన్నడును అంతఃపురము విడువని ఘోషా స్త్రీలు. అదివఱకెన్న డాలయము త్రొక్కిచూచి యెరుగరు. అది యేమి చిత్రమోకాని యాశుద్ధాంతకాంత లిద్దరు గుడిచూచుటకు తల్లి యనుమతి నొంది యాలయమునకువచ్చి మఱ్ఱి చెట్టు నీడనున్న రామకృష్ణుని పలుకరించి "దేవి నిన్ననుగ్రహించును, భయ పడకు"మని చెప్పిపోయిరి. ఈ తెఱగుననే అతడు కోరిన ట్లనేకాద్భుత ములు దేవీ ప్రసాదమువలన జరుగుచు వచ్చెను.

ఇట్లు నిరంతర ప్రార్థనముల జేయుచు, సమాధియందు ప్రవేశిం చుచు, రామకృష్ణుడు పండ్రెండు సంవత్సరములు తపస్సు చేసెను. ఆ కాలమునం దొకనాటి రాత్రి యతనికి నిద్రలేదు. కన్నులు బలవంతముగా నతడు మూయదలచినను మూయబడవయ్యెను. అప్పుడప్పుడతడు "దేవీ! నేను మృతినొందుదును కాబోలు" నని భయపడుచుండ నతనికి, "వత్సా! శరీరమునం దభిమానమువిడువలేని నీకు ముక్తి యెట్లుకలుగును" నని యొక శబ్దము వినబడెను. ఒకమా రతడు, "తల్లీ! నే నీ కించిజ్జ్ఞులగు మనుష్యుల వద్ద చదువునేర్చుకొనను. నీవే నేర్పుము" అని యడుగ "వత్సా! నేను నీకు నేర్పెదనులే" యని యొకమాట వానికి వినబడెను.

అప్పుడప్పు డాతడు సర్వసమానుడై "నేను బ్రాహ్మణుడను, గొప్ప వాడను, తక్కినజాతులవా రల్పులను దురభిమానము నామనసునుండి తొలగింపు"మని దేవిని ప్రార్థించి వెంటనే తక్కువజాతివాండ్రగు సేవకుల యిండ్లూడ్చి వారికి విధేయుడై మెలగెను. మఱియొకప్పు డతడొకచేత రూపా యలను, రెండవచేత చిల్ల పెంకులను పట్టుకొని గంగయొడ్డున గూర్చుండి, "ఇది ధనము. దీనిచే బియ్యము పప్పు మొదలగు వస్తువులన్నియు లభిం చును. దీని నందరు గౌరవింతురు. ఇవి చిల్ల పెంకులు. వీని మొగ మెవ్వ రును జూడరు. నాకివి రెండును సమానములే" యని రెండును కలిపి గంగలో పారవేయును. ఒకనాడు రాసమణి యల్లుడు మధురనాథుడు పదునైదువందలరూపాయల విలువగల యొక గొప్ప శాలువ వానికిం గప్పెను. రామకృష్ణుడు మొదట దానికి సంతసించినట్లే కనబడి నాలుగు

నిముసములలో నా శాలువుందీసి నేలపైవైచి కాలరాచి దానిపై నుమిసి "ఇది గర్వమును హెచ్చించును. దీనికన్న ప్రాత గుడ్డపేలికలు మే" లని దానితో నేలయూడ్చి పారవైచెను. ఆ దినములలో నతనికి నిరంతరము శరీరమంతయు మంటలెత్తుచు వచ్చెను. అందుచేత నతడు గంగలో కంఠము లోతు నీళ్ళలో దిగి తరచుగ నిలచుచు వచ్చెను.

ఇట్లుండ నా మహాత్మునియొద్ద కొకయోగిని వచ్చెను. ఆమె యూరె య్యదియో యెవ్వ రెరుంగరు. ఆమె కనేక పురాణములు కంఠపాఠముగ వచ్చును. వాదములుచేసి యెంతెంత పండితులనైన అవలీలగ గెల్చెడు ప్రజ్ఞ కలది. ఒక స్త్రీ వచ్చి తనకు గొంతవిద్య నేర్పునని దేవి సమాధిలో నతనితో నొక్కమారు చెప్పెను. చెప్పిన చొప్పున దీర్ఘకాయము స్ఫురద్రూపముగల యా యోగిని వచ్చి రామకృష్ణు నానవాలుపట్టి "నేను నీకొఱకే వెదకుచు న్నాను. కనబడితివా?"యని వానిం బలుకరించి యాతనితో కలిసి కొంత కాల మచ్చట నుండెను. రామకృష్ణుని శరీర మంతయు భగభగ మండుచుం డుటచే నాతడామెను కారణ మడుగ నామె భగవద్భక్తుల కందరకు శరీర మట్లే మంటలెత్తుననియు, ఇట్లే నాలుగువందలయేండ్ల క్రిందట శ్రీ చైతన్యు నకును, పూర్వకాలమున రాధాదేవికిని భగవంతునిపైగల యనురాగముచే దేహతాపము కలిగెననియును, జెప్పి తనమాటలు సత్యములని ఋజువు చేయుటకు వైష్ణవపురాణములం దెప్పించి, అందుప్రమాణములంగనపరచి నమ్మించి, రామకృష్ణునిమేన మంచిగంధము మూడు దినములు పూయించి పూలదండలు మెడను వేయించి, అట్లే చైతన్యుని యొక్కయు రాధయొ క్కయు తాపమడగెనని చెప్పెను. ఈ శైత్యోపచారముచే నద్భుతముగ రామకృష్ణుని మేను చల్లబడెను. ఈ మంటలడగిన వెనుక నతనికి మితిలేని యాకలిబాధ కలిగెను. ఎంతయన్న మెన్నిమారులు తిన్న నతని కాకలి యుపశమిల్లదయ్యెను. అప్పు డాయోగిని చైతన్యుడు రాధ మొదలగువారికి కూడ నిట్లే వింతయాకలి కలిగెనని చెప్పి, కొన్ని గ్రంథ దృష్టాంతములజూపి పలుపిండివంటలు, కూరలు, అన్నము కుప్పకుప్పలుగా నతనియెదుట బెట్టించెను. రాసులకొలది పదార్థముల జూచుటచే నాతని యాకలి క్రమ క్రమముగ నుపశమిల్లి ప్రకృతిలో బడెను. తా నచ్చటనున్న కాలమున నీ యోగిని రామకృష్ణునకు యోగశాస్త్రము సమగ్రముగా నేర్పెను.

ఇవ్విధంబున యోగశాస్త్రమున బరిపూర్ణుడై రామకృష్ణుడు వేదాంతము నభ్యసింపవలెనని తలంచుచుండగా నతనివద్దకు మహానుభావుడగు దిగంబర

యోగి యొకడు వచ్చెను. అతడు బీరెండ గాయునపుడును, కొండ చిల్లివడ వానలు గురియునపుడును, చెట్లక్రిందనే కాని యిండ్ల తలదాచుకొనడు. ఊరు బయటనే గాని గ్రామమున వసింపడు. పండ్లు, పాలు స్వీకరించునుగాని యన్నము తినడు. రామకృష్ణు డొకనాడు గంగయొడ్డున గూర్చుండ నాయోగి వచ్చి వానిని గుర్తెరిగి బ్రహ్మజ్ఞానోపదేశము చేయవచ్చితినని చెప్పి యత నితోగలసి పదునొకండు మాసములుండెను. రామకృష్ణుడు సాటిలేని బుద్ధి నిపుణతగల వాడగుటచే నాతడుపదేశించిన బ్రహ్మవిద్య నతి స్వల్పకాలమున నవలీలగా గ్రహించెను. యోగి యాతని తెలివి కక్కజపడి "వత్సా! నేను నలుబదియేండ్లు కష్టపడి నేర్చినదానిని నీవు నాలుగు దినములలో నేర్చి తివి" అని యా దినము మొదలు వానిని శిష్యునిగా నెంచక మిత్రునిగా భావించెను. ఆ యోగి నిరంతరము తనవద్ద నగ్నిహోత్రము నిలుపుకొని అదియే పరమపావనమని తలంచుచుండెను. ఒకనా డా యగ్నిహోత్రమున నొకడు చుట్ట కాల్చుకొనపోగా యోగి తన యగ్ని మైలపడినదని వానిపై గోపిం చెను. అప్పుడు రామకృష్ణ పరమహంస యోగినిట్లు మందలించెను. "అయ్యా! ఈ యగ్నియు, దీనిని మైలపరచిన మనుష్యుడును పరబ్రహ్మ స్వరూపములే కదా! నీకీ భేదబుద్ధి యేల కలుగవలె?" అ పలుకులు విని యోగి పరమ హంసతో "ఇకమీద నేనెన్నడు నెవరిపై కోపపడ" నని తెలివి దెచ్చు కొనియెను.

రామకృష్ణు డీవిధమున బ్రహ్మజ్ఞానమునేర్చి జ్ఞానమొకదారి, నడత యొకదారి గాకుండ నద్వైత సిద్ధినొంది పిమ్మట యోగాభ్యాసము చేయనారం భించెను. ప్రాణాయామముపట్టి, యూపిరిబంధించి, ఆహారంబు దినక యత డొక్కొక్క సారి కొన్నిదినములు గడుపుచు వచ్చెను. ఆ దినములలో నెక్కడి నుండియో యొక సాధువువచ్చి, అతనితో గలసియుండి, ప్రాణాయామము పట్టినప్పు డాహారము లేమిచే నతడు మృతినొందునేమో యను భయమున బలవంతముగ నాహారమును మ్రింగించుటకు బ్రయత్నించుచు వచ్చెను. ఒకమారు రామకృష్ణునకెంతకు మెలకువరానందున సాధువు దుడ్డుకఱ్ఱతో వానిఁగట్టిగాకొట్టి మెలకువ దెప్పించి రెండు కబళముల యన్నము నోట గ్రుక్కి బ్రతికించెను. ఈ తెఱంగున నాఱుమాసములు యోగాభ్యాస మగు నప్పటికి రామకృష్ణున కాహార నిద్రాసుఖములులేమి గ్రహణిరోగము సంభ వించెను. ఈ రోగము యోగమును మాన్పించి వానికిజాల మేలొనరించెను. స్వదేశవైద్యులు కొన్నిదినములలో నాతనికిగల్గ రుగ్మతను కుదిర్చిరి. ఆ

యభ్యాసముచేత సామాన్య యోగులకు దుర్లభమయిన నిర్వికల్ప సమాధిని తాను ప్రవేశింపగల్గితిననియు, దృఢమయిన మనస్సును శరీరమునుకల్గి యుండుటచేత, తానట్టి సమాధిని ప్రవేశించియు మరల బ్రతుకగల్గితిననియు, కాని సామాన్యులు బ్రతుకుట యరుదనియు నతడిటీవల చెప్పుచువచ్చెను. ఆరోగ్యము కలిగిన వెనుక నతడు వైష్ణవుల భక్తిమార్గము నవలంబింప వల యునని తలంచెను.

వైష్ణవులు భగవంతు నైదువిధములుగా సేవింతురు. (1) సేవకులు యజమానుని గొలిచినట్లు (2) మిత్రు లొండొరుల ప్రేమించునట్లు (3)తల్లి దండ్రులు బిడ్డల ప్రేమించునట్లు (4) బిడ్డలు తల్లిదండ్రుల ప్రేమించు నట్లు (5) భార్య భర్తను వలచునట్లు. ఈ యైదింటిలో కడపటివిధమే యుత్కృష్టమయినదనియు, ఆ మార్గముననే పూర్వము గోపికలు రాధా దేవియు ననుసరించి ముక్తులైరనియు నమ్మి రామకృష్ణుడు కొన్నిదినములు స్త్రీవేషముదాల్చి తాను భగవంతుని భార్యయగు రాధననియెంచి, తత్సం యోగమునకై పలుమారు ప్రార్థించెను. ఒకనాడు సమాధిలో నతనికి ముద్దు మొగముతో గోపాలకృష్ణదేవుడు సాక్షాత్కరించినందున నతడు గృతార్థు డయ్యెను. రాధ పరమభాగవతోత్తమురాలనియు, ఆమె గోపాలదేవునియందు వలపు నిలుపుట భక్తిచేతనేగాని సంభోగార్థము కాదనియు, జ్ఞానవంతులేకాని పామరు లాగ్రంథముల జదువకూడదనియు రామకృష్ణుని యభిప్రాయము.

భక్తియోగమునందిట్లు సిద్ధిగాంచిన వెనుక నతడు మహమ్మదీయ పద్ధతి ప్రకారము కొన్ని దినములు భగవంతుని ప్రార్థించెను. అవల క్రైస్తవ సిద్ధాంత ప్రకారము కొన్నిదినము లీశ్వరుని సేవించెను. ఆ దినము లలో యేసుక్రీస్తు ఒకమారు కనబడి వాని ధన్యుని జేసెను. రామకృష్ణు డేమత మవలంబింపదలచునప్పుడు ఆ మతస్థుడొక డతనివద్దకువచ్చి తద్ర హస్యములన్నియు నాతనికి జెప్పునట. అన్ని మతముల నవలంబించుటచే ప్రతిమతము మంచిదేయనియు నేమత మవలంబించినను మనుష్యులకు ముక్తిదొరకుననియు, ఒక్కొక్కమత మఖండసచ్చిదానంద స్వరూపుండగు భగవంతుని గుణముల దెలుపుననియు నత డభిప్రాయపడెను.

అతడు సంకల్పసిద్ధుడని వాడుక. ఒకనా డాయన గంగయొడ్డున గూర్చుండి తన యోగాభ్యాసన కనువుగ నొకకుటీరమును నిర్మించుకొన దలంచుచుండ అప్పుడద్భుతముగా కొన్ని వెదుళ్ళు, తాటియాకులు, నార మొదలగు గుడిసెకుకావలసిన పరికరములు కొట్టుకొనివచ్చి వాని కంట

పడెను. ఆ పరికరముల నతడు వెంటనే గ్రహించి కొందరు సేవకుల సాయమున గుటీరము నిర్మించుకొనెను.

ఇవ్విధంబున పరమయోగియై రామకృష్ణుడుండ అతనిభార్య పుట్టినింట నీడేరి పదునెనిమిదేండ్ల ప్రాయముగలదయ్యెను. నీ మగడు పిచ్చివాడయ్యెనని తల్లిదండ్రు లామెకు తెలిపిరి. కొందరు లోకు లతడు పరమయోగియయ్యెనని చెప్ప విని శారదామణీదేవి యట్టిమగని యొకసారి కన్నులారజూడ వేడుకపడి, తల్లిదండ్రుల వద్ద సెలవుగైకొని వానియొద్దకుఁ బోయి తన్నొఱింగించుకొనియెను. రామకృష్ణు డామెను నాదరించి "పూర్వపు రామకృష్ణుడు మృతినొందినాడు. నేను క్రొత్తవాడను. లోకమునందలి యాడువాండ్రందరు నాకెట్లు తల్లులో నీవును నాకు తల్లివిగాని భార్యవుకావు" అని యామె పాదములకుమ్రొక్కి, యాశీర్వదింపుమని ప్రార్థించి, పువ్వులతో పూజించి వెంటనే సమాధిగతుడై యొడలెఱుగక బడిపోయెను. మగనికిఁ దెలివి వచ్చినపిదప నాయిల్లాలు, "స్వామీ! నేను మీ తపమునకంతరాయము కల్గింపను. మీపాదసేవ చేయుచు నిచ్చటనే పడియుండెదను. నాకందులకు సెలవిమ్మ"ని వేడిన నాత డామె వేడికో లంగీకరించెను. ఆమెయు భర్తవలెనే నిస్పృహగలిగి విరాగిణియై యుండెను. మధురనాథు డొకనా డామెను సమీపించి, "తల్లీ! నీకు పదివేల రూపాయ లిచ్చెదను. నీవు పోయి సుఖముగానుండు" మని చెప్ప శారదామణీదేవి నవ్వి "నాయనా! నాభర్త ధనము నిరాకరించియే మహాత్ముడయ్యెను. నే నాయన ననుసరించెదను. నాకు ధనమేల ?" యని నిరాకరించెను.

అనంతరము కొన్నినాళ్ళకు మధురనాథుడు తీర్థయాత్రలకుపోవుచు రామకృష్ణుని వెంటగొని పోయెను. ఆ యాత్రలలో రామకృష్ణుడు కాశికి పోయి జగత్ప్రసిద్ధ సన్యాసియగు త్రైలింగ్యస్వామిని సందర్శించి, గోకుల బృందావనమున గంగామాతయను మహాత్మురాలిని సేవించి ధన్యుడయ్యెను. మరల వారింటికి వచ్చుచున్నప్పుడు మధ్యమార్గమున నొక పల్లియలో జనులు దారిద్ర్యమున బాధపడుచుండుట చూచి, పరమహంస వారి దైన్యమునకు వగచి, ఆ యూరివారందరి నాదరించినగాని నే నిచ్చటనుండి కదలనని కూర్చుండెను. అప్పుడు మధురనాథుడు చాల సొమ్ము వెచ్చించి, కొన్ని నాళ్ళన్నప్రదానముచేసి, కట్టగుడ్డ లిచ్చి యాదరించెను. రామకృష్ణుడు పరమపావనుడు. వాని దర్శనము చేసినవారందరు వెంటనే పవిత్రులగుదురు. ఆతని సాన్నిధ్య విశేషమున కొందరు సమాధిగతులై యీశ్వరుని

గనుగొనుచుండిరి. కొందరు తమ దురాలోచన విడచి ఇండ్లకు నిష్కలుష చిత్తులై పోయెడివారు. వేయేల ఆయన నొకసారి చూచిన పిదప జారులకు కాంతాసక్తియు, లోభులకు ధనాసక్తియు పోయెడిది. ధనముపేరు చెప్పిన నతని కెంత రోతయో ఈ క్రింది సంగతిని బట్టి తెలియనగును.

వెండి బంగారు నాణెముల నతడు స్పృశించిన మాత్రమున జేతులు గజ గజ వణకును. చరమకాలమునం దతడు వెండిబంగారములనే కాక ఇనుమును సైతము తాకజాలడయ్యెను అతనివద్ద మహిమలనేకములు కలవు. కాని తన ప్రజ్ఞను ప్రకటించుటకై ఆమహిమలనెన్నడు నతడు ప్రదర్శింప డయ్యెను. ఆయన యాగతానాగతములను చెప్పగలడు. తన పరోక్షమున జరుగు కార్యముల పేర్కొనగలడు. తన యెదుట నున్నవారి మనసులోని యాలోచనల నెఱుగగలడని యనేకులు చెప్పుదురు. కొందరు మనుష్యులు దేవగుణములతోడను, కొందరు రాక్షసగుణములతోడను జన్మింతురనియు, అట్టివారిని చులకనగ కనిపెట్టవచ్చుననియు, పూర్వజన్మమున చక్రవర్తులై సకల సౌఖ్యముల తనివిదీర ననుభవించినవా రీ జన్మమున విరాగులయి సన్యాసులగుచుందురనియు, అతడు చెప్పుచుండెడివాడు. అనేక మహామహిమలుగల యీ మహానుభావుడు కలకత్తానగరమునకు సమీపమందున్నను తత్పురవాసులు చాల కాలమువఱ కతని నెరుగనే యెరుగరు.

బ్రహ్మసమాజ మతాచార్యుఁడగు కేశవ చంద్రసేనుడు పరమ భాగవతుడై యొకతోటలో విరాగియై ప్రొద్దులు పుచ్చుచున్నవాడని విని రామకృష్ణు డాతని చూడబోయెను. అది మొదలు వారిరువురకు దృఢమయిన స్నేహము కలిగెను. కేశవచంద్రసేనుడు రామకృష్ణుని ప్రభావమెరిగి వాని నాశ్రయించి సందియములడిగి తెలిసికొని పరమభక్తిచే నతనిపాదములు తన కనుల కద్దుకొని పలుమారు వాని దర్శించి బ్రహ్మజ్ఞానవంతుడై తుదకాయన సిద్ధాంతములన్నిటి నవలంబించెనని చెప్పుదురు. కేశవ చంద్రసేనుడు రామకృష్ణుని బోధనల గూర్చియు, అతని మహత్తర చరిత్రను గూర్చియు నొక గ్రంథమును వ్రాసి ప్రకటించెను. ఆ పుస్తకము బయలువెడలిన పిదప కలకత్తా పురజనులు రామకృష్ణు నెరింగిరి. అది మొదలు కలకత్తానుండియు బంగాళాదేశమునుండియు జనులు వందలకొలదివచ్చి సందియములడిగి అతనిచేత బోధితులై పోవుచు వచ్చిరి. అప్పుడతని కీశ్వరావేశము సైతము వచ్చువాడుక గలదు. ఆ యావేశము లేనప్పుడు సేవకులకైన విధేయుడుగ నుండునట్టి ఆ మహాత్ము డది వచ్చినతోడనే తాను భగవంతుడననియు, తన

వంటివారు లేరనియు, పూర్వము రాముడు, కృష్ణుఁడు, బుద్ధుడు, ఏసుక్రీస్తు మొదలగువారై పుట్టినది తానే యనియు చెప్పుచుండును. అతని బోధనలు విని యందరు సంతసించి తృప్తినొందుచు వచ్చిరి.

ఈ పరమహంసకు 1886 వ సంవత్సరమున గంఠమున కురుపువై చెను. ప్రజలకు మతబోధ మానుమని వైద్యులెంత చెప్పినను వినక కంఠ ములోనుండి మాటవచ్చువరకు అతడు మతబోధచేయుచు వచ్చెను. అ రోగము క్రమక్రమముగ వృద్ధియగుటచే రామకృష్ణపరమహంస 1886 వ సంవత్సరమున ఆగస్టు 16 వ తేదీని రాత్రి యొంటిగంటకు అఖండ సచ్చి తానంద పరబ్రహ్మమున గలసిపోయెను.

ఇతడు శరీరమునం దభిమానములేని మహాయోగి. సార్థకనామము గల పరమహంస. నిజమయిన మహర్షి. ధనమును, చిల్లపెంకును సమాన ముగజూచిన నిస్పృహుడు. చండాలునియందును, బ్రాహ్మణునియందును, కుక్కయందును, గోవునందును, ప్రపంచమందలి సమస్తపదార్థములందును, పరమాత్మయున్నదని గ్రహించి తత్ప్రకారము నడచిన ఋజువర్తనుడు. మత విషయమున నితనితో భిన్నాభిప్రాయముగల పురుషులు సైతము వాని సత్ప్రవర్తనకు మెచ్చి మిక్కిలి కొనియాడుచుండిరి. బంగాళీభాష తక్క సంస్కృతముకాని మరేభాషకాని యతనికి రాకపోయినను, వాని బోధనలం జదువునప్పు డతడు సకలశాస్త్ర విజ్ఞాన సంపన్నుడని యనుకొనక తీరదు. ఈ పరమహంస సహజజ్ఞాని యని యనేకుల యభిప్రాయము.

---

# ౪. విద్యాప్రవృత్తి

—శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి

మనుష్యమూలాధార ప్రకృతులు రెండు: జ్ఞానము, కర్మము. జ్ఞానమనఁగాఁ దెలివి; వస్తుస్వభావమును గనుగొనుట. కర్మమనఁగా కార్యము; చేయుపని.

వీనియందెయ్యది ప్రధానము ? జ్ఞానమా ? కర్మమా ? పర్యాయపదముల మూలముగ విచారించిన నీ విషయ మింకను విశదమగును. జీవితమున నాద్య మెయ్యది? బుద్ధియా? నడతయా? యోజనయా? చరితమా? నోటిమాటలా? చేతియాటలా?

సర్వము తెలిసినవారయ్యును మూఢులవలె, దుర్మార్గులవలె, వర్తించువారు లేరా? అపురూపులా? అట్టివారిని గృతకృత్యులని యెవరైన శ్లాఘింతురా? మఱియు నేమియుఁ దెలియనివారయ్యును సన్మార్గమునఁ దమ నైజమునుబట్టి పోవువారెందఱో యున్నారు. గ్రామములలోనుండు బీదసాదలు తఱచు ధర్మనీతితత్త్వముల నెఱిఁగిన వారు గాకున్నను, వర్తనమునందుఁ బండితులకంటె మొత్తముమీద శ్రేష్ఠులని యనేకుల నమ్మిక. జనుల తారతమ్యము నిరూపించునప్పుడు చర్యలను గణింతుముకాని విద్యను గణింపము. మనలోఁ గొందఱు "సుజ్ఞానమున్న జాలును, సిద్ధులు చేకూరును" అని వచించెదరు. అది యెట్లో నాకుఁ జక్కగ బోధపడమికిఁ జింతిల్లవలసి యున్నాఁడను. "ధైర్యగుణ మియ్యది; దానిలక్షణము లియ్యవి; తన్మూలమునఁ బ్రచలించు కార్యములియ్యవి" యని మంచిశైలిని, ఆమూలాగ్రముగ విచారణనడపి, ప్రసంగింపఁగలవారందఱును ధైర్యమును నడతయందుఁ బ్రకటించుట నిత్యమా? జ్ఞానమును బడసినమాత్రమునఁ జరిత్రము చక్కఁబడునేని, హిందూదేశచరిత్ర మిట్లేలయున్నది? ఇది నిష్కారణ విచిత్రమా? జ్ఞానయోగముచేఁ బరలోకమున సర్వమంగళములు తటస్థించునట! అవునో కాదో నాకు దెలియదుగాని, యొక్కటిమాత్రము సత్యము; వట్టిజ్ఞాన మీలోకమున నేసాధనకును బనికిరాదు. దీనిఁబట్టి చూడగాఁ బరలోకము మెత్తదనియు, నోటిలోని వెన్న మాదిరిఁ గరఁగునంత సరళమ

నియు, సూక్ష్మమనియుఁ, నీ పాడు ఇహలోకమువలె కాఠిన్యము, పారుష్యము, స్థౌల్యములేని దివ్యపదవియనియు, నెట్టి నమ్మికలేని వానికైనను దటుక్కునఁ దట్టకమానదు. పరలోకదృష్టితో నీ విషయముఁ బరిశీలించుట యిట నప్రకృతముగావున సామాన్యదృష్టితో నారయుదము. అద్యప్రకృతి కర్మంబు. ఇట గర్మంబనఁగా కర్మకాండ మనబడుదానికిఁ జేరిన వైదికక్రియ గాదు. జ్ఞానము ద్వితీయము. ద్వితీయంబనుటచే గౌరవహీనమని భావించుట తప్పు. ముందువచ్చిన చెవులకంటె వెనుకవచ్చిన కొమ్ములు వాడికావా? జన్మాదిగా జ్ఞానశక్తి, పూర్వము కపిలుఁడు, ఘటోత్కచుఁడు మొదలగువారికి సద్యోయౌవనముతోడ వచ్చినట్లు, ఈ కలియుగములో నెవ్వరికిని లభింపదు. కాని, పుట్టినక్షణముగోలె నేవేని క్రియలు ప్రవర్తింపకుండినచో బ్రాణములు నిలువవు. శిశువు పాలు ద్రాపక సమాధిఁదాల్చెనేని యది యోగమా? కాదు; ప్రాణత్యాగము. ప్రాణ కార్యములు నిత్యసంయోగములు; ప్రాణములున్నఁ గార్యములు, కార్యములున్నఁ బ్రాణములు నుండియేతీఱవలయును. ప్రాణములులేనిచోఁ గార్యములు, కార్యములు లేనిచోఁ బ్రాణములు నుండవు. కర్మమువలె జ్ఞానమారీతిని బ్రాణాధారము గాదు. పశుపక్షి వృక్షసంతానములలోఁ బ్రాణములును, గార్యములును బలసియున్నను, విద్యలున్నవా?

కార్యాచరణమునందలి యిక్కట్టులు, సంశయములు మొదలగు నడ్డంకులు, యోజనములు ప్రభవిల్లుటకు మూలములు గాకున్నను తరుణములు. ఏకష్టమునులేక మనకు నూపిరియాడునట్లును, హృదయము గొట్టుకొనునట్లును, స్వచ్ఛందముగా నిత్యసారళ్యముగఁ గార్యములు నడచునేని, యే యోజనమునకు నవకాశమును, నావశ్యకతయు నుండవు. అట్లగుట నాలోచనలు పుట్టవు. పక్షి మృగముల జీవితములయందు వ్యాపారములు మెండయ్యును జిక్కులులేనివి. కొన్నిగతుల సంచారములచే నవి ప్రాణయాత్ర నీడేర్చికొనును. అట్లు మనుష్యజీవితము సుసాధ్యము గాదు; మనల నావరించియుండు స్థితిగతులు సంఖ్యయందు మిక్కిలియు, నధికములు, సంశ్లిష్టములు; ఎక్కువ చిక్కును దాల్చిన యవి. కావున యోజనాశక్తి నేమాత్రమును బ్రయోగింపని యెడల మనకును మనసంతతికిని బ్రతుకు దక్కదు. మనుష్యజీవిత ముత్కృష్టమును, శాశ్వతమునైన దశం జెందవలయునన్న, విజ్ఞాన మఖండముగఁ బర్వవలయును. జ్ఞానయోగవాదులలో నందు సత్యమింతియే కాబోలు! అయిన నొక్క జాగ్రత్తః విజ్ఞానముండిన

మాత్రమున జన్మసాఫల్యము కలుగబోదు. ప్రకృతిసిద్ధాంత మేమనఁగా, జన్మసాఫల్యమున కావశ్యకములగు వానిలో జ్ఞానము నొక్కటియని. ఇంత కంటె నెక్కువ మాహాత్మ్యము నారోపించుట నిర్హేతుకము.

యోజనాశక్తియొక్క ముఖ్యోద్దేశము కార్యసౌలభ్యము. కార్యములు దుర్ఘటములుగనున్న, "నేరీతి నలవరించుకొనవచ్చు దైవమా!" యని భక్తి యోగముల రెంటిని బ్రకటింతుము. కార్యములు సరసమయి నిర్విరోధముగ జరుగుచుండెనేని, యే యోజనలులేక నెమ్మదిగ నుందుము. చూడుడు; శిశువునకుఁ బ్రాణములెట్లు నిలుచును? పాలను గ్రోలుటచేత. ఈ ప్రాణా ధారక్రియకుఁ గావలసిన జ్ఞానమెయ్యది? స్తన్యము గుర్తెఱుఁగుట. శిశువుల యం దింతకంటె జ్ఞానమాదియందుఁ గానబడును. త్రోవతెలిసినవాఁడు నడచు చుండుటయైన గమనింపక పరచింతఁదాల్చినవాడై, కాళ్ళీడ్చికొనిపోవఁ బోవు చుండును. తెలియనివాఁడు మాటి మాటికిని ద్రోవనుగూర్చిన యోజనలకుఁ గడఁగుచుండును; నాలుగుదారులు గలసినచోటికి వచ్చెనేని "ఏదబ్బాదిక్కు?" అని తల బ్రద్దలగునట్లు వితర్కించును. ఏ యుపాధులును లేక కార్యములు నడచునేని యోజనాశక్తికి రజా యిచ్చినవారమై శిరోభార పీడనములేని జీవముఁ బడయఁ జాలుదుము.

నాగరికత యెక్కువ యగుకొలది బ్రదుకుపాటుల స్థితిగతులింకను జిక్కునుదాల్చును. తళుకులు, బెళుకులు, కోరికలు, కష్టములు, సుఖ ములు, సాధ్యములు అన్నియు హెచ్చును. అసాధ్యములని యెన్నఁబడువాని సంఖ్యమాత్రము తగ్గును. పూర్వము దేవుఁడొసఁగిన రెండు కాళ్ళతో నెల్ల రును బ్రయాణములను మెల్లఁగఁ, దిన్నఁగ, జరుపుకొనుచుండిరి. ఇప్పటి యానోపాయము లెన్నియనిచెప్పవచ్చును? వ్యోమయానము, భూయానము, భూగర్భయానము, సముద్రయానము, సముద్రగర్భయానము—ఓరామా! తలంచుకొన్న నొడలు గడగడ వడఁకును! మనుష్యుండు సర్వసంచార ప్రభా వుడై యున్నాడు. ఈ సౌకర్యములతోడఁ, దోడు నీడలట్లుఁ గావలసినన్ని యుపాధులున్నవి. పూర్వము రమారమి జనసంఖ్యప్రకారము జాతిప్రాబ ల్యము, దేశగాంభీర్యము నేర్పడు చుండెడివి. ఇప్పుఁడన్ననో, ప్రకృతిశాస్త్ర జ్ఞులచేఁ గనుఁగొనబడియెడు ఫిరంగులు, తుపాకులు, బాంబులు మొదలగు వినాశన క్రియాసాధనయంత్రములచే, జనసంఖ్యల ప్రభావము దినదిన క్షయంబు గాంచుచున్నయది.

గొఱ్ఱె లెన్నియున్న నేమి? ఒక్క పులిచాలదా వానిపనిఁ దీరుట్చకు? యంత్రబలము లేనివా రెన్నికోట్లైననేమి? పురాణపురుషులుగా నున్నయెడలఁ బ్రకృతిశాస్త్రప్రయుక్త కళాకోవిదులైనవారి నోటిలోఁబడక తప్పించుకొని పోఁజాలరు. సారముపోయిన పిప్పివంటిది సంఖ్య; దానికంటె సత్త్వము ప్రధానము. బుద్ధిబలమును, గార్యశూరత్వమును ననుసరించి సత్త్వముం డును. ఒక్క బుద్ధి యున్న మాత్రమున జాలదని యడుగడుగునకుఁ దెల్ప వలయునా? మనదేశముయొక్క దౌర్భాగ్యమునకుఁ గారణము మంచి యోజ నలు లేమికాదు; యోజనతోఁ దీటగు నడవడిలేమి. మాటలకు, నాటలకు సం యోగములేని బ్రదుకు కడతేరుటెట్లు? తేర్చుటెట్లు? నాగరికత వృద్ధియగుకొ లఁదిని మనుష్యజీవిత మెక్కువ సంశ్లిష్టమగును; మన రక్షణముకొఱకు గమ నింపవలసిన విషయములసంఖ్య హెచ్చును. ప్రాఁతరీతి నొకటి రెండుత్రోవ లలో 'గ్రుడ్డెద్దు జొన్నచేనిలోఁబడినట్లు' పోవుచుండినఁ జెటుతప్పదు; సంఘము మునుపటికంటె నెక్కుడు క్రియల సాధింపవలయును; కార్యభార మన్ని దిక్కులను ఘనతరమగును; నిమిషనిమిషమునకు నూతనమార్గముల నవ లంబింపవలసి వచ్చును; ఏ మార్గము మంచిది; యెయ్యది చెడ్డది; ఇదిసరి యా యది సరియా; యని క్షణక్షణమునకును సంశయము లుదయించును; చింతా పరంపరలు మిక్కుటములగును; ఈకష్టములకుఁదగిన ఫలము, లేక పోలేదుగాని, యూరక హాయిగాఁ గూర్చుండి కాలక్షేపముఁజేయుటయే మోక్షమనువారి కీలోక మావరప్రసాదము నేనాఁటికినియ్యదు. అట్టివారికి పర లోకమో, పారతంత్ర్యమో, బహుశః రెండునో గతి. వృద్ధి హెచ్చగుకొలఁది యోచనాశక్తియు నెక్కువబలవంతమగును, కావలసివచ్చును. చూడుఁడు; ఒకటిరెండు విధముల యాగమములప్రకారము వర్తించు గ్రామీణులలో బుద్ధివికాసమునకు నావశ్యకతయు నవకాశమును గలదా? కావుననే వారి బుద్ధియు, నడతయు మందములై యుండును. బట్టణవాసులలోఁ, జర్యావిధా నముల సంఖ్య హెచ్చియుండునుగాన నచ్చటివారు మాటలయందును, మూలఁగూర్చుండి యోజించుటలందును, వలదన్నను బలత్కారముగా నిత రులకు బుద్ధిఁజెప్పుట యందును గడు సమర్థులుగా నుందురు.

జ్ఞానకర్మంబుల రెంటియు ముఖ్యోద్దేశము ప్రాణరక్షణాభ్యుదయం బులు మోక్షమనుట యీనాఁటి మాటగాదు; ఏనాఁటిమాటయుఁ గాదని చెప్పినఁబాపమా? మోక్షముఁ గోరువారును నేదో శాశ్వతమైన స్థితి నాశించు వారేకదా? ఈ స్థితి జడ స్థితియా? ఱాళ్ళఱప్పలవలె నుండవలయుననియా వారి కోరిక? మఱి చైతన్య సమేతమా? అది యట్లుండె, అన్నిటికంటె మిం

చిన మహత్తు ప్రాణము. ప్రాణము ద్వివిధము: తనయొక్కయు, తన జాతి యొక్కయు నని. ఎల్లపృథక్ప్రాణముల యందలి ప్రాణములుఁబోయిన జాతియుండదు; ఇఁక జాతిదుర్బలమగుడుఁ బ్రతియొకనికిని ముప్పుదప్పదు. జాతియుఁ బ్రజయు నన్యోన్యాశ్రయములు. జాత్యభివృద్ధికి విరుద్ధములైన ధర్మములును, నీతులును నాత్మహత్యతో సమానములు. ప్రాణముయొక్క ముఖ్యగుణము కర్మము; జ్ఞానము భృత్యప్రాయము. జ్ఞానము పుట్టినది కర్మగర్భమునుండి; కాని బిడ్డలు తల్లిదండ్రుల నాడించున ట్లాకర్మమును వశముచేసికొను ప్రభావముఁ గలయది. ఉత్పత్తి నెట్లుండినను నీనాఁటి ప్రచారముఁబట్టి చూచిన నవి రెండును బరస్పరకారణములు; ఇతరేతరోద్దీపకములు. కార్యము ననుసరించి యోజనలు సాగుటయు, యోజనల ననుసరించి కార్యములు సాగుటయు రెండును బ్రత్యక్షములు. అయిన నొక్కటి; యోజనలు కార్యములుగఁ బరిణమింపకున్న క్షేత్రమున నాటఁబడని బీజములట్లు నిష్ఫలములగును. గొడ్డువోయిన జ్ఞానమెక్కడ దట్టముగ నుండునో యా దేశము మానస క్షయవ్యాధి బాధితమని దృఢముగఁ జెప్ప వచ్చును.

జ్ఞానములోని జాతులు రెండు:— భూత (స్థితి) జ్ఞానము, భావ్య (స్థాతవ్య)జ్ఞానము. భూతమనఁగా నునికికి వచ్చిన వస్తువో, తప్పక సహజముగ వచ్చునదియో; స్థితిందాల్చినదియును, నవశ్యము దాల్చునదియును. స్థితి త్రివిధము:—భూతభవిష్యద్వర్తమానములని. ఉదా:..మనుష్యులందరు మర్త్యులు; అనఁగా మరణాధీనులనుట. దీనికి నిర్వచనము – పూర్వులు చచ్చిరి; ఇప్పటివారు చావ నున్నారు; ఇఁక ముందటివారును దప్పక చత్తురు.

శరీరముయొక్క యనివార్యలక్షణములలో మృత్యువొకటి. శరీరికి మృత్యువునకునుండు సంబంధము సర్వదాసిద్ధము. ఒక్కవేళ నిఁకముందు మనుష్యులు పుట్టరనుకొందము. పుట్టకపోయినను నీన్యాయమునకు బాధ లేదు. శరీరము లుండినసుసరే, లేకున్ననుసరే, వారికి మృత్యువునకు నుండు దాంపత్యము నిత్యమనుట యీ న్యాయముయొక్క నిర్వచనము. ఈ దాంపత్యము సిద్ధము. ఇప్పటి కాలముబట్టి చూచిన నెయ్యది భవిష్యత్తో దానినిగూడ సంగ్రహించినట్లు భూతమను పదము వాడబడియున్నది. ఏలన, భవిష్యత్తుగూడ స్థితికిఁ జేరినదిగావున మఱియుఁ గాలక్రమముగాఁ జూచిన నిఁకముందుఁ బుట్టబోవువారు చచ్చుట యిప్పటికి గాకున్నను,

ఏన్యాయముంబట్టి వారి మరణము మన మనుమానింపనగునో, యా న్యాయ మిఁకముందుఁ బుట్టబోవునదికాదు; అది యెప్పుడో పుట్టినది, శరీరితో నవత రించిన కవలబిడ్డ. ఇప్పుడు సత్యము; రేపు సత్యము; శ్రీరాముల నాఁడును సత్యము. అనఁగా నియ్యది శాశ్వతము; స్వభావలక్షణము. ప్రకృతిశాస్త్ర న్యాయములన్నియు నేవర్గమునకుఁ జేరినయవి. ఉదా:– ఆధారములేని పదార్థము భూమ్యాకర్షణశక్తిచేఁ గ్రిందబడును; అగ్నిలోఁ జేయివెట్టినను నొప్పియగును; ఉష్ణముచే వస్తువుల యాకృతులు పెద్దవగుట బహుళము, ఇత్యాదులు.

ఇంక భావ్య (స్థాతవ్య) జ్ఞానమును విమర్శింతము. భావ్యమనగా వచ్చి నదికాదు; తనంతట, తప్పక, స్వభావ సిద్ధముగ రానున్నదికాదు; మఱి యవశ్యము రాఁదగినది; మనచే రప్పింపఁ బడవలసినది; ఎయ్యది యుం డిన బాగని మనము కోరుదుమో, యయ్యది తప్పక రాఁదగినదని మనము నిర్ణయింతుమో, యయ్యది భావ్యము. నాకు ఱెక్కలు రావలయుననుట భావ్యముకాదు. ఏలన, నది యవశ్యము కాఁదగిన వస్తువుగాదు. భావ్యజ్ఞాన మున కుదాహరణము; అందఱు సత్యము చెప్పవలయును.

దీనికి నిర్వచన మెట్లనఁగా : అందఱును సత్యము చెప్పుట పూర్వము ప్రసిద్ధికివచ్చిన వృత్తాంతముగాదు; ఇప్పుడు వచ్చియుండలేదు; ఇంకముందు వచ్చుటయు సందిగ్ధమే; అయిననొక్కటి; వచ్చిననుసరే, రాకున్ననుసరే, లవ మాత్రమైనను సిద్ధింపకున్ననుసరే, అందఱును సత్యమును జెప్పవలయు ననుట శాశ్వతన్యాయము. ధర్మములను, నీతులను బోధించు న్యాయము లన్నియు నిట్టివి. ఇవి బోధించునవి కృతంబులుగావు; కర్తవ్యములు. ఈ న్యాయములకును రాజశాసనములకును గొన్నివిధముల సామ్యమును గొన్ని విధముల వైషమ్యమును గలదు. అయ్యది నా యర్థశాస్త్రమున విమర్శింపఁ బడియెఁగాన నిటననావశ్యకము. ఈ నీతి న్యాయములకును, బ్రకృతిస్థితి కిని నేసంబంధమును లేదా ? అనగా నవి నిష్ప్రయోజనములా? ఏనాఁటికిని గావు. అందఱు సత్యము చెప్పకున్నను, జెప్పవలయుననుట సర్వత్ర సత్యము. ఈ సత్య ముండుటంబట్టియే లోకమునందుఁ గొంతకుఁగొంతయైన సత్యము ప్రవర్తిల్లుచున్నది. సత్యము ధర్మమగుటచేఁ దత్ప్రకారము వర్తింప మనము ప్రయత్నింతము. ఈ యత్నమునకును, దన్మూలమున సిద్ధించు ఖండమో, పూర్ణమోయైన చరిత్రస్థితికిని, ఆ నీతియే బీజము. ఆ నీతి యొక్క ప్రతిబింబమట్లు వర్తమానమును దీర్పజూతుము. ఆ నీతిప్రభావముచే

వర్తమానము మనప్రయత్నానుసారముగ మాఱును. అట్లగుట, స్థితిని నిర్ణయించు శక్తులలో భావ్యములకును స్థానమున్నది. స్థితిస్థాతవ్యములు రెండును సత్తులే. స్థాతవ్యములు మిథ్యలుగావు. అవి ప్రకృతి శక్తులట్లు మనుష్య ప్రయత్నములేకయ, యమోఘముగ వర్తింపనేరవు. మనశక్తి కొలఁది వాని విజృంభణముండును కార్య సాధనమునకు భూత భావ్యజ్ఞానములు రెండును నావశ్యకములు. స్థితిజ్ఞానముచే మన యొక్కయుఁ, బ్రకృతి యొక్కయు శక్తులు గోచరించును. స్థాతవ్యజ్ఞానముచే నేయే పదార్థములకైన మనశక్తియుక్తులఁ బ్రయోగింపవలయుననుట యేర్పడును. "నా లాభార్థమై నా చాతుర్యమును వినియోగింతునా? దేశశ్రేయముకై పాటుపడుదునా? నాకై కాక పరులకై నేనేల శ్రమింపవలయును? స్వార్థత్యాగ మేల విధియయ్యె? దేశము నశించిన నేను నాశములేకయుండుట సాధ్యమా? మనుష్య మహాసంఘములో నిమిడియుండు నణువువంటివాఁడనా నేను?" ఇత్యాది తర్కములు స్థాతవ్యపరిశోధనలకుఁ జేరినయవి. పురుషార్థముల నిర్ణయించునది ప్రకృతివిద్య. "ఉండువానిఁగూర్చిన జ్ఞానము" వలన క్రియలయుఁ, దత్ఫలములయుఁ దెలియఁగును, "ఉండదగిన వానిఁ గూర్చిన జ్ఞానము" వలన యుక్తాయుక్తములును, గర్తవ్యములును దేటపడును.

ఇఁకఁ గర్మముసంగతికిఁ బోదము ప్రకృత్యాదిశాస్త్రంబులతోఁ గనుఁగొనఁబడిన న్యాయంబులను మనుష్యప్రయోజనార్థక కార్యంబుల బ్రయోగించు మార్గంబుల నాదేశించి, మనల సార్థకశ్రములను జేయునది కళ. జ్ఞానమునకు యోజనాశక్తి యొండుచాలును. సత్కళా సామ్రాజ్యమునకు వలయు గుణము లెవ్వి యనఁగా:—(౧) యోజనా శక్తికంజేరిన ప్రకృతి శాస్త్రజ్ఞానము, (౨) ప్రకృతిన్యాయ ప్రయోగజ్ఞానము, (3) యుక్తాయుక్త జ్ఞానము. ఇది తెలియకున్న మన చాతుర్యమంతయుఁ జెడ్డకార్యముల కర్పింతుమేమో! వివేకములేనిది "ఇది తగు నిది తగ"దని యెట్లు నిరూపింపనగును? (౪) వివేకముండిననేచాలునా? మంచి చెడ్డల నరసియుఁ జెడ్డయేచేయు దుర్మార్గులెందఱులేరు. కావున ధర్మనిరతియు నావశ్యకము. (౫) ఇన్ని మనోభాగ్యము లుండినను శరీర పరిశ్రమలేనిది యేకళయు సాగదు. ఆరోగ్యము, బాహుబలము, పట్టుదలయును, భావ్యగుణమ్ములలో బ్రధానవర్గములకుఁ జేరినవి.

ఆత్మకృషితప్ప నింకేకృషియు లేనియెడల, గోఁతకాలమునందు బొల్లిమాటలుదప్పఁ దక్కిన పంటలేవియు లభింపవు. మనః కృషితోడ, నేత్ర

హస్తాదీంద్రియకృషి లేకున్న నేమిఫలము? దేహక్షయము, దేశక్షయముఁ బ్రాపించును. బుద్ధి నొక్కదానిని సవిస్తారముఁ జేసిన మాత్రమున నన్ని విధముల మేలులును, దమంతటవచ్చి నోటఁ బడునని కన్నులు మూసికొని, చేతులు కట్టుకొని, పరధ్యానముఁ జేయువారికంటె మూఢు లీ లోకమున నుండరు. మనఃకృషియు హస్తకృషియుఁ గలియకయున్న నేర్పడునది 'కళ' గాదు; 'కళంకము'.

ఈ తత్త్వము దెలిసినవారికిఁ బ్రకృతము హిందూదేశములో నవతరించి యుండెడు సర్వకళాశాలలు పరిపూర్ణములుగావని తోఁపక మానదు. వాని యందలి లోపము లనేకములు. కళాకృషి మిక్కిలియు న్యూనము. అధునిక పాశ్చాత్య కళాశాలలు విద్యాబోధన శాస్త్రప్రకార నిర్మితములును, సర్వప్రజాభివృద్ధికరములును, హృదయానందకరములునై యుండఁగా, మన కళాశాల లింకను బౌరాణిక పంక నిర్మగ్నములై యుండుటఁ జూడఁ గోప తాపంబులు మనస్సును గలంచు చున్నయవి. వీనివలన మన కుపకారము లేకపోలేదు; కాని యదిచాలదు. మఱియుఁ బూర్వు లెప్పుడో మంచిచేసెనని యెల్లకాలము కృతజ్ఞతా సూచకముగ వందిమాగధ స్తోత్రములు చేయుచునో, చేతులు గట్టుకొని, నోరుమూసికొని భక్తినమ్రతను జూపుచునో యుండుటకుఁ బౌరుషవంతుం డెవ్వడును సమ్మతింపడు. చిన్నప్పు డక్కఱమైఁ బెంచి పెద్ద వానినిగా జేసిరిగదా యని జన్మ మంతయు నవ్వులకు నాహుతిగా నియ్యఁ బోలునా; కృతజ్ఞత యెంతో మంచిగుణము; అయినను భావికిఁ బ్రతికూలముల విధించునెడల దాని ననుసరించుట యన్యాయము. పూర్వులయెడ మనము చూపవలసిన భక్తులకంటె నిఁక ముందు మనచే సృజింపఁబడు సంతతి వారిపురోభివృద్ధికై వలయు సన్నాహముల నొడగూర్పఁ బ్రయత్నించుట ప్రధానకృత్యము. రక్షించుటకు శక్తిలేనిచో సృష్టించుట మహాపాతకము. మన పూర్వులు మనల నీలోకమునకుఁ దెచ్చిరి; శక్తికొలది భరించిరిగాబోలు; అది వారిధర్మము. దానిని వారు చెల్లించుకొని పోయిరి; వారు చేసినమేలు మఱవఁ గూడదు; అట్లనుటచే మన మెవ్వరి మేలుకై యుత్తర వాదులమో యట్టి మన సంతతి వారిక్షేమముల నారసి యాచరించు విధమునఁగాక, ప్రాచీనుల మత ప్రకారము వర్తింపవలయునని యర్థము చేయుట మూఢభక్తి. సంతతివారి క్షేమార్థములైన ధర్మములకంటె మిక్కిలిగా నుపాసింపదగిన ముఖ్యధర్మము లెవ్వియునులేవు. "ఉన్నవి: నా యాత్మను నేను గాపాడుకొనుట ప్రధానధర్మము" అనువా రుందురయేని, అట్టివారు సంతానము వడయుట కనర్హులనియు, హక్కులేని వారనియుఁ

దోఁపకున్నె? తన గతి మోక్షములకై సంతానముఁ బడయవలెనన్న, నాకుఁ జూడనియ్యది పరోపకార ధర్మమునకు విఘాతుకమైన తలంపుగఁ గన్పట్టెడిని. అది యట్లుండె; వర్తమానకాలముయొక్క ముఖ్య కర్మము, భూతకాలములో వేల్వఁబడుటకాదు; భవిష్యత్తును భూత వర్తమానములకంటె నున్నతముఁ జేయఁ బ్రతికరణశుద్ధిగఁ బరిశ్రమించుట.

కావున గృతఘ్నతయను నిందకు భయపడక, సర్వకళాశాలా సంస్కారమున కుద్యోగింపవలయును. మొదటి వేటునకు దీనికి మించిన లక్ష్యములేదు. ఈ విషయమై "ఆంధ్రపత్రిక" యొక్క సంవత్సరాది సంచికలో నాకుఁ దెలిసినంతమట్టుకు నిదర్శనములతో వ్రాసియున్నాను. దానిం దిలకింప విద్యాసంస్కారోద్యోగులు ప్రార్థితులు.

---

# ౫. నాగార్జునుని కొండ

— శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ.

ఇప్పటికి దాదాపుగ ఏడువందల సంవత్సరములైనది బౌద్ధమతము జన్మభూమియయిన హిందూదేశమున అంతరించి; కాని అది దేశీయుల గౌరవాదరములకు పాత్రమై, వారి యభిమాన విశ్వాసములను చూఱగొని యడ్డమాఁకలులేక విజృంభించినది. దేశమున ఆ మతము వెలయింపఁజేసిన నిర్మాణములలో చాలా భాగము నామమాత్రావశిష్టములయినను కొన్ని మాత్రము కాలపురుషుని దార్ఢ్యమున కెదురొడ్డి కొనయూపిరితో నిలిచియున్నవి; మఱికొన్ని ఇండియా ప్రభుత్వపు పురాతత్త్వ శాఖవారు చేయుచున్న కృషికి ఫలముగ ఏ శిథిలరూపముతోనో, భగ్నాకృతులతోనో బహిర్గతములగుచున్నవి. ఈ జీర్ణ బౌద్ధ నిర్మాణావశేషములను, శిథిల బౌద్ధ శిల్పకృతులను చూచినను బౌద్ధము జీవన్మృతమై విలసిల్లిననాఁటి యీ కళావిధానముల నిండారు ప్రశస్తి వైభవశోభలను మన హృదయసీమ నూహింపనైన సాధ్యము కాదు. బుద్ధజయంతుల నాక్షేత్రము లెట్టి యపూర్వసౌందర్య విలాసములతో మెఱసిపోయెడివో, ద్వీపాంతరములనుండి, దేశాంతరములనుండి యెంతటి ప్రజ నాకర్షించుచుండెడివో యెవ్వరికి తెలియును? గాలిలోపెట్టిన కర్పూర ఖండమువలె హరించిపోయిన ధాన్యకటక సంఘారామ బౌద్ధ పుణ్యక్షేత్రము—దీపాలదిన్నె—పూర్వవైభవము హృదయసీమ నెవఁడు నేత్రగోచరము కావించుకొనగలడు? అయినను నేడు ఈ విశీర్ణ భగ్న బౌద్ధ నిర్మాణావశేషముల వలననే హిందూదేశమున బౌద్ధము ముమ్మరముగ వ్యాపించిననాడు కళ యెంతటి యుచ్చదశయందుండెనో, అది యెంత యుత్తమశ్రేణికి చెందినదో ఎంత సుందరమయినదో తెలిసికొన వీలగుచున్నది.

హిందూదేశమున బౌద్ధము ప్రబలిననాటి యాకళ వర్ణికా చిత్రముల రూపముననను శిల్పచిత్రముల రూపముననను, హర్మ్యనిర్మాణముల రూపముననను రూపుకట్టుకొని వికసించినది.

ఈ మూడు విధములగు బౌద్ధకళయుఁగూడ నేడు మనము ఈదేశమునఁ బొడగాంచవచ్చును. పైనుడివిన మూటిలోను వర్ణికా చిత్రములకు అజంతా, బాఘ్‌విహారములు అసదృశములయిన చిత్రశాలలు; బౌద్ధస్తూప,

సంఘారామ గుహాలయములు, బౌద్ధహర్మ్య, నిర్మాణాదుల కుదాహరణ ములు. బౌద్ధ మంతరించి పోవుటచేత సంఘారామములు నామమాత్రావశి ష్టములయియు, గుహాలయములు 'ఖండస్ఫుటిత నవకర్మాది' సంస్కార ములులేక జీర్ణములయ్యు అందందు చూపట్టుచున్నవి. పురాతత్వశాఖవారి నిరంతరకృషివలన స్తూపము లనేకములు చాలచోటుల బయలుపడినవి. బౌద్ధస్తూప, హర్మ్య నిర్మాణాదికముల ననుసరించి విలసిల్లినదే బౌద్ధశిల్ప చిత్రకళ. ఆంధ్రదేశమున బౌద్ధవర్ణికా చిత్రకళ కుదాహరణములు మృగ్య ములయినను స్తూప, గుహాలయముల భగ్నావశేషములకుమాత్రము కొంత వఱకు కొరతలేదు.

బుద్ధుని సిద్ధాంతోపదేశములకును, బౌద్ధకళకునుగల సంబంధ మెంత వఱకన్నది ఇంకను విమర్శనీయమేయైనను బుద్ధుని అహింసాతత్వమే, బుద్ధుని జీవకారుణ్యమే, బుద్ధుని పరమాశయమే బౌద్ధకళా నిష్ణాతులకు జీవగఱ్ఱయై వారి హృదయములను ద్రవింపజేసినది. ఆనాఁటి బౌద్ధశిల్పుల రసహృదయమే తరఁగెత్తి బౌద్ధకళగా జాలువారినది. బౌద్ధకళయందలి ప్రతి అంశమును ఉదాత్తవస్తు సమంచితము, ప్రసన్నకథాలలితము, కరుణరసా త్మకము, త్యాగధన విశిష్టము. బుద్ధుడు మూర్తీభవించిన కరుణారస స్వరూ పము. బుద్ధుని పురాతన, అధునాతన చరితము, ప్రతిదియు, బుద్ధుని యుప దేశము, బుద్ధుని బోధ దివ్యసందేశ గర్భితమయినది. దుఃఖానల సంతప్తమ యిన లోకమునకు అది చల్లని యమృతసేచనమయి, దానికి సౌఖ్యానంద ప్రదమయిన చందనసేచన మొదఁగూర్చి, దానిని సోకినది. దానం జేసియే చంద్రునిచుట్టు పరివేషమువలె బుద్ధునిచుట్టు బౌద్ధకళ పరిధి తీరినది.

చారిత్రిక పురుషులందఱివలెనే బుద్ధుఁడును ఒక చారిత్రిక వ్యక్తియే యైనను బుద్ధసందేశ ముగ్ధమును, భక్తిభావ వినమ్రమునయిన భక్తలోకము ఆ పరమకారుణికమూర్తికి అతిమానుషశక్తులను బ్రసాదించి యాతనికి స్వర్గసింహాసనము నొసంగి దివ్యరాజ్యమున కాతనికి పట్టముగట్టినది. బుద్ధుని జన్మము, బుద్ధుని విద్యాభ్యసనము, బుద్ధుని వివాహము, బుద్ధుని భోగము, బుద్ధుని త్యాగము అన్నియు ఆ లోకము దృష్టిలో అత్యద్భుతగాథలై, పౌరా ణికశోభ సేకరించుకొని, దివ్యతత్వముతో మెఱసిపోయినవి. బుద్ధుని గాథలు— పూర్వజన్మమునకు సంబంధించినవియు, ఈ జన్మమునకు సంబంధించి నవియు—అనంతములైనవి. చీకటిలో తడవులాడుకొనుచు యాత్రసాగించు

అంధలోకము హృదయమును బుద్ధు డుత్తేజపఱిచినట్లు ఎవ్వరును చేయ లేదన్న అది సత్యదూరము కానేరదు.

కాని బౌద్ధము దేశమున బాగుగ వ్యాపించినది బుద్ధుడు నిర్యాణము నొందినవెనుకనే. మౌర్యవంశజుఁడయిన అశోకవర్ధనుఁడు దశదిశలకు బుద్ధ సందేశమును వినుపింప మత బోధకులను బంపినాడు. అశోకవర్ధనుని యభి మాన, ఆదరములవలన అంతవఱకు మగధహద్దులు దాఁటకుండ ఒక స్థానిక మతసాంప్రదాయముగనే యుండిపోయిన బౌద్ధము అంతటినుండి ప్రపంచమతమయినది. బౌద్ధము అంధ్రదేశమునఁ బ్రవేశించినదిగూడ అశోకవర్ధనుని కాలముననే.

మౌర్య అశోకవర్ధనుని మరణానంతరమున బౌద్ధమునకు మగధ రాజ్య మున ఆదరప్రాపకములు సన్నగిల్లినవి. అందువలన నది రాజ్యాంతరము వెదకికొనవలసివచ్చినది. ఇటువంటిస్థితిలోనే దాని కాశ్రయమిచ్చి యాద రించినవారు ఆంధ్రులు.

క్రీస్తుశకము మొదటి శతాబ్దులలో అంధ్రరాజులు రాజ్యము చేయు చుండిన కాలమున బౌద్ధమతము ఆంధ్ర దేశమున విరివిగా వ్యాపించియుం డెను. దానంజేసి నాఁడు తెలుగుదేశమున బౌద్ధుల సంఘారామములును, గుహాలయములును, స్తూపములును, చాలవెలసినవి. నేడు దేశమున బౌద్ధ మంతరించి పోవుటచేత దానికి సంబంధించిన సంస్థలు నామమాత్రావశిష్ట ములయినవి. అప్పటి నిర్మాణములు జనుల యనాదరములకు పాలయి జీర్ణములై శిథిలత్వము నొందినవి. దానంజేసి నాఁడు బౌద్ధసంఘమునకు పుణ్యప్రదములయిన క్షేత్రములేవో, మనికి పట్టులేవో నేఁటికింకను పూర్తిగాఁ దెలియరాక యున్నది. బౌద్ధము పూర్తిగా నశించినపిదపగూడ కాలము రాటు పోటుల కాగి కొంతకాలము నిలిచిన బౌద్ధస్తూప నిర్మాణములు కాలక్రమ మున భూగర్భమునఁబడి పూడిపోయి పెద్ద దిబ్బలయినవి. అట్లు పూడిపోక యే నిర్మాణములైన నిలచియుండినచో ఇటికలు మొదలయిన వాటినిమిత్తము మనుష్యులే వాటిని పాడుచేసినారు. ప్రాచీన బౌద్ధనిర్మాణములకొరకు పునః అన్వేషణము జరుగవలసి వచ్చినది. గవర్నమెంటు పురాతత్వ శాఖవారు కృష్ణా, గుంటూరు మండలములలో అచ్చటచ్చట భూమిని త్రవ్విచేసిన యన్వేషణమువలన ఆంధ్రదేశమునందలి ప్రాచీన బౌద్ధక్షేత్రములు కొన్ని కొన్ని తెలియవచ్చినవి; ప్రాచీన బౌద్ధస్తూపాదులు కొన్నిబయలుపడినవి. ఈ

పురాతత్వ శాఖవారి కృషివలననే కృష్ణానదీతీర ప్రదేశమునందలి అమరావతి, జగ్గయ్యపేట, ఘంటసాల, గుమ్మడిదుఱ్ఱు, భట్టిప్రోలు మొదలైనవి పూర్వము ప్రసిద్ధములయిన బౌద్ధ పుణ్యక్షేత్రములనియు, ఈ స్థలము లన్నిటను బౌద్ధమునకు సంబంధించిన నిర్మాణశిల్పావశేషము లుండెననియు తెలియుచున్నది. పైనిచెప్పినస్థలము లన్నిటిలో ఒక్క అమరావతిలో మాత్రమే గొప్ప బౌద్ధస్తూప నిర్మాణావశేషసంపద దొరకినది. దానిని బట్టియే బౌద్ధము వ్యాపించిననాడు ఆంధ్రులు శిల్పకళారచనమున అసమానులని తెలియవచ్చినది.

భారతీయ బౌద్ధకళాచరిత్రమున అమరావతిది ఒక గొప్పప్రకరణము. బౌద్ధయుగమునాటి యాంధ్రులు భక్తితత్పరులై బుద్ధభగవానుని కర్పించిన శిల్పనీరాజనము అమరావతీస్తూపము. బౌద్ధాంధ్రులు శిల్పచిత్రరచనమున కొంత విశిష్టతచూపి అమరావతీస్తూపమునకు అపరిచితఖ్యాతి తెచ్చిరి. బౌద్ధయుగమునందలి ఆంధ్ర సంస్కృతికి అమరావతి యపూర్వమణిదర్పణము; చిత్రవ్యాఖ్యానము. నాఁటి యాంధ్రుల శిల్పకళాకుశలతనుబట్టి భారతీయ బౌద్ధకళా సంప్రదాయములలో అమరావతిసంప్రదాయ మొకటి యేర్పడి ప్రసిద్ధిగాంచినది. అంతియకాదు, అది నాఁడు వర్ధిల్లిన బౌద్ధకళా సంప్రదాయములన్నిటిలో ఉత్తమ మయినదని, ఉత్కృష్టమయినదని పేరు గాంచినది. వస్తు వేది చిత్రింపవలసి వచ్చినను అందు బౌద్ధయుగమునాఁటి యాంధ్రశిల్పి అద్భుత ప్రతిభ, అసమానప్రజ్ఞ చూపినాడన్న ఖ్యాతి గడించినాడు.

బౌద్ధయుగమున కృష్ణానదీతీరమున పరివ్యాప్తమయిన కళాసంప్రదాయము అమరావతిదే. బౌద్ధ ఆంధ్రశిల్పులందరు అమరావతీ శిల్పరీతినే వరవడిగాఁ బెట్టుకొని తమ కళారచనమును సాగించుచు వచ్చిరి. మొన్నమొన్నటివఱకు బౌద్ధ కళకు ఆంధ్రులు చెప్పుకొని గర్వింపదగిన యుదాహరణము ఒక్క అమరావతియే కనఁబడినది. గవర్నమెంటు పురాతత్వ శాఖవారి కృషివలన ఇటీవల మఱియొక శిల్పకళావిధానము -నాగార్జునుని కొండ-బయలు పడినది.

గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాలో కృష్ణానదీ దక్షిణతీరమున నున్నది నాగార్జునునికొండ. పల్నాడు తాలూకాలోని మాచెర్ల వరకు రైలు కలదు. మాచెర్లకు, నాగార్జునునికొండకు ౧౫ మైళ్ళ దూరము. మాచెర్లనుండి

పది మైళ్ళదూరముననున్న నాగులవరమువఱకు బండ్లు పోవును. అచ్చటి నుండి కడపటి యైదు మైళ్ళదూరమును నడచి పోవలసినదే.

నాగార్జునునికొండకు దగ్గఱనున్న గ్రామము పుల్లారెడ్డిగూడెము. అతి చారిత్రక ప్రసిద్ధిగల ప్రాంతమున నున్నను, ఆ గ్రామమున చారిత్రక ప్రాముఖ్యముగల వస్తువిశేషములు ఏవియు లేవు. నిజాంరాజ్యము, చెన్న రాజధానిని విడదీయుచు కృష్ణానది నాగార్జునునికొండ ప్రక్కనుండియే ప్రవహించును. ఇడియంతయు కొండలమయమున ఎఱ్ఱనేల. ఇక్కడ కొండలు ౮౦౦ ల అడుగుల యెత్తుండును. ఈ కొండల పార్శ్వము లడవితో నిండియుండును. కొండలతోపాటు పెద్ద పెద్ద దిబ్బలు గూడ ఇక్కడ చూడ నగును. వీటిమీదగూడ అడవి బలసినది. ఈ దిబ్బలన్నియు ప్రాచీన బౌద్ధ నిర్మాణముల అవశేషములు. నాగార్జునునికొండ యన్నది ఈ ప్రాంతమున వాయవ్యదిశనున్న ౨౦౦ ఎకరముల వైశాల్యముగల యొక గుట్ట. చిత్ర విచిత్రాకృతులు గల శిఖరములతోడ ఈ కొండలను జూచినచో అవి స్వాభావికముగ ఏర్పడిన కోటలవలె దోచును. వీనికితోడు రక్షణనిమిత్తము మానవుఁడు ఇటికతోను, ఱాతితోను కట్టినగోడలు మొదలయినవికూడ ఉన్నవి. వీటినన్నిటినిబట్టి చూడగా ఈ ప్రాంత పీఠభూమి ఒకప్పుడు ఒకదుర్గముగా నుండి యుండవలెనని తోఁపకపోదు. ఈ ప్రదేశమున పాడుపడిపోయిన మధ్యయుగమునాటి శివాలయముతక్క ప్రాచీన నిర్మాణచిహ్నము లేవియు కనుపింపవు. విడివిడిగా చెదరిపడియున్న శిలాసమూహమును జూచిన యెడల ప్రాచీనకాలమున ఇచ్చట ఏవో వెఱ్ఱిమొఱ్ఱిగాకట్టిన కొంప లుండవలెనని తోచును. కోటగోడలు మొదలగువానిని కట్టుటలో నుపయోగించిన ఇటికలు ఈ లోయలోని బౌద్ధనిర్మాణములో నుపయోగించిన వాటితో సమ పరిమాణము గలిగియున్నవి.

మిక్కిలి పెద్దయిటిక ౨౦″ × ౧౦″ × 3″. అనగా పాటలీపుత్రములోని అశోకవర్ధన చక్రవర్తి రాజధానీస్థలమయిన బులందీబాఘ్‌లోఁ గానవచ్చిన వానియంత పరిమాణముగలవే సరిగా. ఈ యిటికగోడలు, ప్రాకారములు మొదలైనవి బౌద్ధు లీ ప్రదేశము నాక్రమించి యుండినప్పుడు కట్టినవే అయియుండవలెను. ఈ కొండ దిగువ ఉపత్యకములయందు శిలాప్రాకారములు, బురుజులునుగలవు. ఇవి బౌద్ధయుగమునకు చాల తరువాతవి— విజయనగరాధీశుల కాలమునాటివి— కావచ్చును.

బౌద్ధావశేషములు లోయలోమాత్రమే కానవచ్చును. పీఠభూమిమీఁద కొన్ని మైళ్ళవఱకు త్రవ్విచూచినారు. కాని గృహనిర్మాణములుండిన జాడ లేవియుఁ గానరాలేదు. ఇప్పుడిదంతయు వట్టి రాతిభూమి. చెట్టుచేమలేవియు పెరుగవు; నీరుకూడ దొరకదు. అందువలన మానవనివాసమునకు యోగ్యమయినది కాదు. గ్రామమునకు పడమట నదివైపు ఒకకొండఉన్నది. నాగార్జునుని కొండమీఁదవలెనే అక్కడ కూడ ఇటికగోడలు మొదలయినవి కలవు; కాని గృహనిర్మాణాదుల చిహ్నము లక్కడగూడ కనిపింపలేదు.

ఇక్కడనుండు పెద్దదిబ్బలన్నియు బౌద్ధావశేషములే; వీటిలో కొన్ని సమప్రదేశ మైదానముననను, మఱికొన్ని కొండలమీద నున్నవి. అక్కడక్కడ మొన్నటివఱకు నిలచిఉన్న శిలాస్తంభమో, శిల్పాలంకృతఫలకమో అతిప్రాచీన శిథిలనిర్మాణ స్థలమనిసూచించుచు వచ్చినవి. ఇటువంటి శిథిలావశేషములున్న ప్రదేశము అమరావతీ బౌద్ధారామప్రదేశముకంటెను పెద్దది. ఈ లోయమధ్య నుండిన నగరము ఒకతట్టున నదివల్లను, వేఱొకతట్టున దుర్గప్రాకారాదులవలనను, పశ్చిమోత్తరముల ఎత్తయిన ప్రాకారములతోఁ గూడిన కొండలచేతను పరిరక్షితమైనదగుటవలన ప్రాచీనకాలమున అది శత్రుజన దుస్సాధ్యముగా ఉండియుండవలెను. ఆ కాలమున సముద్రమున నుండి ఓడలు సరాసరి నాగార్జునునికొండవఱకు వచ్చుట కనువుగనుండునట్లు కృష్ణానది యిప్పటి కన్న వెడల్పుగను, సముద్రము ఇప్పటికన్న దగ్గఱగను నుండి యుండవచ్చును. అదియునుగాక ఈ పట్టణమునకు, కృష్ణానదికిని సమీపముననే గల యితర బౌద్ధాధినివేశములగు గోలి, చేజెర్ల, అమరావతి, జగ్గయ్యపేట, ఘంటసాల, గుమ్మడిదుఱ్ఱు, బెజవాడ, భట్టిప్రోలు మొదలయిన వాటితోను సుకరముగా రాకపోకలు, వ్యాపారముకూడ జరుగుచుండి యుండవలెను. ఎందువల్లననగా, ఈ లోయలో బయలుపడిన స్తంభములు, దూలములు, విగ్రహములు, శిల్పఫలకములు చేయుటలో నుపయోగపడిన పాలఱాతి బండలు స్థానికముగ త్రవ్వి ఎత్తినవియు కావు కొండల మీదినుండి తీసికొని పోయినవియుకావు. అవి నదివెంటనే వచ్చియుండవలెను.

౧౯౨౬లో ఈప్రాంతమున శిథిలమయిన బౌద్ధస్తూపపు దిబ్బయొద్ద ప్రాచీన బ్రాహ్మీశాసనములుగల కొన్నిస్తంభములు కనఁబడుట వలన ఈ స్థలము చాల ప్రాచీనమయినదయి యుండునని యూహించి పురాతత్వశాఖవారు ఇచ్చట పరిశోధన లారంభించిరి. మొట్టమొదట ఈ ప్రాంతమున

ఇట్టి పరిశోధనలు జరిపినవారు యమ్. హమీద్ కురైషి అనువారు. వారు అక్కడ ఉండి ఒకటి రెండు మాసములు మాత్రమే జరిపిన పరిశోధనలకు ఫలితముగ ౧లా ప్రాచీన శాసనములును, రెండు శిథిలాలయములును, అనేకములు అమూల్యములగు శిల్పచిత్రములును బయలుపడినవి. వానిని బట్టి ఇది ప్రాచీన బౌద్ధ అధినివేశమని, బౌద్ధకళా నిధానమని తేటపడినది.

ఇక్కడ బయలుపడిన శాసనములును, ౧౮౮౨లో జగ్గయ్య పేటలో దొరకిన ప్రాచీన (బ్రాహ్మీ) శాసనములునుకూడా ఇక్ష్వాకువంశ్యభూవరులు వేయించినవి. వాటినిబట్టి క్రీస్తుశకము మూడునాలుగు శతాబ్దులలో కృష్ణానదీ ప్రాంతాన ఇక్ష్వాకువంశజులమని చెప్పుకొన్నవారు పరిపాలించుచుండిరని తెలుచున్నది. ఈ శాసనముల ననుసరించియే యిచ్చటి మహాచైత్యమున బుద్ధధాతువు నిక్షిప్తమయినట్లు స్పష్టమయినది. దేశ మరాజకము పాలయిన కాలమున యిచ్చటి మహాస్తూపమును, దానికి సంబంధించిన చిన్న స్తూపములును నిధినిక్షేపములు వెదకువారి వలననో, మఱియెవరివలననో నాశము జేయబడినవి. అందువలన నింత వఱకు స్తూపవేదికలు మాత్రమే నిలచి యున్నవి. వాని పైభాగములెల్ల నశించిపోయినవి.

సపరివారముగ శంకరాచార్యులవారు ఇక్కడికివచ్చి బౌద్ధులను తరిమివేసిరనియు, వారి నిర్మాణములను భగ్నముచేసిరనియు ప్రతీతి; కాని యిది యెంతవఱకు నిజమో తెలియదు. ఆ లోయలో ఈ బౌద్ధ నిర్మాణ శిథిలావశేషములు కాన్పించిన మాగాణిభూమి యంతయు ప్రాచీనకాలమున శంకరాచార్య మఠమునకు దానమిచ్చినదని తెలియుచున్నది. ఇప్పటికి నది తన్మఠాధిపతులకే చెందియున్నది. వారి యనుమతితోనే ఇక్కడ పురాతత్వ శాఖవారు త్రవ్వుపని జరిపియున్నారు.

ఇక్కడ నల్లరాళ్లబోడను కొండమీఁదనున్న ఆలయము చప్టామీఁది శాశనమువలన సింహళద్వీపమునుండి బౌద్ధభిక్షువులు వచ్చి యాకొండమీద నివసించుచుండినట్లును, వారచట నొక స్తూపమును, సంఘారామమును నిర్మించినట్లును, పడమటిదిశ పారుగున విజయపురి అను పట్టణముండినట్లును తెలియుచున్నది. నల్లరాళ్ళ బోడుకు దగ్గఱగా చాల చిన్న కొండలున్నవి. వాటి శిఖరాలమీఁద చిన్నస్తూపముల శిథిలములు చూపట్టును. మహాస్తూపమునకు తరువాత ముఖ్యమయిన నిర్మాణములన్నియు నల్ల రాళ్ల బోడుమీఁదనే యున్నవి. దీనిమీఁద త్రవ్వఁగా రెండుస్తూపములు, ఒక చైత్యాలయము, సంఘారామమును, దానికి సంబంధించిన సున్నము ఇటికతో

కట్టిన గృహములు ఉన్నవి. ఈ నల్లరాళ్ళబోడే 'శ్రీపర్వత' మనుపేర వ్యవహృతమయినట్లు శాసనములవలనఁ దెలియుచున్నది. శ్రీపర్వత సంఘారామముననే మహాయాన బౌద్ధ సంస్థాపకుఁడయిననాగార్జునాచార్యుల వారు తమ చరమదశ గడపినట్లు తిబెత్తు బౌద్ధగ్రంథమువలనఁ దెలియుచున్నది. ఇచ్చట బుద్ధధాతు నిక్షిప్తమయి, యిది పవిత్రక్షేత్రమగుటచేతను, నాగార్జునాచార్యులవారికిది నివాసస్థలమగుటచేతను దూరదేశములయందుండినట్టి బౌద్ధులకు గొప్ప యాత్రాస్థలమయ్యేనని యూహింపఁదగియున్నది.

నాగార్జునునికొండ స్తూపము ఇటికతోను, సున్నముతోను కట్టిన ఒక మహానిర్మాణము. శాసనములందిది 'మహాచైత్య' మను పేరఁ బరగుచున్నది. అండాకృతిగల స్తూపభాగము అయిదడుగుల యెత్తును, ౧౦౨ అడుగుల వ్యాసమునుగల గుండ్రని వేదికమీద నిర్మితమయినది. నాశనముకాఁగా ఇప్పటికి మిగిలియున్నదెల్ల ఈ వేదికచుట్టు ప్రదక్షిణముచేయుటకు పదుమూఁడడుగుల వెడల్పుగల ప్రదక్షిణపథము. దీనినిచుట్టి ప్రాయికముగ అయిదడుగుల యెత్తుగల యిటికగోడ ప్రాకారము కలదు. ఈ ప్రాకార రేఖలో నాలుగువైపుల ఒక్కొక్కటి పదునాలుగడుగుల వెడల్పుగల నాలుగు ద్వారములున్నవి. వీటి పునాదులుమాత్రమే ఇపుడు మిగిలియుండుటచేత ఇవి ఎట్లుండెడివో తెలిసికొన సాధ్యముకాదు. మొత్తముమీఁద ఈ నిర్మాణము బౌద్ధుల ధర్మచక్రము నమూనామీఁద కట్టఁబడినట్లు తోఁచుచున్నది. ప్రాకారరేఖ, చక్రము, ప్రదక్షిణమారము, ఆకులు, వర్తులవేదిక, చక్రపు నడిగుబ్బ.

ఈ స్తూపము నుత్తరభాగమున త్రవ్వగా పగిలిపోయిన ఒక కుండలో రజితకరండమున బుద్ధధాతువు కనుపించినది. ఇది బుద్ధునిదేయని తలంచుచున్నారు. ఇది బటాణీగింజంత పరిమాణముగల యెముక చిన్న యెముక ముక్క; దీనిని ముప్పాతిక అంగుళము వ్యాసముగల ఒక బంగారుబరిణెలో పెట్టి, మరల నా బరిణెను బంగారు పువ్వులు, ముత్యములు మొదలైన వానితోఁ గలిపి స్తూపాకారముననున్న ఒక రజితకరండమునసుంచి పదిలపఱచినారు. కుండలో నున్నది ఈ రజిత కరండమే. దానికి దెబ్బతగులకుండునట్లు కుండనిండ ఎఱ్ఱమట్టిపోసి గట్టిచేసి, దానిమీఁద మూతిదగ్గఱ స్ఫటికపు పూసలను గ్రుచ్చినారు. ఈ విధముగ భద్రపరచినను కుండయు, రజిత కరండమును భగ్నమయినవి.

కొంతకాలము క్రిందట, పూర్వము మృగదావము విలసిల్లిన సార్నాథ క్షేత్రమున నేటిబౌద్ధులు "మూలగంధ కుటివిహారము" నిర్మించి ప్రవేశోత్స వము జరిపిన సందర్భమున అచ్చటి బౌద్ధభిక్షు సంఘమునకు హిందూదేశపు గవర్నమెంటు పురాతత్వశాఖవారు ఈ నాగార్జునునికొండ మహాచైత్యమున దొరకిన బుద్ధధాతువును దానముచేసినారు. ఈ విధమున ఇప్పటికి రమారమి పదునాఱువందల సంవత్సరములకు పూర్వము ఇక్ష్వాకువంశ్య భూపతుల రాజ్యకాలమున ఇచ్చటి మహాచైత్యమున నిక్షిప్తమయిన బుద్ధభగవానుని ధాతుశకలము నేటికిని సార్నాథ్ మూలగంధ కుటివిహారమున పదిలముగ నుండి పూజలందుకొనుచున్నది. ౧౯౨౭-౨౮, ౧౯౨౮-౨౯ సంవత్సరము లలో ఈ ప్రాంతమున జరిగిన త్రవ్వుపనివలన మూఁడు సంఘారామము లును, ఆఱు చైత్యాలయములును, అనేకములు స్తూపములును బయలుపడి నవి. బౌద్ధభిక్షువులు వసించు ప్రదేశమును సంఘారామమందురు. సంఘా రామములు మూఁటిలో రెండు నల్లరాళ్ళబోడుమీఁద నున్నవి. మూఁడవది నల్లరాళ్ళబోడుకు పడమటగ దాదాపు మైలుదూరమున నదికెదురుగనున్న కొండమీఁదనున్నది.

ఇచ్చటి స్తూపములన్నిటిని ఇటికతో కట్టినారు. స్తూపవేదికల ముందు భాగమున వివిధములయిన శిల్పచిత్రములు చెక్కిన శిలాఫలకములను పేర్చి సున్నముతో అతికినారు. సుందరములయిన ఇట్టి శిల్ప ఫలకములు వందకు పైగా దొరికినవి. ఈ ఫలకము మీఁది శిల్పకళయంతయు ఇదివరలో చెప్పినట్లు అమరావతీ కళా సంప్రదాయము ననుసరించినదే. ఇట్టి శిల్ప ఫలకములేకాక చెక్కడపుపనితో ముద్దులు మూటగట్టు శిలాస్తంభములు మొదలయినవికూడ కొన్ని దొరకినవి. ఈ శిల్పసంపదనంతను అచ్చటనే యొక చిత్రవస్తు ప్రదర్శనశాలలోనుంచి భద్రపఱిచి యున్నారు.

సాధారణముగ స్తూపపు ఱాలమీద చెక్కు చిత్రములు బుద్ధునిజీవిత ములకు సంబంధించిన గాథలు. బుద్ధుని పూర్వజన్మమునకు సంబంధించిన గాథలనే జాతకకథ లందురు.

అమరావతీ, నాగార్జునునికొండ స్తూపపు కళాసంప్రదాయమే జావా (యవద్వీపము) యందలి జగత్ప్రసిద్ధమయిన బోరోబొడోరు స్తూపశిల్పకృతు లలో కానవచ్చునని కళాభిజ్ఞులు చెప్పుదురు. అమరావతీ, నాగార్జునుని కొండ స్తూపములయందలి బౌద్ధ కళాప్రాబల్య మొక బర్మా, జావా మొద లయిన సమీపస్థ ప్రాగ్దేశ ద్వీపముల యందలి కళమీఁదనేకాక చీనాదేశపు కళమీఁదకూడ నుండినట్లు తెలియుచున్నది.

# ౬. రాయలనాటి ప్రజాజీవితము

—శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

[శ్రీ కృష్ణదేవరాయలు సుప్రసిద్ధుఁడగు నాంధ్ర సార్వభౌముఁడు, మహాశూరుఁడు, మహాకవి, వాఙ్మయపోషకుఁడు, ప్రజారంజకుఁడు. క్రీ. శ. ౧౫౦౯—౩౦ వఱకు దక్షిణ భారతము నాఖండలవైభవముతో నేలిన రాజపరమేశ్వరుఁడు.]

రాయలకాలపు జనుల జీవితమును సాక్షాత్తుగా తెలుపు గ్రంథము లేవియులేవనుట నందఱు ఎఱిఁగిన విషయమే. పరంపరగా ఆ విషయమును స్పృశించు గ్రంథము లనేకములు గలవు. వానిలో ముఖ్యమైనవి మూఁడు: రాయలే రచించెనను ప్రసిద్ధిని బడసిన అముక్తమాల్యద; ఆయన కంకితములగు భాగ్యమును బడసిన పెద్దనార్యుని మనుచరిత్రము; తిమ్మన పారిజాతాపహరణమును.

పై మూఁడు గ్రంథములును ప్రబంధములే. సత్యమగు విషయమును మాత్రము చెప్పవలయునను నిర్బంధ మా గ్రంథ కర్తలలో నెవరుగాని చేసికొన్నవారు కారు. మఱియు అనుభవమునకు రానివి—అసత్యములైనవి—ఎన్నివిషయములు చెప్పినను ఎవ్వరును వారి నాక్షేపించినవారా కాలమున లేరు. నేఁడు మన మాక్షేపించిన వారికి నష్టములేదు; మనకు లాభములేదు. కాని వ్రాసినకవి సత్యమై యుండఁగా, అతఁడు జీవించి–సంచరించి–చూచి అనుభవించిన సంఘము కన్నులయెదుట సత్యమై యుండఁగా, అతఁడు వ్రాసిన కావ్యములలో మాత్రమే అంతయును అసత్యము యుండుట అసాధ్యము. తత్త్వశాస్త్ర సిద్ధాంతు లేమందురో కాని, సాహిత్యమువారమగు మనకు సత్యములేని యసత్యముగాని, యసత్యము లేని సత్యముగాని దొరకు పదార్థముగాదు! కనుక చాదస్తములేని దృష్టితోఁ జూచితిమేని, సమకాలిక జనుల త్రికరణ--ప్రవృత్తులు ప్రతికవి గ్రంథమునందును ప్రతిబింబించి యుండుట యెఱుఁగవచ్చును.

అట్లే పైమూఁడు గ్రంథములయందును వర్ణింపఁబడిన వ్యక్తులు ప్రాయశః అలౌకికములైనను, అవి లౌకికులగు కవులచేతిలోనే తయారైనవి గావున వీరి లోకపుగుర్తులను పూర్తిగా తప్పించుకొన లేకపోయినవి. శ్రీవిల్లిబుత్తూరినిండ వజ్రకుట్టిమములు, మణితోరణములు, సువర్ణసౌధములు

యెన్నియున్నను, ఆ యూరి సరస్సులలో అంతరగంగ, ప్రాఁచి యెట్లోవచ్చి నందులో దూఱి చోటుచేసికొన్నవి. (ఆము. మా. ఆ. ౧-౭౧). విష్ణుచిత్తుఁ డెంత విరక్తసంసారియై 'అబు-ద్దేక్షుధనుః-పత్రుఁడైనను- (ఆము. ఆ. ౫-౧౫౬) వానకాలమున భార్య వంటచేసిన పొగదగిలి యామె కన్నులు నొచ్చునే యని ముందుగానే టెంకాయ బొండ్లముల నెండించి సిద్ధముగాఁ జేసి పెట్టుకోవలసెను.(ఆము. ఆ. ౧-౮౦) మఱియు తన కుపా-యోపేయ-భూతుఁడగు శ్రీరంగనాథుఁడే తన బిడ్డను వలచి పెండ్లిచేసి యిమ్మని మధ్యస్థము పంపఁగా 'మీ యింటికివచ్చి పెండ్లిచేసి యీయను. మా యింటికి నీవే రావలయును' అని యా పరమభక్తాగ్రేసరుఁడు ఖండితముగాఁ బల్కి పూర్వకాలపు మామగారి మర్యాదను-ఈ కాలమున నిది అల్లుండ్ల మర్యాద-నిలుపుకొన్నాఁడు! (ఆము. ఆ. ౭-౫౫). పెద్దనగారి హిమవత్పర్వత శిఖర మందు పెరిగిన 'జటిల-ద్రాక్షా-గుళుచ్ఛంబులు' పెనుకొండవే; కోనలు, కాఱుచిచ్చులు, కోఁతులు, పందులు, దున్నపోతులు—అన్నియు నిక్కడివే యక్కడ కెక్కినవి. వరూధిని ఎన్నిమాఱులు జ్ఞప్తికిఁ దెచ్చుకొన్నను తాను దేవతయను విషయమును మరచి, పదేపదే మనవలె చెమర్చును; కన్నులు మూసికొనును. స్వరోచి నిర్జరుఁడే; కాని వానివెంట వేఁటకు పందివలలో మోచుకొని 'గూనివీపు లదర గొణఁగి తిట్టుచు నేకు గఱచినట్టి కుక్కగండ్లనంగ' మూతి నఱప మీసములతోఁ బోయిన బోయముదుసళ్ళు రాయలసీమ పల్లెలలోనివారే. (మను. ఆ. ४-3౬).

కాఁబట్టి కవులు కావ్యములందలి వస్తువుల నెంతపైకెత్తినను భూలోకపు గాలిని దాఁటునంతమీఁదికిఁ దోయఁజాలరు. అట్టిస్థితిలో అప్పటి మనుష్యస్వరూపమును వానినుండి వేఱుపఱచుట యొక కష్టముగాదు. పైమూఁడు గ్రంథములనుండి రాయలకాలపు రసికజీవన మెట్లుండెనని గ్రహింపఁ జూచుటయే యిప్పటి నాప్రయత్నము.

రసిక శబ్దమున కెక్కువ వ్యాఖ్యానము చేయనక్కరలేదు. రసికుఁ డనగా భోగియని యందఱెఱుఁగుదురు. తన మనస్సున కానందమునిచ్చు భోగము లనుభవించుటలో కష్టసుఖములుగాని, లాభనష్టములుగాని, తుదకు ధర్మాధర్మములుగాని యెక్కువగా లెక్కపెట్టక పనిచేయువాఁడు రసికుఁడు.

భోగములు ప్రవృత్తిభోగములని, నివృత్తిభోగములని రెండు విధములుగా వింగడింపవచ్చును. ఎందుకనఁగా, ప్రవృత్తిమార్గమునందుండి

ప్రాపంచికములగు గృహశయ్యాదిభోగముల ననుభవించుటయం దెంతయా నందముగలదో యంతే—మఱియు నంతకన్న నెక్కువయే—నివృత్తిమార్గము నకుఁ జేరిన భక్తి, త్యాగము, వైరాగ్యము, శాంతి మొదలగువాని ననుభవిం చునప్పుడును గలదు. ఆనందమనునది మనోధర్మముగాని వస్తుధర్మము గాదు. ఏకారణముచేతఁగాని దేనియందు మనస్సు దృఢముగా లగ్నమగునో దాని ననుభవించునప్పుడు మనకు నిరతిశయానందము గలుగును. అట్టి యానందమును సాధింపఁ బ్రయత్నించుటయే రసికత్వమునకు లక్షణము.

రసికత్వ మెంతయుండునో యంత గొప్పతనము మనుష్యజాతి యం దుండును. ఇది లేనివారు నడపీనుఁగులుగా నుందురేకాని, బ్రతికినవారి గుంపులోఁ జేరరు. కారణమేమనగా: రసికతకు మూలప్రకృతి సత్త్వము. సత్త్వమనగా, వలపు, ఉత్సాహము, కోపము మొదలగు భావములు మన స్సులో నుదయించిన వెంటనే, వాని యుద్రేకమునకు తగినట్లుగా దేహము నందలి నరముల బిగువు హెచ్చించి, రక్తము నుడికించి, కంప స్వేద రోమాంచాదులను గలిగించి కార్యశూరత్వమునకై ప్రేరించు చేతనగుణము. కావుననే పై కంప-రోమాం-చాదులు సాత్త్వికభావములని లాక్షణికులందురు. ఈ శక్తి బలిష్ఠముగా నుండనివారు రసికులు కాఁజాలరు. అట్టివారికి భావ ములు కలుగవచ్చునుగాని వానివలన ఫలమేమియుఁ గలుగదు. వారి వలపు, వంచన, వారి యుత్సాహము దంభము. వారికి కోపమువచ్చినచో పెదవులఁగొఱుకు బలమైనను పండ్లకుండదు. ఏపనినిగాని వారు పట్టనేపట్టరు, పట్టినను సాధింపఁజాలరు. రాయలకాలపువారి రసికత గమనించితిమేని మన మెంత యరసికశిఖామణులై యున్నామో పోల్చుకొని గ్రహింపఁగలము.

భోగములు ప్రవృత్తి నివృత్తిభేదముచే రెండు విధములంటిని. ఆ కాలపువారి నివృత్తి రసికత తరువాత వివరింతును. ప్రవృత్తిభోగములు పలువిధములు. పదార్థములు లెక్కపెట్టి పట్టీవ్రాయుటలో ప్రవీణులయిన ప్రాచీనులు ఈ భోగము లెనిమిది యనిరి. ఇల్లు, వస్త్రము, ఆభరణము, గంధము, పుష్పము, తాంబూలము, శయ్య, స్త్రీ యని; కాని యన్నిభోగముల కాధారమగు అన్నపానభోగములను వారేల పరిగణింపలేదో వింతగా నున్నది. మఱియు స్నానమునుగూడ భోగముగనే పరిగణింపవలసియున్నది. కాఁబట్టి మనకిప్పుడు పై పదునొకండు భోగ్యవిషయములఁగూర్చి యాకాలపువారి దృష్టిని తెలిసికొనవలసియున్నది. దృష్టిని దెలిసికొనిన సిద్ధిని దెలిసికొన్నట్లే. ఎందుకనఁగా మనసులోని పరాయణ మెంతగొప్పగా నుండునో యంత పూర్ణ

ముగా దానిని సాధించుట కందఱికిని శక్తి లేకున్నను కలవారు దానిని సాధించి తీఱుదురనుట యసత్యముగాదు. కావున వస్తువులను గూర్చి వారి దృష్టి యెఱుంగుటయే యిట్టి సందర్భములలో ముఖ్యము.

ఆ కాలపువారు అల్పతృప్తులుగారు. ఏవిషయమందును వారియాశ గొప్పది. జీర్ణశక్తియు దానికిఁ దగినట్లు గొప్పదే. వారపేక్షించు వస్తువులెల్ల నాయాజాతిలో సాధ్యమైనంతవఱ కన్నివిధముల నుత్తమములైనవి --- లేక యుత్తమములుగా వారికిఁదోచినవి. అట్టివానిని వారు తనివిదీఱ ననుభవించిన వారు. ఎక్కువ వారి స్వాధీనమందున్నప్పుడు, కొంచెమనునది వారెఱుఁగరు. భోగములేకాదు; వారి భావములును ఇట్టివే. పాండ్యరాజునకు 'వెఱ్ఱిశైవంబు ముదిరి' యుండెను. వానిభార్య పరమపతివ్రత; కాని యామెకు వైష్ణవంబు ముదిరి యుండెను. గ్రంథకర్త దీనిని వెఱ్ఱియనలేదు. కారణమేమనఁగా శైవ ద్వేషము, వైష్ణవాభిమానమునే అతనికంత ముదిరియుండుటయే. ఎట్లును ఏదియైనను 'ముదిరి'యుండుముకాని వారు పచ్చి, దోర యెఱుఁగరు. జోరని వాన గురియుచుండఁగా దేశాంతరమునుండి వచ్చిన మార్గస్థులు పట్టణము లలోఁ దలదాఁచుకొనుట కెక్కడనైనను నిలుతురుగదా! ఆ కాలమున నట్టి వారు వానవెలియు వఱకును అట్టిచోట్ల చర్చించు విషయము లేమను కున్నారు? అశ్వపతి, గజపతి, నరపతి-వీరిలో నెవరెక్కువ బలవంతులని! వారప్పు డొక్కొక్క రొక్కొక్కని పక్షము వహించి మాటలాడి, వాదించి, తుదకు వ్యవహారము తెగక మొత్తులాడుదురఁట! వాన కొంచెము వెలసిన వెంటనే యెవరిత్రోవ వారిదిగాఁ బోవుదురు! (ఆము. ఆ. ४-౧3). అది వేఱు మాట. 'పోనీలే; మనకేల?' యని తాము పట్టిన దేనినిగాని యుదాసీనముగాఁ జూచుపద్ధతియే యాకాలపువారియెడఁ గానరాదు. యామునాచార్యుఁడు చిక్కని బ్రహ్మచారి; అప్పుడతనికి చదువు, దానికి ఫలముగా పరులను వాద మున జయించుట, వైష్ణవమతమును స్థాపించుట-వీనియం దపారమైన యుత్సాహము; అవి సాధించి రాజైనాఁడు. ఆ రాజభోగములలో ప్రాత వన్నియు మరచెను. మఱల నెవఁడో తన తప్పుచూపి బోధింపఁగా ఆ క్షణ మందే రాజ్యము గీజ్య మన్నియు వదలి సన్యాసమును గ్రహించెను! ఇట్టి వారి భోగతృష్ణ యల్పముగాఁ గాని, భోగ్యవస్తువులు పనికిమాలినవిగాఁగాని యుండఁగలవా? క్రమముగా వానిని బరీక్షింతము.

ఆ కాలపు టిండ్లలో మనఃయూహాశక్తిని మీఱిన రత్నాలగోడలు, వజ్రాల కంబములు మొదలగువానిని మఱచితిమేని యింత తేల్చుకొనవచ్చును.

అవి యన్ని ఋతువులకును అనుకూలముగా హితముగా నుండునట్లు కట్టినవి. ముంగిటిలో ఇరుప్రక్కల అరుగులు, కంబములపై బొమ్మలు తీర్చి యుందురు. గోడలపై చిత్తరువులు, ఎత్తైన మేడలు, అచ్చటనే వెన్నెల సౌఖ్యము లనుభవించుటకు చంద్రశాలలు, కలశములు, ధ్వజములు. అవి పలువన్నెల వస్త్రములతోఁ జేసినవి. ఇంటికొక పూలతోఁట. అందు చెంగలువలకొలను. అవకాశమున్నచో దాని ప్రక్కన కృత్రిమముగా తయారుచేసిన కొండ. అందు వారివారి యిష్టానుసారముగా తయారుచేసిన గుహలు, మీఁదికి మెట్లు. నీటిని పైకి వెదచల్లు ధారాజల యంత్రములు. వేసవిలో ప్రత్యేకముగా చలువమయములైన ధారాగృహములు గలవు. ఇంటిలో చిలుకలు, హంసలు, నెమిళ్ళు, పావురములు, లేళ్ళు మొదలగు పెంపుడు జంతువులు గలవు. చిలుకలకు బంగారు పంజరములు, నెమిళ్ళకు 'యష్టి' యనఁబడు విశాలమగు గూటము-మీఁది పలుకయుఁ గలవు. చిలుకలకు మాటలు, నెమిళ్ళకు ఆటలు నేర్పుట యింటియాఁడువారి వినోదములలో నొకటి.

అప్పటి గృహరచనలో నిప్పటికన్న గొప్ప వింతయేమనఁగా; కోపగృహము! కోపగించుకొన్నవారు-ముఖ్యముగా యజమానునిపై యజమానురాలికి కోపమువచ్చినప్పుడు-ఆ కోపము తీఱువఱకును, లేక యెవరైన తీర్చువఱకును ఆ యింటిలోనుండి తలుపులు బిగించుకొందురట! ఏ బుద్ధిమంతుఁడు దీనిని కల్పించెనో కాని యిది చాల మంచిపద్ధతి. తక్కినవారు తమతమ పనులు తకరారు లేకుండ చేసికోవచ్చును. ఆ కోపము తీర్పవలసిన యక్కఱగలవారు పోయి తీర్తురు. కైకేయికొఱకు దశరథుఁడే దీనిని కల్పించెనేమో! రాయలకును, పెద్దన్నకును దీనియక్కఱ తోపలేదుగాని తిమ్మన్నకు మాత్రమిది సత్యభామ కొఱకై తయారు చేయవలసివచ్చినది.

వారి వస్త్రాభరణాదులకు ముందు వేషరచనలో ప్రధానాంగమగు స్నానమునుగూర్చి తెలిసికొందము. స్నానమనఁగా అభ్యంజనము. తక్కినది భోగములలోఁ జేరదు. అప్పటివారు సామాన్యముగా అభ్యంజనమే నిత్యస్నానముగా నుంచుకొన్నట్లు కానవచ్చుచున్నది. నిత్యాభ్యంజనము వైద్యశాస్త్ర విహితము. విష్ణుచిత్తుని యింటిలో ప్రతి శనివారము పరదేశ వైష్ణవులకు తలంటునీళ్ళు జరుగుచుండెను. వారికి అరటిపూరేకుల దొప్పలనిండ నూనెయు, ఉద్వర్తనమునకు ఇప్పపిండియు సరఫరా యగుచుండెను. (ఆ. ఆ. ౧-౮౫) నదిలో స్నానము. పాపమా పేదవాని యింట నంతకంటె నేమి లభింపఁగలదు? కలిగినవారి తలంటు తరగతియే వేఱు మొదలు సం

పెంగ నూనె మొదలగు సుగంధతైలములతో తలయంటు; తరువాత నెవరైనను వెండ్రుకలు మెల్లగా గోళ్ళతోవిప్పి, చిక్కుదీసి, విదిలించి, నడుమ నడుమ పన్నీరు చల్లుచు, శ్రీగంధము, ఉసిరికపప్పును నూరి పట్టించవలయును. తరువాత దేహాభ్యంగము, పిదప 'గొజ్జఁగినీటి వెల్లువలు, గోవజవాదుల నిగ్గుచూప' (మను.ఆ. ౫-౫౭) తెఱపిలేక పలువురు వెంట వెంటనే పోయవలయును. తరువాత పలుచని వలిపముతో వేఁడొక్కరు తడి యొత్తవలెను! అభ్యంగపు గుణములు పొగడుట కాయుర్వేదమునకు మాటలు చాలవు. కావుననే మనలో నన్నిశుభకార్యములకు నది మొదటిదిగా పెద్దలు నిర్ణయించిరి· ఆరోగ్యకాంక్షులగు రసికులు సుగంధతైలాదిసేవనచే దానిని మఱింత యాహ్లాదకరముగాఁజేసి యనుభవించిరి· మరియు ఆ కాలమున స్త్రీలకు, పురుషులకుఁగూడ నిడుపై దట్టమైన తలవెంట్రుకలు కలవు. అది యొక యలంకారముగా వారు భావించిరి. స్త్రీలకు తలనిండ వెండ్రుకలున్న సొగసను విషయము మన మింకను పూర్తిగా మఱచిపోలేదు. కాని మగవారికి వెండ్రుక లలంకారముగాదు. వికారమను భావము నేఁడు ప్రబలినది. దానికిఁదోడు పాపట మగవారందఱి తల కెక్కినది. తలవెండ్రుకల సొంపును, సొగసును పురుషులందుఁగూడ గమనించి సంతసించినవారిలో పెద్దన్న మొదటివాఁడని చెప్పవలయును. పరమవైదికుఁడగు ప్రవరునికిని 'తెగఁబాఱెడు వెండ్రుకలు' తలపై మోపిన వాఁడతఁడు! (మను. అ. 3-౬) సగరచక్రవర్తి ముమ్మనుమఁడు భగీరథుఁడు తపస్సు చేయునప్పుడు తక్కిన యవయవము లెంతకృశించినవని గమనింపలేదుగాని వాని 'నిడుద పెన్నెఱివేణి జడగట్టె' ననియే పెద్దన్నకు పెద్దదుఃఖము! (మను. ఆ· ౨-౯) వెండ్రుకలను బెంచుటకు అభ్యంగమే ముఖ్యదోహదము. కావుననే ఆ కాలపువారి కది యంతముఖ్యము.

వారు ధరించుచుండిన వస్త్రములు ముఖ్యముగా వన్నెలవి. వట్టి తెల్లవస్త్రమును పురుషు లపురూపముగా ధరింతురుకాని స్త్రీలకు మాత్ర మవి పనికిరావు· సత్యభామకు కోపమువచ్చినప్పుడు తెల్లచీర గట్టుకొని యుండెనఁట (పా. ఆ. ౧-౧౧౫). తక్కినపు డెల్ల చాల నభిమానముతోఁ గట్టుకొను వస్త్రములు చెంగావివి. అందును బంగారుసరిగలు నించినవి చాల ప్రియములు. వైదికుఁడగు ప్రవరుని వేషము వేసికొన్నను గంధర్వుఁడు 'పసిండిప్రాఁత చెరంగు మిసిమి దొపఁజెలంగు నరుణాంశుకోత్తరీయంబుతోడ' (మను. ఆ. 3-౭౧) నే వచ్చెనుగాని దానిని మానలేడయ్యెను! వాఁడు కట్టిన ధోవతియు 'నీర్కావిపింజ' గలదె. కొందఱు 'మువ్వన్నెచుంగు' లను దాల్చుచుండిరి.

(ఆ. ఆ. ౧-౩౮). ఈ వస్త్రములన్నియు పాముపొరలవలె 'ఊఁదినఁబాఱు' నంత సూక్ష్మముగా నుండెనఁట! (మను. ఆ. ౩-౩౭) రాయలదాడికి వెఱచి గజపతి యడవులకుఁ బాఱిపోఁగా నతని దేహమున కంటుకొన్న సాలీండ్ల వలలు వుత్తరీయములవలెనే యుండెనట! (ఆ. ఆ. ౧-౩౮) అట్టి సొకుమార్యము నపేక్షించు రసికులుండిరి. కావుననే యాకాలమున నట్టి నూలును, అట్టి నేఁతయు సాధ్యములైనవి.

సొమ్ముల విషయమున అకాలమందు స్త్రీ పురుషుల కెక్కువ భేద మున్నట్లే తోపదు. సొమ్ముల స్వరూపమందు కొంత తేడాయుండవచ్చును గాని—అదియు సందేహమే—వాని మీఁదియాశలో నిరువురును సమానులే. స్త్రీలకు ఆభరణములు ధరించుట యావశ్యకమని శాస్త్రమే విధించుచున్నది. భర్తకది అయుస్సును వృద్ధిబొందించునఁట. అది నిజమేని అప్పిచ్చినవారిదే అదృష్టము. కాని మగవాఁడును వారాల సొమ్ములు ధరింపవలెనని రాయల రాజనీతి! హారములు, భుజకీర్తులు, ఉంగరములు, ఒడ్డాణము, కాళ్ళచేతుల కడియములు, చెవుల కుండలములు, శిరోమణి మొదలగునవి యాకాలమున స్త్రీ పురుషులు సమానముగా ధరించుచుండిరి. మగవారికి కిరీటము, ఆడువారికి ముక్కర మొదలుగా కొన్నిటిలో భేదమున్నట్లు తోచుచున్నది. ఇట్లు సమానమైన యాభరణముల యాశగల యాలుమగల సంసారములో శాంతి యెక్కువగా నుండునేమోయని యూహించుచున్నాను. ఉన్న నిద్దఱికిని సొమ్ములుండును. లేకున్న నిద్దఱికినిలేదు! అంతేకాని ఆర్జించు శ్రమమంతయు నొకరికిని, అలంకారమంతయు నొకరికిని అను తకరారు లేకుండును. నిజముగాఁ జూచిన మగవారికి సొమ్ములమీఁది యాశ యేల యింతగా తగ్గినదని చిత్రముగాఁ దోచును. ఇప్పటి మగవారిది మఱియు నన్యాయము. అనఁగా సొమ్ములమీది యాశ యిప్పటి పురుషులకు పూర్తిగా నశించినదని చెప్పలేము. అట్లగుట స్వభావ విరుద్ధమేమో! పూర్వము కిరీట-కట-కాంగద-మేఖ-లాదులయందున్న యాశ యిప్పుడంత ర్థానమై గుండీలు, గడియారపు గొలుసులు, అపురూపముగా ఉంగరములు మొదలగువానియందు వెఱచి వెఱచి వ్యాపించుచున్నది. దీనికర్థ మేమనగా: మనకు నేఁడు మనజాతిసొమ్ములు మనయానందమునకై ధరించు ధైర్యము లేదుగాని, ఇంకొకజాతిసొమ్ములు వారి మెప్పులకై ధరించు దాస్యమున్న దన్న మాట. మన వస్త్రములు నిట్లేకదా! సరిగంచుల సేలము—ధోవతులు—నేఁతపనికెల్ల నెత్తి పూలవంటివి—గట్టుటకు మనకు సంకోచముకలదుగాని,

'సర్జుసూటు' లలో దూఱుటకు సిగ్గులేదు! పింజెలుపోసి యలంకారముగా చుంగులు చుంగులుగ ధోవతి కట్టుకొని బైటఁ గనబడుటకు బిడియము; కాని చాఁకలివాని 'ఇస్త్రీ' రేఖలు చెడునేమోయని చేతులు, కాళ్ళు చెక్క బొమ్మలవలె ఆడించుచు వీథులలో వెడలుటకు వెనుదీయము! ప్రాచీనులు స్వతంత్రులు, రసికులుకావుననే వారు తమకు సొమ్ములపైగల ప్రీతిని తమ యిచ్చవచ్చినట్లు ధారాళముగ, నిర్భయముగఁ జూపుకొనువారు. మన వలె వారికి మఱియొకరి మొగముచూచి వారికన్న ముందర పండ్లిగిలింప వలసిన పని యుండలేదు.

ఆ కాలపువారి వేషరచనలో గంధపుష్పములు ప్రధానములైనవి. పరదేశములనుండి స్వదేశమునకు సుగంధద్రవ్యములు సమృద్ధిగావచ్చుటకు అనుకూలములు గల్పింపవలయునని రాయల రాజనీతి. (ఆ. ఆ. ४-౨४౫) రాచనగరిలో సుగంధములకొక్క పెద్ద భాండాగారముండెను. కొమరగిరి వేమారెడ్డికాలమున నా భాండాగారాధ్యక్షుఁడైన యవచి తిప్పయ్య సెట్టి పేరు శ్రీనాథుని పుణ్యమున ఆంధ్రవాఙ్మయమున శాశ్వతముగా నిలిచినది. ఏ పదార్థములకు సుగంధము చేర్ప వచ్చునో యాపదార్థములకెల్ల వారు వాసనకట్టియే యనుభవించిరి. వారి యిండ్ల కిటికీలగుండా ఎప్పుడును సుగంధ ధూపములు వెడలుచుండెను. తుదకు వీథులలో గంధపు నీళ్ళతో కలయంపి చల్లవలెనని వారి పరాయణము. కస్తూరి, పునుఁగు, జవ్వాజి, పచ్చకర్పూరము, కుంకుమపూవు, శ్రీగంధము, అగరు, పన్నీరు, మొదలగు సహజసుగంధ ద్రవ్యములలో వారు మునింగి తేలినవారు. కొంత ప్రాతపడినను పరిమళము తగ్గునని వానిని వారు స్వీకరింపరు. వరూథిని ప్రవరునికి చూపిన యీ పరిమళవస్తువుల గమగమలూహించి యానందింపుఁడు:—

"సద్యో-వినిర్భిన్న-సారంగనాభికా
హృతమై పిసాళించు మృగమదంబు,
కసటువో బీరెండఁ గరఁగి కఱ్ఱలనంటి
గమగమ వలచు చొక్కపు జవాజి,
పొరలెత్తి ఘనసార తరువులఁ దనుదాన
తొరఁగిన పచ్చకప్పురపుసిరము,
గొజ్జంగి పూఁబొదల్ గురియంగఁ బటికంపు
దొనల నిండిన యట్టి తుహినజలము,
వివిధ - కుసుమ-కదంబంబు........"

(మను. ఆ. ౨-౫౫).

ఇవిగాక వీనిపరస్పర సమ్మేళనముచే తయారగు కలపములు పలు తెఱఁగుల నుపయోగించుచుండిరి. ఆ కాలమున నీ సుగంధద్రవ్యములను తయారుచేయుటలో ఆంధ్రులు చాల ప్రసిద్ధులఁట. వారు 'చెవుల సంకులు, లోవంకభుజంబులు, కొంకిసిగలు, కావి దుప్పట్లు' గలిగి 'గంధకలనా - కుసుమ - స్ర - గ్గ్రథ - నాదుల నాంధ్యంబులే కలరు' చుండిరని రాయలు చెప్పుచున్నాఁడు (ఆ. ఆ. ౪-౩౫). తరువాత మహమ్మదీయుల రాజ్యకాలమున హిందువు లావిద్యను మఱచిరి. కాని మహమ్మదీయులు దానియందు చక్కని పాండిత్యమును గడించిరి. నేఁటికిని పరిమళకారకవిద్య యించుమించు వారి సొమ్మైయున్నది. ముసల్మానులు సామాన్యముగ మనకన్న నెక్కువ రసికులుగా నింకను ఉండుటయే దానికి కారణము. నేఁటి మన పాలికి బ్రహ్మదేవుఁడు సుగంధ వస్తువులనే సృష్టిచేయకయుండినను నష్టము లేదు. ముక్కున్న ముక్కుఁడి వారము మనము. మఱియు మనకిప్పు డా తీక్ష్ణ సుగంధములను ఓర్చుకొను శక్తియులేదు. కస్తూరివాసన చూచితిమేని మన కిప్పుడు ముక్కులో నెత్తురుపడును! మనలో నిందుమీఁద నెవరికైనను సుగంధము ఎందుకైనను గావలయునేని పడమటిసీమవారి సారాయికంపుల 'సెంటు' లున్నవి. కాబట్టియే అపురూపముగా పెండ్లిపేరంటములలో ఎవరైన అత్తరో, పన్నీరో యిచ్చినయెడల, అది దేహము నెక్కడసోకునోయను భయముచే ముక్కు మైలుతో మురుగు చేతిరుమాళ్ళలో వేయించుకొని భద్రముగా మడచి జేబులలో దాచిపెట్టుదుము! ఒక వేళ నాశపడినను మనమేమి ఒడలిపై స్వతంత్రముగా పూసికొనఁగలమా! మన దేహములు మన యధీనములా? దర్జీవాని కమ్ముకొన్నవి! వాఁడు మన కష్టదిగ్బంధనము చేసి మన స్వేదపరిమళమును మన దేహముమీఁదనే భద్రముగ రక్షించి పెట్టుచున్నాఁడు!

సుగంధముపై నింత యభిమానము కలవారు కావుననే యాకాలపు వారికి పూవులన్న ప్రాణముగానుండెను. ఇండ్లకు ఉద్యాన మొక ముఖ్యాంగమని వెనుకనే చెప్పితిని. అందులో అనేకవిధముల పుష్పలతలు దండిగా పెంచుచుండిరి. పూవులనఁగా నిర్గంధకుసుమములుగావు. కన్నులకు ముక్కునకుఁగూడ అప్యాయనకరములగు పూవులను మన భరతభూమివలె నే యితరదేశమును మనకీయఁజాలవు. కావుననే మన ప్రాచీనులు "వాసనలేని పువ్వు, బుధవర్గములేనిపురంబు..." అని పరిమళములేని పువ్వులను పనికిరాని పదార్థములలోఁజేర్చి తిరస్కరించిరి. పరిమళములేకున్నను కొన్ని

పువ్వులు అందముచే జనుల నాకర్షించును. మన దేశమం దట్టి పువ్వులలో నుత్తమమైనది, విడువరాని చెలువముగలది తామరపువ్వు. కాబట్టి దానిలో లేని పరిమళమును కొండంతలుగా వర్ణించి మనకవులు తృప్తిపడుదురు! అప్పటి తోఁటలలో పెంపఁబడునవి, వారెక్కువ ప్రీతితో వాడుచుండినవి, పాదరీ, జాజి, విరజాజి, మల్లె, మొల్ల, సంపంగి, చెంగలువ మొదలగునవి, గొజ్జఁగి పువ్వులును, వానినుండి సోనలుగాజాఱు సుగంధ జలమును ఆ కాలపు కావ్యములందు పలుమాఱు వర్ణింపఁబడినవి· ఇవి యే పువ్వులో తెలియదు. గులాబిపువ్వులేయని యొక్కరు వ్రాసిరి. అది నిజమేని గులాబి పువ్వులనుండి పన్నీరు కాఱుచుండునని యాకాలపుకవులు నమ్మిరనవలసి యున్నది. అనఁగా వారా పువ్వులను చూడకయే వ్రాసినారన్నమాట! ఉండవచ్చును. అది ఉండనిండు. ఇంటి తోఁటల పూవులేకాక పుష్పలావికలు వానిని వేఱుగా అమ్ముచుండిరి. ఆ కాలపువారు పూవులను చిత్రవిచిత్రములగు హారములుగాఁగూర్చి మెడలో ధరించుచుండిరి; ఎత్తులుగట్టి తలలో ముడుచుకొనుచుండిరి. ఇండ్లముందఱ ప్రాతస్సాయంకాలములందు చల్లుచుండిరి; సరములుగట్టి తోరణములుగా వ్రేలార్చుచుండిరి; వస్త్రములు తైలములు మొదలగువానికి వాసనకట్టుచుండిరి; చెండ్లుగాఁగూర్చి సరసక్రీడలాడుచుండిరి; విసనకఱ్ఱలుగాఁగూర్చి వీచుకొనుచుండిరి! తుదకు వేసవి రాత్రులందు గంపలకొలఁది పాన్పుగాఁ బఱచుకొని దానిపైఁ బరుండి నిద్రించుచుండిరి! మన యిప్పటిస్థితి చూడుఁడు. సుగంధమే యక్కఱలేనివారికి వాసన పూవులేల? దొరలసీమలోని పూవులకు వాసనలేదు. కాని వారు రసికులు కావున వానివన్నెకు, రూపమునకు వలఁచి పలుకష్టములువడి తోఁటలలో, ఇండ్లలో పలువిధములుగా పెంచుకొని చూచి సంతోషింతురు. వారికి దొరకిన సుగంధ పుష్పమంతయు ఒక గులాబిపూవే. దానికి వారెన్నియో దోహదములుచేసి దివ్యకుసుమముగా భావించి పెంచుకొందురు. కనుక మనకును అవే గతియైనవి. పార్కులలో, ఇండ్లముందఱ, కుండలలో, మేజాల పైని గ్లాసులలో, ఉత్సవకాలములందు వచ్చిన పెద్దమనుష్యులకిచ్చు చేతి తురాయిలలో, అగ్రాసనాధిపతుల కందిచ్చు పూలటోపీ గంపలలో—ఎక్కడ చూచినను అవే నిర్గంధకుసుమములే! అపురూపముగా నేఁటి తరుణులు దొరలవలెనే కోటుగుండీల సందులో గులాబిపువ్వు చెక్కుకొనుట కలదు కాని మఱి యే వాసనగల పూవునుకాని అంతమాత్రము మన్నించిన పాపమునఁబోగా నేను జూడలేదు. వేయేల బెంగుళూరు 'లాల్‌బాగ్' వంటి

తోఁటలో, వేలకొలఁది నెలకు వెచ్చమగుచున్నను, మల్లితీఁగ వంటి దొకటి చూతమన్నను లేకయుండుటకు మన యరసికత్వమేకదా కారణము! పోనిండు.

ఆకాలపువారి అన్నపాన భోగములను వినుఁడు. అమృతము ద్రాఁగి ఆఁకలిదప్పులు చంపుకొనియున్న దేవతలకుఁగూడ, 'అప్పటప్పటికిని జిహ్వ త్రుప్పుడుల్ల 'అమెతలు'— అనఁగా విందుభోజనములు గావలయునఁట! (మను. ఆ. ౨-౧౧) అట్లున్నప్పుడు నిత్యమూ కనీసము రెండుపూటలు ఆఁకలిదప్పులు గలిగిన యదృష్టవంతులకు, రుచినెఱుఁగఁగల రసికులకు, అడుగవలయునా? కాఁబట్టి యప్పటివారికి భుక్తివిషయమై చాల శ్రద్ధ. ఏయే ఋతువునందు ఏయే తినుబండములు, పానీయములు హితమో ఆయా ఋతువుల వాని వానిని తిని త్రాగుచుండెడివారు. విష్ణుచిత్తుని యింటి నిత్యసమారాధనలో వేసవి భోజనమును వినుఁడు:—

'చ. తెలి నులివెచ్చ యోగిరము
తియ్యని చారులుఁ దిమ్మనంబులుఁ
బలుచని యంబళుల్ చెఱకు పా
లెడనీళ్ళు రసావళుల్ ఫలం
బులును, సుగంధి-శీత-జల
ముల్, వడపిందెలు, నీరుఁ జల్లయుఁ,
వెలయఁగ బెట్టు భోజనము
వేసవిఁ జందనచర్చ మున్నుగఁ'

(ఆ. ఆ. ౧-౧౮)

రాజపురోహితునియింట జరుగుచుండిన యీ క్రింది పానక పూజ మన కీ కాలమున తలఁచుకొన్న 'హా' యనిపించుచు ఉవ్విళ్ళూరించును:-

'పరిపక్వ-సురభి-రంభాఫలంబులతోడ
దళమెక్కు పనస పెఁ దొనలతోడ,
ఘృతపిండ-నిభ-శర్కరీ-ఖండములతోడఁ
బలుతెఱంగుల మావిపండ్లతోడ,
గోస్తనీ-మృదు-గుళుచ్ఛ-స్తోమములతోడఁ
గప్పులేఱిన వడప్రప్పుతోడ,

సుమధుర-స్థూల-దాడిమ బీజములతోడఁ
దనువారు రసదాడి గనెలతోడఁ
బానకం బతిథుల కిడ్డఁ దాను గ్రోలి
యర్చనా - దత్త - చందనచర్చఁ దేలి
విరులు సిగఁవాల్చి కర్పూరవీటి జౌరు
కొట్టుచు ద్విజుండు వెన్నెల బిట్టు గాయు'

(ఆ. ఆ. ౨-౭౩)

ఇవి శాకాహారులయింటి తిండితీర్థములు. ఇతరులు దోరమామిడి ముక్కలలో అప్పుడే తడియార్చిన చేఁపలు తరిగివేసి నువ్వులనూనె తిరుగఁ బోతవేసి తాలింపుచేసి తిందురఁట (ఆ. ఆ. ౨-౬౮). వేసవిలో - ఈ తాలింపు సుఖమును తినిచూచినవారు చెప్పవలయునుగాని నేనెఱుఁగను. ఆ చేఁపల కూరను తిన్న కనరు పోవుటకు సంధ్యావేళలందు ఇసుకలో పూడ్చి పెట్టి యుండిన చల్లని యెడనీళ్ళు త్రాఁగుచుండిరి. ఇంకను భోగాసక్తులు నారికేళా సవమును ద్రాఁగుచుండిరి (ఆ. ఆ. ౨-౬౧). ఇతర ఋతువులలో వేఱు మద్యము. మద్యపానము పంచ మహాపాతకములలో నొకటిగా భావింపఁబడి యున్నను, ధర్మశాస్త్రములు దానికెంత కఠినశిక్ష విధించినను, మనకవులు మాత్రము దానిని వదల లేకపోయిరి. కవులు వదలలేదనఁగా జనులు వదల లేదనియే యర్థము.

పైది కొంతవఱకును నాగరకులయిండ్ల భోజనము. అనాగరకులగు వారి యిండ్లభోజనము తక్కిన ఋతువులలో నెట్లుండునో యెఱుఁగముగాని వారి వాన కాలపుభోజన మిట్లుండునఁట:—

'మ. గురుగుం జెంచలి తుమ్మి తేఁదగిరిసా
కుం దింత్రిణీ - పల్లవో
త్కరముం గూడఁ బొరంటి నూనియలతో
గట్టావిఁ గుట్టారికో
గిరముల్ మెక్క, తమిం బసుల్ పాలములో
గ్రేఁపు ల్మెయిఁ నాక, మే
కెరువుం గుంపటి మంచ మెక్కరి ప్రభు
త్వైకాప్తి రెడ్లజ్జడిన్'

(ఆ. ఆ. ४-౧३४)

నాగరకుల భోజనమందు వారికెంత తృప్తి సంతోషములు గలవో వీరికి వీరి భోజనములందును అంతేకలవు. కారణ మేమనగా అది జాత్యన్నము. 'అమృతమైనను జనుల జాత్యన్న సమమే!' (ఆ. అ. ౬-౩౪) యని రాయలు చెప్పెను. త్యాగరాజు అటుకుల రుచి యెద్దులకు తెలియునా యని యడుగుచున్నాఁడు! (చూ. 'కలి నరులకు.') అనఁగా పలుమాఱు తిని యనుభవించి వాఁడుకపడిన వారికిఁదప్పఁ దక్కినవారికి పదార్థములరుచి గోచరింపదు! 'అనుభవరసికో విజానాతి' యను నానుడి సర్వసత్యమైనది. రుచిగూడ మనస్సులోనున్నంత వస్తువులలో లేదు.

ఇంత పాన భోజన ప్రియులగువారి కజీర్ణ రోగములు రావాయని యడుగవచ్చును. కాని యిట్లడుగుట మన జీర్ణశక్తి యింతటిదని వెల్లడించునేకాని వేఱుకాదు. కారణమేమనఁగా వారాఁకలికి భుజించువారే కాని మోమోటమునకుఁగాని, పద్ధతి ప్రకారముగాని ఇష్టము లేకున్నను భుజించువారుగారు. పగటిపూట 'అపరాహ్ణమునన్ గాని మఱి శుద్ధకోష్ఠతఁగాని తమిఁజ భుక్తి యెపుడుఁగనఁ బథ్యమగుఁజ' (ఆ. అ. ౪-౨౮౧) అనుట రాయల రాజనీతియందలి రత్నములలో నొక్కటి. ఆహారదోషము ఆరోగ్యనాశమునకే కాక 'విజ్ఞాననాశంబునకును మూలంబు' అని వారు గమనించినవారు. (ఆ. అ. ౪-౧౯౪) మఱియు ఏయే ఋతువులయం దేయేతిండి హితమను విషయమున వారెక్కువ జాగ్రత్తగలిగి యుండిరని చెప్పితిని. అన్ని కాలములందును ఒకటేవిధముగా అత్యాహారమో అల్పాహారమోచేసి అజీర్ణ రోగములను వరమడిగి తెచ్చుకొన్నవారము మనము. ఆహారమందేకాదు; అన్నిటియందును ఆరోగ్యదృష్టి వారి కెక్కువ. రాగముయొక్క విలువను, శక్తిని హెచ్చించునది త్యాగము. ఇది లేనప్పుడే యది రోగముగా పరిణమించును.

ఆకాలపువారి యజీర్ణా-ద్యాహార-దోషములను సవరించు నిత్యౌషధము తాంబూలము. ఔషధము మాత్రమేకాదు; ఇది హిందువులకు ధర్మశాస్త్రము దయతో ననుగ్రహించిన మత్తుపదార్థముగూడ. బ్రహ్మచారి, వితంతు, సన్యాసులు తప్ప తక్కినవారందఱును దీని నుపయోగింపవచ్చును. వచ్చుననియేకాదు, వలయునుగూడ. తాంబూలమనఁగా కేవల మాకు వక్క సున్నములుమాత్రమేకాదు. కర్పూరము, కస్తూరి, ఏలకులు మొదలగు పరిమళద్రవ్యములు లెక్కలేనన్ని యందుఁ జేర్చుచుండిరి. వచ్చినవారికి మర్యాదగా 'కర్పూర తాంబూలము' పెట్టుట యాకాలపు సామాన్యాచారములలో నొకటి. వరూథిని వసించిన కోన చేరఁబోవునపుడు ప్రవరునికి వచ్చిన

దాని తాంబూలపు తావి, ప్రపంచమున మనుచరిత్ర యున్నన్నినాళ్ళను గమగమలాడుచుండును.

'మృగమద-సౌరభవిభవ-
ద్విగుణిత-ఘనసార-సాంద్ర-వీటీ-గంధ
స్థగి-తేతర-పరిమళమై
మగువ పొలుపు దెలుపు నొక్క మారుత మొలసెన్'

(మను. అ. ౨-౨౪)

కావుననే యీ మందు భోగముగా పరిణమించినది. నిత్య జీవితము ఇది లేకున్న పూర్తి కానేరదు! దేవుని పూజగూడ తాంబూలము వేసికొనియే చేయవలెనని శాస్త్రమున్నది. 'రమణీ ప్రియదూతిక తెచ్చియిచ్చు కప్పుర విడెము' లేకున్న కవిత్వము సాధ్యముగాదని పెద్దన్న చెప్పెను! ఇట్టి తాంబూలములోని యితర పరిమళ ద్రవ్యములన్నియుఁ దీసివైచి నేఁడు అనేకులు వానికిబదులుగా పొగాకును చేర్చుకొన్నారు! నేఁటివారనగా ప్రాతపద్ధతికిఁ జేరినవారనుట. క్రొత్తనాగరక తరుణులలో ననేకులకు తాంబూలము తల దిరిగించునుగదా! కాని పొగాకుపొగ మాత్రము వారికి తిరుగుచున్న తలను నిలుపును.

ఆకాలపు శయ్యలలో ముఖ్యమగు పూలపాన్పును వెనుకనే చెప్పితిని కదా! రెండవది చిగురాకుల పాన్పు. పూవులకు తరువాత చిగుళ్ళపై ప్రాచీనులకు చాల నభిమానము గలదు. వానిని మంగళద్రవ్యములుగా వారు నిర్ణయించిరి. మూఁడవది హంసతూలికాతల్పము — అనఁగా హంసలయొడలిపైనున్న చిన్నని యీఁకెలను దెచ్చి యీనెలుతీసి ప్రత్తికి బదులుగా నుపయోగించి నించి కూర్చినదే. ఇది ధనికులలో సామాన్యముగా నుండెను. ఇందుకై యెన్ని హంసలను జంపవలసియుండెను అనుమాట వేఱు. రసిక ప్రపంచమున పాపపుణ్యచర్చ కెక్కువచోటు లేదని మొదలే మనవి చేసితిని.

ఆకాలమువారు కేవల స్వార్థపరులైన భోగులో యోగులో మాత్రమై యుండలేదు. వారి దృఢ మనోబలమును కార్యసాధన శక్తియు నిట్టిదని యూహించుటకు పై రెండు ప్రవృత్తి నివృత్తి విషయములు మాత్రము గ్రహించితిని. వారు యుద్ధములను జేసిరి; రాజ్యములను గెలిచిరి; దేశమును సురక్షితముగా నేలిరి; చెఱువులు, కాలువలు త్రవ్వించిరి; స్వప్నమందును ఊహింపరాని శిల్పములను సృజించిరి; చదువు సంధ్యల నభివృద్ధి

పఱచిరి; చేతికొలఁది దానములిచ్చిరి. కాన, వానినెల్ల వివరించుటకు నాకు శక్తిగాని, మీకవకాశముగాని చాలదు.

కడపటిమాట యొకటిచెప్పి ముగించెదను. ఏపనికి చేయివేసినను ఆ కాలపువారు సాధించిన సిద్ధులు చాల గొప్పవి. రసికజీవనపు ఫలమది. వారికి భోగ తృష్ణయెట్లో యట్లే దయ-శౌర్యము-ఔదార్యము—పాండిత్యము - వైరాగ్యము—అన్నియును గొప్పవే. అల్పత్వమునకు రసికుల బ్రదుకులో చోటు లేదు. అందు మంచిదానివలె చెడ్డదియు గొప్పగా నుండవచ్చును; ఉండును. పెద్ద వ్యాపారములో లాభనష్టములు రెండును పెద్దగా నుండును. గుగ్గిళ్ళమ్ము వారికి రెండును స్వల్పములే. మఱియు లాభమును గమనింపక నష్టమునకు మాత్రము వెఱచి వ్యాపారము వదలఁజూచుట వెఱ్ఱి. శ్రీరామునివంటి యవతార పురుషుఁడున్న కాలములో ప్రక్కలో పదితలల రావణుఁ డున్నను ఓర్చుకొనవచ్చును. ఓర్వవలయునుగూడ. ఎందుకనఁగా, రాముఁ డులేని రావణుఁడుగాని, రావణుఁడులేని రాముఁడుగాని యేకాలమందును గలుగుట యరుదు. ఆ యిరువురును బీరువాలలోని వ్రేలెఁడంత బొమ్మలై యుండుటకంటె, ప్రాణముగల పెద్దవ్యక్తులై యుండుటమేలుగదా! జనులలో రసికతపెరిఁగినకొల్ల సదసత్తులు పెరుఁగును; తరిగినఁ దరుగును. కావున నెన్ని దోషములున్నను రసికత్వము తిరస్కరింపఁదగినదికాదు. అది నాగరకతకు నిదానము; పౌరుషమునకు ఫలము; అభ్యుదయమున కాధారము!

---

## ౭. హైందవ ధర్మవీరుడు

## ౧. తానాజీ మాలుసరే

—శ్రీ సురవరము ప్రతాపరెడ్డి

వీరమాత జిజాబాయి ఒకనాడు దంతపు దువ్వెనతో తలదువ్వుకొనుచు, తన ప్రతాపగడ్ కోటపైనుండి తూర్పుదిక్కు చూడగా మధ్యందిన మార్తాండుని కిరణ ప్రసారముచే నిగనిగమని తెల్లనిమేడలతో కోడిగ్రుడ్డువలె మెరయుచు, సింహగడ్‌కోట దూరమందు కనుపించెను. అదిక్కు అట్లేచూచుచు, దీర్ఘాలోచననుండి విషాదములోఁబడి “నిన్నమొన్నటివఱకు మావశమందుండి, నేడు మా మతద్వేషియగు ఔరంగజేబు వశమయ్యెగా” అని క్రమముగా క్రోధావేశముపొంది, వెంటనే యొక సవారును, “రాయగడ్‌లోనున్న తన కుమారుని—ఛత్రపతి శివాజీ మహారాజును తత్క్షణమే ఎట్లున్నవాని నట్లే, భోజనము చేయుచుండినను మానుకొని చేయియైనను కడుగుకొనక, రావలసినదిగా నాయానతి వినిపించుము, పొమ్ము” అని యాజ్ఞాపించెను. మాతృవాక్య పరిపాలకుడగు శివాజీ అన్నిపనులను వదలుకొని, వార్త వచ్చినవెంటనే పయనమై వెళ్ళి, తనతల్లి కాళ్ళపై తల వాల్చెను. జిజాబాయి కొడుకును సర్వదిగ్విజేతవు కమ్మని దీవించి, తనతో పాచికలాడుమని నిర్బంధించెను. శివాజీ నిరాకరించెను. జిజాబాయి స్వభావముచే పట్టిన పట్టు వదలనట్టి ధీర. ఒప్పుకొనక తప్పదయ్యెను. పందెములో శివాజీ ఓడిపోయెను. “అమ్మా! పందెము నీవే గెలిచితివి. నీ యిష్టమున్న కోటను తీసికొనుము” అని పలికెను.

“నాకు సింహగడ్ కోటయే కావలెను. దానిని నా వశముజేయుము” అని తల్లి కోరెను.

“అదిప్పుడు నాతో కానిపని.”

“అయితే నేను పిఱికివాని తల్లిననియా నీ యభిప్రాయము.”

“అదికాదు. ఆకోట అత్యంత దుర్భేద్యమైనది. ఎన్నివేల సైన్యముతో ముట్టడివేసినను అది వశముకానట్టిది.”

“అయితే ఏమాయె, నా కా కోటయే కావలెను. నీకిమధ్య యెవ్వరో పిరికి మందు పోసినట్లున్నది.

"ఆకోటను రక్షించువాడు ఉదయభానుడనుమహాయోధుడు.రాజపుత్ర, పఠాన్, అరబ్బువీరులు ఆకోటను ఏమరక కావలి కాయుచున్నారు. అయి ననూ కొంతకాల మాగుడు. చుట్టుపట్టుల కోటలను క్రమముగా సాధించు చున్నానుకదా! అదియు సాధించితీరుదును."

"ఎన్నడో సాధించుట నాకు సరిపడదు. నా కిప్పుడే సాధించి యీయ వలయును."

శివాజీ దీర్ఘాలోచన నిమగ్నుడై ఎట్టకేలకు తల్లికి మాటయిచ్చి ఆమెను తనవెంట రాయగడ్‌కోటకు పిలుచుకొనిపోయెను.

ఈ సాహసకార్యమును ఎవ్వరు నిర్వహింతురోకదా అని శివాజీ ఆలో చించుచుండగా "ఉమాత్రే" సూబేదారును, మహాశూరుడును, తన సేనానా యకులలో పేరుగన్నవాడును అగు తానాజీ జ్ఞాపకమునకు వచ్చెను. తక్ష ణమే రమ్మని అతనికి జాబు వ్రాసెను. తానాజీ తన కుమారుడగు "రాయిబా"కు వివాహము నిశ్చయించి పెండ్లి ఏర్పాటు సందడిలో మగ్నుడై యుండెను. ఛత్రపతి పంపిన జాబు చూచి వెంటనే పెండ్లికార్యములన్నియు ఆపి, డాలు, కత్తి తీసికొని, తన పిన తండ్రియగు శేలారుతోను, తమ్ముడగు సూర్యాజితోను, ౧౦౦౦ మంది మావళీలతోను, తనఏలికసేనలో వచ్చిచేరెను. తాను శివాజీ కన్న వృద్ధుడగుటచేతను, చనువు కలవాడగుటచేతను "ఏమయ్యా కొడుకు పెండ్లికూడ చేయనియ్యవు. ఇంత తొందరపని యేమివచ్చి నెత్తిన పడినది" అని మందలించెను. "నాకేమితెలియునోయ్; మన అమ్మగారిని విచారిం చుము"అని శివాజి జవాబు చెప్పెను. జిజాబాయి సమయస్ఫూర్తి గలిగినట్టిది. తానాజి ఆమెకాళ్ళపై తన రుమాలును పెట్టి, "తల్లీ! నీకేమి కావలయునో సెలవిమ్మ. సాధించి తెచ్చియిత్తును" అని పలికెను. జిజాబాయి జ్యోతిని వెలిగించి అతని మొగముపై మూడుమారులు త్రిప్పి "చిరంజీవుడవు కమ్ము" అని కడతలపై మొటికవిరచి "బిడ్డా! నాకు సింహగడ్ కోటను వెంటనే వశపరచియియ్యవా? ఇదే నేను కోరిన చిన్న కోరిక" అని తిన్నగా పలికెను.

శూరాగ్రేసరుడగు తానాజి జంకుకొంకులేక రెండవ ఆలోచన లేవియు చేయక, "అదెంతపని. ఇప్పుడే బయలుదేరుదును. కోటపై రేపటికే మనజెండా ఎగురవేయుదును. జయ సూచకముగా అయిదు తోపులు కాల్పింతును. మీకే మియు సందేహమువలదు" అనిపలికెను. శేలారు, సూర్యాజీలతోను, తన ౧౦౦౦ మంది మావళీలతోను తానాజీమాల్‌సురే సింహగడ్‌కోటకు ప్రయాణ

మయ్యెను. కోట కొకటి రెండుక్రోసుల దూరముననే అడవులలో తనసేనను దాచియుంచి తానాజీ యొక్కడే కోటను సమీపించెను. కోటకు ఒకమైలుదూరములో అడవిజాతివారగు 'కోలీ' లు అతనిని పట్టుకొనిరి. 'ఓయీ నేను సబారా గ్రామము పటేలును. మీరెరుగరా? వేటకైరాగా పెద్దపులి తరుముటచే యిటుపాఱి వచ్చితిని' అని వారికి నచ్చచెప్పి చెలిమిచేసికొని వారికి తమలపాకులు, వక్కలు, నల్లమందు పంచిపెట్టెను. కోలీలు సంతోషపడిరి. అటుపై వారికి ధనము, బంగారు బహుమతిగా నిచ్చెను. వారు పూర్తిగావశవర్తులైరి. అప్పుడు యథార్థమంతయు వారికిచెప్పి తనకు కోట మర్మమంతయు చెప్పిన కోటసాధించిన తర్వాత వారందఱికిని మంచి మంచి ఇనాములు శివాజీ మహారాజుచే నిప్పింతుననెను. కోలీలిట్లు చెప్పిరి :

"కోటను ఉదయభానుడు ౧౮౦౦ రాజపుత్రులతోను, పఠానులతోను, అరబ్బులతోను కాపాడుచున్నాడు. ఉదయభానుడు మహాబలాఢ్యుడు. వాడు తిండిలో బకాసురుడే. పూటపూటకు వానికొక్కనికే ఒక మేకపోతుకావలెను. వానికి ౧౮ మంది భార్యలు, ౧౨ మంది కొడుకులు. వాని సేనాని సిద్దీహిలాల్. వాడు హిడింబునికి అన్ననో తమ్ముడో అయినట్టివాడు. సిద్దీహిలాలునకు ౯ మంది పెండ్లాలు. కోటలో చంద్రావళి అను మనుష్యుల చంపు ఏనుగున్నది. కోట నలు దిక్కుల రాత్రింబగళ్ళు కావలికాయుదురు. ఏ దిక్కు చూచి నను ఎక్కుటకు వీలులేదు. కాని తూర్పుదిక్కుననుండు కల్యాణిద్వారసమీపమందలి డోంగ్రీగుట్టవద్ద ఏమైన మీరు సాహసించిన సాహసించవచ్చును."

తానాజీ నడిరేయి మీరినతర్వాత మెల్లగా తనతావునుండి సేనతో కదలి కల్యాణిద్వారమువద్దచేరి అచ్చట తన తమ్ముడగు సూర్యాజీని సైన్యముతోనుంచి నూరుమంది సాహసికులను మాత్రమే తీసుకొని డోంగ్రేగుట్టదిక్కు నడచెను. శివాజీపెంచినట్టి "యశ్వంత్" అను ఉడుమును తనవెంటతీసుకొని వెళ్ళియుండెను. ఈ యశ్వంత్ ఇదివఱకే ౨౭ కోటల నెగబ్రాకి శివాజీకి గొప్పసేవ చేసియుండెను. తానాజీ యశ్వంతునెత్తిపై కుంకుమబొట్టు పెట్టి టెంకాయలుకొట్టి పూజించెను. తర్వాత దానినోటిపై తేనెపూసి నడుమున త్రాడుకట్టి కోటగోడలపై విడిచెను. ఉడుమునకు తేనెఅనిన అమృతప్రాయము. దానివాసన తగిలిన అది దొఱకు వరకు పర్వతములుగాని, మరోవృక్షములుగాని ఎగబ్రాకు చుండును. యశ్వంతు తేనెవాసనచే నేటుగా, సూటిగా ప్రాకుచు కోటపైకి వెళ్ళెను. తానాజీ మొట్టమొదట తనఖడ్గమును పండ్లతో బిగబట్టి త్రాడుపట్టుకొని పైకెగబ్రాకెను. తర్వాత అతని పినతండ్రియగు

శేలారు ఎక్కెను. తర్వాత ౪౦ మంది వఱకు భటులు ఎక్కిరి. అంతలో యశ్వంతునడుమునకు కట్టినత్రాడు తెగిపోయెను. కోటపైన ౫౦ మందియే యుండిపోయిరి. శేలారు భయగ్రస్తుడై దుముక బోయెను. తానాజీ తన ఖడ్గమును ఝళిపించి, కంఠము నెగురమీటుదునని భయపెట్టి ఆ ౫౦ మందితోనే కోటలో ప్రవేశించెను.

అంతటను నిబిడాంధకారము. కోటలోని సిపాయీలు గాఢ నిద్రలో నుండిరి. తానాజీ వారిని చప్పుడుచేయక దీర్ఘనిద్రలోముంచి, మొదటి ద్వారమువద్దనుండు సిపాయీలను చంపి, కల్యాణి ద్వారము దిక్కునడచెను. ఇంతలో కోటయందు కోలాహలమయ్యెను. సిపాయీల నందఱిని జాగ్రత్తుల చేయుటకై నగారా దబదబ మ్రోయింపబడెను. సింహగడ్ వారు శత్రువు లెట్లువచ్చిరో, యెందఱువచ్చిరో, ఏమూలనో, ఏమైనదో అని భయగ్రస్తులై తమ ఏనుగును మొదట శత్రువులపై విడిచిరి. అది తానాజీ యుండు తావునకు వచ్చి తొండముతో తానాజీ భటులను విసరికొట్టదొడగెను. తానాజీ ఒకటే దెబ్బతో దాని తొండమును నఱకి, దానిపై కెగిరి మస్తకముపై ఖడ్గప్రహారములు చేయుచూ చంపి కూల్చెను. సిద్దీహిలాలునకి సంగతి తెలిసి, తన నలుగురు భార్యలను చంపి ఖడ్గహస్తుడై తానాజీపై బడెను. శత్రువులు కొలది మందియేయని గ్రహించి హిలాలిట్లు పలికెను. "అరే వ్యర్థముగా ఎందుకు చావవచ్చితివి. పూరిగరచి, చెప్పులు నెత్తినబెట్టుకొని క్షమాపణ గోరుకొనుము. లేకున్న నీ పెద్దల నీ కిపుడే చూపింతును." తానాజి ప్రత్యుత్తరము కరవాలముచేతనే యిచ్చెను. సిద్దీతలపై బలముకొలది దెబ్బకొట్టగా తలనుండి కంఠమువఱకు, రెండుపాయలుగా చీలి వాడు క్రిందబడి చచ్చెను.

తానాజి భటులు కొందఱు ఈ కోలాహలముతో కల్యాణిద్వారమువద్దకు పోయి ద్వారపాలకులతో పోరి, వారిని జంపి ద్వారమును తెరచిరి. సూర్యాజీ తన సైన్యముతో భీకరధ్వనులుచేయుచు లోపల పడదుమికెను. సారామత్తుచే తన భార్యలతో లీలావిలాసములందు ప్రొద్దుపుచ్చుచున్న ఉదయభానునికీ దుర్వార్తలన్నియు తెలిసెను. ఆ తత్తరపాటుచే మైకమంతయు క్షణములో దిగిపోయెను. తన కుమారులను యుద్ధయుచేయ సంపెను. వారును చనిపోయిరి. తుదకు తనభార్యల నందఱను తనకత్తికి బలియిచ్చి స్వయముగా యుద్ధరంగములో జొరబడెను.

ఉదయభానుడు భయంకరస్వరూపుడు. నల్లనివాడును, క్రూర కర్కశ కాయుడును నైయుండెను. తానాజీగూడ తక్కువవాడు కాడు. ఇంచుమించు ౩౦ సంవత్సరములవాడు. తానాజీ అజానుబాహుడు. విశాల వక్షస్థలమును, భయంకర శ్మశ్రువులును కలవాడు. పెద్ద తలపాగను ధరించినాడు. సాముచే కండలుతిరిగిన యంగములు కలవాడు. ఖడ్గమును త్రిప్పుటలో మహానిపుణుడు. ఉభయవీరులకును అరగంటకాలము తీవ్రముగా పోరుజరిగెను. అయినను తానాజీ ఆయుః ప్రమాణము పరిపూర్తి అయి యుండెను. ఉదయభానుని ప్రహారములచే తానాజీ నిహతుడై ఏనుగువలె కూలిపడెను. తానాజీ పినతండ్రియగు శేలారు వెంటనే ఉదయభానునిపై పడి, వానిని పొడిచిచంపెను. మొగల్ నాయకులందఱు హతులైరి. కోటలోనివారి కిక దిక్కెవ్వరును లేకపోయిరి. బయట సైన్యము లోపలికి ప్రవేశించి ౧౦౦౦ మందికిపైగా హతమొనర్చెను. మిగిలిన వారు అన్నిదిక్కులు చెదరిపోయి యుండిరి. హతశేషులు శరణువేడి ప్రాణములు దక్కించుకొనిరి.

సూర్యాజీ ఢిల్లీఝుండాను క్రిందికిలాగి, చించి పారవైచి తమ కాషాయధ్వజమును ఎక్కించెను. అయిదు తోపులు కాల్పించెను. ఆ నిశ్శబ్దనిశీథమందు ఆ విజయధ్వానములు రాయగడ్‌లో ప్రతిధ్వనించి విజయఢంకా మ్రోగించెను. సింహగడ్‌కోట శిఖరముపై బండ్లకొలది కట్టెలకాల్చి నెగళ్ళు వేసి, రాయగడ్‌కు నిస్తంత్రివార్త తెలిపిరి. తెల్లవాఱువరకు ఛత్రపతి శివాజీ మహారాజు సింహగడ్‌ని చేరెను. సూర్యాజీ, శేలారు మున్నగువారందఱును అతనిని ఎదుర్కొని జయ జయ ధ్వానములతో ఆహ్వానించిరి. కాని తనకు ప్రాణతుల్యుడైన తన తల్లిచే తనకు సోదరుడుగా నిర్ణయింపబడిన తానాజీ మాత్రము ఎదురుకొనలేదు. ఆ శూరాగ్రేసరుడు తప్పక కోటకు బలియయ్యెనని గ్రహించెను. ఆనందమంతయు విషాదముగా మారెను. ధీరోద్ధతగల నాయకుడుగాన, ప్రశాంతముగా కోటనెక్కుచు పోయెను. కోటయంతయు తానాజీ కొరకై వెదకుచూ, నలుదిక్కుల చూచుచు తిరిగెను. తానాజీ శవమును చూచిన వెంటనే ఆ శవమువద్ద నిలచి, అట్లే అతనిని చూచుచు కన్నీరు కార్చెను. శవమును కౌగిలించుకొనెను. ఎవరోయొకరు "మహారాజా! ఏల దుఃఖించెదరు. ౩౦ మందితోనే ఎవరును సాధించనట్టి ఈ సింహగడకోట మరల

మీ వశమయ్యేనుగదా” అని హెచ్చరించిరి. శివాజీ దుర్భరవిషాదముతో నిట్లు పలికెను:—

''గడ్ ఆలా
పణ్
''సింహగేలా''
''గడివచ్చెను
కాని
సింహము చచ్చెను”

# ౨. సోమనాద్రి

సీ. ప్రతిభ కృష్ణా తుంగభద్రాదిక క్షమా
మండలిం బ్రోచె సామ్రాజ్యమహిమ
కందనూల్ముఖ్య దుర్గములు దేశములెల్ల
దేశముఖ్యైక ప్రతిష్ఠనేలె
గురుభూసురాదుల కురుభూమి రాజ్యాదు
లొసగెను బ్రీతి విధ్యుక్తరీతి
యవన ముఖ్యమహీశ నివహంబుల జయించి
కప్పముల్ గొనియె విక్రమనిరూఢి

గీ. ఆత్మరాజ్యంబు "కేశవా" యత్తముగను
జేసి హరి గృహమార్జన సేచనాది
నిఖిల కైంకర్యములను తానే ఘటించె
ఔర! పెదసోమవిభుడు ప్రహ్లాదనిభుడు.

—కణాదము పెద్దన
(అధ్యాత్మ రామాయణము)

సీ. "అవిజ" "దరూరు"ల కాదిగా దేశాయి
నాడ గౌడ మహోన్నతి దనర్చి
మించి వైరులను భంజించి "కందనవోలు"
"బనగానపల్య" "హోబలము" ప్రకట
మగు 'శిరువళ్ళ' 'నంద్యాల' 'సిద్ధాపుర'
మను పరగణాలెల్ల నాక్రమించి
ధీరుడై లోక దుర్వార తేజమున "యా
దవుని" రాజ్యమున కాధ్యక్షుడగుచు,

గీ. నాడగౌడు దేశాయి నర్నాడగౌడు
తానయై దోర్బలోగ్ర ప్రతాపదావ
వహ్నులను మ్లేచ్ఛకానన వ్రజములేర్చి
సోమనృపమౌళి విలసిల్లె ధామమౌళీ.

—వీరరాఘవాచార్యులు
(భారతోద్యోగ పర్వము)

సోమనాద్రికి పెద్ద సోమభూపాలుడని నామాంతరము కలదు. ఇతనికి పూర్వము గద్వాల నగరము ఏర్పడియుండలేదు. గద్వాలకు ఆమడ దూరమున నున్న రాజవోలులోను, కోరపల్లిలోను గద్వాల పూర్వపురాజులు రాజచిహ్నములతో అధికారము చేయుచుండిరి.

సోమనాద్రి ౨౦౦ సంవత్సరముల క్రిందటివాడు. గద్వాల పంచాంగకర్తలు తమ పంచాంగములలో ఇతర శకములతోపాటు నేటికిని సోమనాద్రి శకమును గుణించుచు వచ్చుచున్నారు. సోమన్న తండ్రిపేరు పెద్దారెడ్డి. సోమన్న తల్లిపేరు బక్కమ్మ. ఆమె ఇప్పుడు గద్వాలకు రెండుపరువుల దూరములోనున్న పూడూరుగ్రామము రెడ్డికూతురు. సోమన్న భార్యపేరు లింగమ్మ.

అతడు పూడూరును తనరాజధానిగా చేసికొని కొంతకాలము పరిపాలించెను. నేటి గద్వాలనగర మాకాలములో అరణ్యప్రాయముగా నుండెను. సోమనాద్రి వేటకై యా ప్రాంతము కృష్ణానదిసమీపమందుంటచే తనరాజధానికి అనుకూలస్థలమని యెంచి ఆ చోటనే కోటకట్టుటకు ప్రారంభించెను. కాని ప్రారంభముననే యొక విషయము అడ్డువచ్చెను. ఆ కాలపు నిజామయిన నాసిరుద్దౌలాకు అప్పుడు గద్వాలకు సమీపమందుండు ఉప్పేడు కోటకు అధిపతియునగు సయ్యద్‌దావూద్‌మియా అనునతడు గద్వాలస్థలము తనదనియు, కోటకట్టరాదనియు ఆక్షేపించెను. కార్యసాధకుడగు సోమన్న కోటకట్టిన పిమ్మట ఉప్పేడుసయ్యదుకు కప్పమిత్తునని ఒప్పించి అచిరకాలములోనే కోటను ముగించి దానిని నగరముగా మార్చి సైన్యము సమకూర్చుకొని కయ్యమునకు సిద్ధమయ్యెను. సయ్యదు అగ్రహోదగ్రుడై సోమనాద్రిపై యుద్ధము ప్రకటించెను. గద్వాలకును, రాయచూరునకును మధ్యప్రదేశమందు "అరగిద్ద" యను స్థలమువద్ద ఉభయసైన్యములు వచ్చి చేరెను. సయ్యదు సహాయార్థము రాయచూరునవాబగు బసర్‌జంగును, అలంపూరు తాలూకాలో చేరిన ప్రాగుటూరుకోట కధిపతియగు ఇదరుసాబును తమతమ సైన్యములతో వచ్చిరి. ఉభయ పక్షముల వారికి సంకులసమరము జరిగెను.

సోమనాద్రి స్వయముగా కొంత సైన్యమును దీసికొని రాయచూరు నవాబుపై బడెను. కొంతకాలము ధైర్యముతో పోరాడిన బసర్‌జంగు సైన్యము ధైర్యముకోలుపోయి వెనుదీయ జొచ్చెను. సిపాయీల సంచలనము చూచి బసర్‌జంగ్ రాయచూరు దిక్కుతిరిగి చండవేగముతో పారిపోయెను. ఇంకొక ప్రక్క ప్రాగుటూరు నవాబు బుద్ధి తెచ్చుకొని యెప్పుడో పలాయన మొన

ర్చెను. ఇక మిగిలినది సయ్యాద్ దావూద్‌మియా మాత్రమే. అతడును తన ఉప్పేడు మార్గమునుపట్టెను. సయ్యాదు గజముపై స్వారీచేయుచుండెను. సోమనాద్రి తన గుఱ్ఱమును దానిపైకి బురికొల్పెను. సయ్యాదు భీతాత్ముడై శరణువేడి, ఇక ముందెన్నటికిని సోమనాద్రి జోలికి రానని ప్రాధేయపడి, ప్రాణముల కాచుకొనెను. కాని తన యుద్ధచిహ్నములగు నగారా, పచ్చజెండాలను, ఏనుగును ఇచ్చుకొనవలసిన వాడయ్యెను.

మరునాడు ప్రాతఃకాలమున సయ్యాదు తనకోటపైకెక్కి గద్వాల దిక్కు చూడగా తన పచ్చజెండా కనబడెను. కడుపులో మసిబోసినట్లయ్యెను. తన పల్లకీని సిద్ధముచేయించి హైద్రాబాదునగరమును చేరికొని నిజాముతో తన దైన్యస్థితియంతయు చెప్పుకొనెను. నిజా మెన్నియో విధముల వారింప జూచెను. కాని సయ్యాదు తాను పట్టినపట్టు వదలకపోయెను. యుద్ధము తప్పదయ్యెను. నిజాము ప్రబల సైన్యముతో బయలుదేఱెను. పూర్వము పరాభూతుడైన రాయచూరు నవాబున్ను, కాలికిబుద్ధిచెప్పి యుండిన ఇదరు సాబున్ను, తమ నూత్న పరాక్రమముల పరీక్షించు కొనదలచిన గుత్తిదుర్గాధిపతియగు టికుసుల్తానున్ను, కర్నూలు నవాబగు దావూదు ఖానున్ను నిజామునహాయార్థము సేనలతోవచ్చి చేరిరి. యుద్ధరంగము కర్నూలునకు పరువు దూరములో తుంగభద్రాతీరముననున్న నిడుదూరను గ్రామము. తుంగభద్రకు దక్షిణతీరమున నుండు నీ నిడుదూరున నిజాముసైన్యము, తుంగభద్ర కుత్తరతీరముననున్న కలుగొట్లయను గ్రామమున సోమనాద్రి సైన్యము విడిసెను. ఈ రెండు గ్రామములందు నేటికిని ఆనాటి యుద్ధచిహ్నములగు తాత్కాలికపు బురుజులును, మిట్టలును కానబడును.

సోమనాద్రిది ఆరడుగుల ఎత్తుగల గంభీర విగ్రహము. అతడు నల్లని కర్కశకాయుడు. సాముచే కండలు తిరిగిన దీర్ఘబాహువులు కలవాడు. ఆప్తులకు గంభీరుడును, శత్రువులకు ప్రళయరుద్రమూర్తియు నైనవాడు. అతని ప్రత్యేక వాహనము ఒక గొప్ప తెల్లని గుఱ్ఱము. దానిపై స్వారీచేయుచు, అతడు యుద్ధముచేయ అజేయుడై యుండెడివాడు. సోమనాద్రియే మొదట తుంగభద్రనుదాటి తెల్లవాఱకముందె నిజాము సైన్యముపై బడెను. శత్రుసైన్యములో చాలమంది సాయంకాలము వఱకు హతమైరి. చీకటిపడినతోడనె సోమన్న తన సైన్యమును మరల్చి, నదిదాటి, కలుగొట్లను చేరుకొని విశ్రమించెను. నిజాము దర్బారు చేసెను. "సోమనాద్రిని వంచుటెట్లు?" అను నదే అందఱను ఆందోళన పరచినప్రశ్న. అందొక సర్దారిట్లనెను- "సోమనాద్రి

శక్తిఅంతయు అతని గుఱ్ఱమందే యున్నది. దాని నపహరించినగాని సోమన్న వశముగాడు.'' ఆ గుఱ్ఱము నపహరించుటెట్లు అని ఆలోచించి నిజాంగారు ఇట్లు తన సైన్యములో ప్రకటన గావించెను. ''ఎవ్వడు సోమనాద్రి గుఱ్ఱమును తెల్లవాఱులోపల తేగలడో వానికొక జాగీరు నిత్తును.'' తెలిసి తెలిసి యముని బారి నెవడు బడగోరును? తుదకొక సైసు సిద్ధమయ్యెను. నడుములో కళ్ళెమును బిగించి, ఒంటిగా బాటబట్టెను. వాడు బయలుదేఱిన కాలము మంచిది. సోమనాద్రి గుఱ్ఱమువద్ద కావలివాండ్రు పగలంతయు అలసిసొలసి గుఱ్ఱు వెట్టి నిద్రించుచుండిరి. చప్పుడుకాకుండ గుఱ్ఱమునకు తన కళ్ళెమును తగిలించి పాగానుండి దానిని తప్పించి, స్వారీయై తన వచ్చినబాట పట్టెను. నిజాంగారికి పట్టరాని ఆనందము కలిగెను. వెంటనే ఆ సైసు కొక బంగారు కడియము ఇనాముగా యిచ్చెను.

భల్లున తెల్లవాఱెను. ఇటు సోమభూపాలుని సైన్యములో రాజుగారి గుఱ్ఱము లేకుండుట వలన సంతాపమతిశయించెను. గుఱ్ఱము లేకుండుట వలన తన దక్షిణహస్తము పడిపోవుటగా సోమభూపాలునికి తోచెను. ఆనాడంతయు ఎటులో యుద్ధముజరిగెను. తుదకు సాయంకాలమగుట ఉభయసైన్యములు యుద్ధము చాలించెను. సోమనాద్రి యారాత్రి తనవారితో సమాలోచన చేసి యిట్లు ప్రకటించెను. ''నా గుఱ్ఱమును రేపు తెల్లవాఱువర కెవ్వడు తేగలడో వానికి నా గుఱ్ఱము ఒక దినమంతయు నెంత భూమి తిరుగునో, అంత భూమి శాశ్వతముగా ఇనాముగా ఇవ్వగలను.''

గద్వాలకు పదిమైళ్ళ దూరములో 'బొచ్చెంగన్నపల్లె' అను గ్రామము కలదు. ఆ గ్రామమునుండి యొక బోయసర్దారు 'హనుమప్ప నాయుడు' అను వాడు యుద్ధమునకు వచ్చియుండెను. అతడు వెనుకముందు లాలోచింపక ముందునకు వచ్చి సంసిద్ధుఁడయ్యెను. జొన్నచొప్పను ఒక మోపుగాగట్టి, నెత్తిన పెట్టుకొని, నిజాము డేరాలను సమీపించెను. ఒక సిపాయి అతనిని చూచి ''అరేయ్ ఆ మోపు యెంతకిస్తావు''అని విచారించెను. ''సిపాయిసాబ్, దండు ఇక్కడ విడిసినప్పటినుండి మేతకరువైంది. చుట్టు ఆమడదూరం ఎక్కడా ఒక దంటుపుల్ల దొరకదు. ఈ మోపుకు అయిదు రూపాయలు యిస్తేనేకాని యియ్యను''అని హనుమప్పనాయుడు ప్రత్యుత్తర మిచ్చెను. ''అరే, దీవానా అందరూ అర్ధరూపాయికిస్తే నీవు అయిదు రూపాయలు సెప్తావ్ జావ్'' అని వికటంగా నవ్వుతూ సిపాయి వెళ్ళిపోయెను. వచ్చిన సిపాయీ

లందఱితోను ఇదే సంభాషణ. హనుమప్పకు గుఱ్ఱములపైననే కన్ను. పోగా పోగా నొక ప్రత్యేక స్థలములో సోమనాద్రి గుఱ్ఱమును చూచెను.

"గుఱ్ఱముకూడ హనుమప్పనాయునిచూచి గుర్తించి సకిలించెను. గుఱ్ఱమువద్ద జవానులు హనుమప్పను ఎగాదిగ జూచిరి. దానికండ్లలోని కాంతిని, నిక్కించిన చెవులను, భూమినితట్టుచుండిన ముంగాళ్ళను,తత్తరపాటు గల చూపును, శిరఃకంపమునుచూచి, ఇట్లు మాట్లాడుకొనుచుండిరి. "అరే భాయ్! ఇదీ ఘోడా రేగటిసీమలో దంటుపుల్లలుతిన్నట్టిది. అందుకోసమే చొప్పనుచూచి,యిగిలిస్తుంది." "ఠీక్ ఠీక్"అని యందఱును ఈయభిప్రాయమును ఏకగ్రీవముగా నామోదించిరి. చొప్పబేరము జరిగెను. హనుమప్ప ఒక్క రూపాయ అనెను. చొప్పమోపుదించెను. సిపాయీ లొకనితో క్రయమిప్పించుమనిచెప్పి వెడలిపోయిరి. కొంతసేపటకి వాడు హనుమప్పకు ఖరీదిచ్చి వెడలిపోయెను. మఱికొంతవడి కొకడువచ్చి, నీవెవరవు అని విచారించగా "అయ్యా! బీదవాణ్ణి, వచ్చి గంటసేపాయె. ఎవరో ఒక సాయేబయ్యా చొప్ప ఖరీదు తెస్తానని అట్లేపోయినాడు. మీరన్నా యిప్పించండి" అని దీనముగా పలికెను. వాడు పలకకుండ తనదారిపట్టెను. ఇంతలో అటునిటుచూచి చుట్టును ఎవ్వరును లేనిది గ్రహించి గుఱ్ఱముపాగాలో మూలనున్న గడ్డికుప్ప తనపైవైచికొని, అందు వెల్లకిల చేతులుచాచి పరుండెను. నెమ్మదిగా మేయుచుండిన గుఱ్ఱము నాయునిగానక తన్నుకొనుచు, కాళ్ళనుకట్టిన గూటమునూడబెరికెను. వెంటనే యొక సిపాయివచ్చి గూటమును గడ్డిపైమోపి భూమిలో పాతదొడగెను. ఆ గడ్డిక్రింద హనుమప్ప తనచేతులుచాచి పరుండి యుండెను. గూట మాతని యరచేతిపై మోపబడెను.

మీద మీద దెబ్బవేయుచుండగా అరచేతిని చీల్చుకొని, ఆ గూటము భూమిలో గట్టిగా పాతుకొనెను. హనుమప్ప కదలక మెదలకయుండెను. ఎంత నొప్పిగలిగినను, ప్రాణములు పైననే లేచిపోవునట్లుండినను, తన స్వామి కార్యమును తలచుకొని నిగ్రహించి యుండెను. నడిరేయి యయ్యెను. సిపాయిలందఱు నిద్రించియుండిరి. డేరాలన్నియు మాటుమణిగి యుండెను. తిన్నగా తనపైగడ్డిని బ్రక్కకుద్రోసి, హనుమప్ప లేచికూర్చునెను. కుడిచేయి కదలించుటకు వీలులేకపోయెను. గూటముగూడ కదలకపోయెను. ఎడమచేత తన నడుములోని ఛురికను లాగి, ఒక్కవ్రేటున కుడిచేయి నఱకుకొనెను. మూర్ఛితుడయ్యెను. మరల సేదదేరి రక్తప్రవాహముతో నుండు మొండిచేతిని, తలపాగాలో చుట్టి గుఱ్ఱమును తీసికొని స్వారియై డేరాలు

డాఁటెను. అక్కడక్కడ నిద్రించు సిపాయిలు తలలెత్తి చూచిరి. నిజాము సైన్యములో విరామములేక గుఱ్ఱములను ఏటికి నీరుద్రాపుటకై తీసికొనిపోయి వచ్చుట పరిపాటియగుటచే ఏసైసో గుఱ్ఱమును తీసికొనిపోవుచున్నాడని భ్రమించి, మరల నిద్రించిరి. అరగంటలో హనుమప్ప సోమనాద్రి యెదుట గుఱ్ఱముతో సహ హాజరయ్యెను. రాజుగారిని నిద్రనుండిలేపి, యెడమచేత సలాముచేసి నిలబడెను. రాజు కోపముతో కన్నెఱ్ఱజేసెను. హనుమప్ప తన మొండిచేతిని చూపించెను. రాజుగారు కారణమడుగగా జరిగినదంతయు చెప్పెను. రాజాశ్చర్యచకితుడయ్యెను. నాయుని కౌగిలించి సన్మానించెను. అపుడే యొక దానశాసనము వ్రాసియిచ్చెను. యుద్ధానంతరము తన వాగ్దత్త ప్రకారము గుఱ్ఱము ఒకదినము తిరిగినంత భూమి హనుమప్ప నాయునికి ఇనాముగా ఇచ్చెను. నేటికిని బొచ్చెంగన్న పల్లెలో హనుమప్ప సంతతివారు ఆ భూముల ననుభవించుచున్నారు. తమ శాభూములు చాలినవే కాక అందులో మరల తాము న్నిఇతరుల కినాముగా కొంత భాగమిచ్చియున్నారు.

సోమభూపాలుని యుత్సాహ ముప్పొంగెను ప్రాతఃకాలమున అతని దండు అంతయు వికాసముతో నుండెను. అట నిజాముసైన్యము సమీపించు కొలది అతని జయభేరియొక్క భయంకర ధ్వానములు స్ఫుటమగుకొలది, ప్రతిపక్ష సైన్యములోని ప్రతివాని యెదలో దడదడహెచ్చయ్యెను. సోమనాద్రి సైన్యము దావానలమువలె నిజాంసైన్యమును చుట్టుకొనెను. యుద్ధము భయంకర రూపము దాల్చెను. ఆ నాటి యుద్ధములో ప్రాగుటూరు, బళ్ళారి, ఆదోని నవాబులు సోలికల కాహుతులైరి. సాయంకాలము సమీపించువఱకు కర్నూలు కోటవఱకు నిజాము సైన్యములు తరుమబడెను. సోమనాద్రియు కొలదిమంది భటులతోనే ఆ సైన్యమును వెన్నంటి లోపల ప్రవేశించెను. అంతలో కోటతలుపులు బంధింపబడెను. సోమనాద్రి లోపల; అతని సైన్యము వెలుపల. గద్వాల సర్దారులకు భయము కలిగెను. కోటను పగులజీల్చ బహుప్రయత్నములు చేసిరి. అంతయు నిష్ఫలమయ్యెను. తెల్లవాఱెను. కోట లోపలి వార్త లేమియు తెలియక పోయెను.

గద్వాల సర్దారులు తమ యేలిక చచ్చెనేమోయని నిశ్చయించి గద్వాలలో లింగమ్మరాణికి తాము తిరిగి వత్తుమని వార్త పంపిరి. ఆ వీరనారి వారికి ప్రత్యుత్తరముగా కొన్నిగాజులు, చీరెలు, పసుపు కుంకుమ పంపెను. గద్వాల సర్దారులకు క్రోధము, సిగ్గును కలిగెను. ద్విగుణీకృతయత్నముతో కోటపైబడి ద్వారములు పగులజీల్చిరి. సోమనాద్రియు, కోటలోపల తన

కొలదిమంది యనుచరులతోనే రాత్రియంతయు మరుదివస మంతయు ఘోరముగా పోరాడుచు, అనేక శత్రువులను నఱకుచు, ప్రాణములపై ఆశవదలుకొని యుద్ధము చేయుచుండెను. తన యనుచరులలో చాలమంది హతమైరి. తానును గాయము లొందియుండెను. తుదకు కోటతలుపులు పగుల గొట్టబడగా బయటపడి తన సైన్యముతో తన గుడారములు చేరుకొనెను.

నిజాంసైన్యములో అలజడి హెచ్చిపోయెను. పిడికెడు మంది తోడనే సోమనాద్రి కోటలో అల్లకల్లోలము నొనర్చి తప్పించుకొని పోయెను. రేపు తెల్ల వార ఇంకేమి చేయనున్నాడో? చావగా మిగిలిన గుత్తి, రాయచూరు నవా బులు యుద్ధ విముఖులైరి. సోమనాద్రితో సంధి గావించుకొనుడని నిజాము గారికి మంత్రాలోచన చెప్పిరి. యుద్ధమునకు కారణభూతుడైన ఉప్పేడు సయ్యదు ఏమియుతోచనివాడై తూష్ణీంభావము వహించియుండెను. నిజాం గారు మరునాడుదయముననే యొక రాయబారినంపి సంధికోరెను. సోమ నాద్రియు అంగీకరించెను.

యుద్ధపరిణామముగా కర్నూలులోని కొండారెడ్డి బురుజుననుండు 'యెల్లమ్మ ఫిరంగీ'యను చాల గొప్పఫిరంగీని, గోనబుద్ధారెడ్డిచే చేయింపబడి నవని ప్రతీతి గలిగి రాయచూరు నవాబు వశమందుండిన 'రామ' 'లక్ష్మణ' అను పేరుగల రెండు ఫిరంగీలు సోమనాద్రి తీసికొనెను. కర్నూలులో కొంత భాగము సోమనాద్రి కియ్యబడెను. ఈప్రకారము సంధి గావించుకొని సోమ భూపాలుడు విజయోత్సాహముతో తన రాజధానికి మరలెను.

---

## అనుబంధము

## లఘుటీక

# ౧. శ్రీమదాంధ్ర మహాభారతము

## భీష్ముని చరిత్రము

అవతారిక : కురువంశదీపకుఁడగు శంతనమహారాజు వేటాడు నెపమున గంగాతీరమునందలి యరణ్యమునకుఁ బోయెను. ఆ గంగానది యిసుకతిన్నెపై నాతని కపూర్వసౌందర్యాభిరామయగు నొక కన్యాలలామ గన్పట్టెను. ఆ భూపాలుఁ డాకన్యామణి ననురాగదృష్టులఁ జూచుచుండ నాతండు తనయందు దృఢానురాగుఁడగుట యెఱింగి యామె యిట్లనెను. "ఓ రాజా! నన్ను భార్యఁగాఁ బరిగ్రహింప నీకిష్టమేని నేకోరిన యట్లు వర్తింతునని బాసచేయుము. అది యెట్లందువా నేనేది చేసినను దాని కంగీకరించి నన్ను వారింపకుండవలెను. నన్ను నీవెన్నండును నప్రియంబులు వలుక కూడదు. నీవెప్పు డప్రియంబులు వలుకుదువో యానాఁడే నిన్నుఁబాసిపోదును." శంతనుఁడు వాని నెల్ల నంగీకరించి బాసచేసి యామెను బరిగ్రహించెను. కాలక్రమమున వారికి సంతానము గలిగెను. కాని సంతానము గలిగిన వెంటనే యాశిశువును తల్లి కరుణమాలి గంగాజలములలో బాఱవైచుచుండెను. ఇట్లు వారికేడుగురు పుత్త్రులుదయించిరి. అందఱ నట్లే వారితల్లి యేటిపాలుచేసెను. పుత్త్రులవధ చూడలేక శంతనుఁడు బాధపడుచుండెను. వలదని వారించిన, దన్ను విడచి పోవునన్న భయమున నాతఁడు భార్య నేమనలేకుండెను. వాని కెనిమిదవ సంతానముగలిగెను. ఆ బిడ్డఁడు బాలసూర్యునివలె తేజోవంతుఁడై ముద్దులొలుకుచుండెను. తల్లి యాతనిఁగూడ గంగాజలంబులం బడవేయ సమకట్టెను. అది చూడనోపక పుత్త్రమోహంబున శంతనుఁడు పుత్త్రఘాతినివని భార్యను బలువిధముల నిందించి వారించెను. అంతనామె నీవుచేసిన ప్రతిన తప్పితివి కావున నిఁక నీతోడి సంగతి లేదనిచెప్పి తాను త్రిభువనపావనియగు గంగాభవాని ననియు, పుట్టినవారు వసువులనియు వివరించుచున్నది.

౧. వసూత్పత్తి = వసువుల పుట్టుక; వసువులు దేవతలలో ఒకతెగవారు. అష్టవసువులు; ౧ ఆపుఁడు ౨ ధ్రువుఁడు ౩ సోముఁడు ౪ అధ్వరుఁడు ౫ అనిలుఁడు ౬ ప్రత్యూషుఁడు ౭ అనలుఁడు ౮ ప్రభాసుఁడు. వసువులగాథ: ఈ యష్టవసువులు సభార్యులై యొకనాఁడు వనముల విహరించుచు వసిష్ఠమహర్షి యాశ్రమమునకుఁ జనిరి. ఆ మునికి నందిని యను హోమధేనువుండెను. అది కోరిన వస్తువుల నెల్లఁ గురియుచుండును. వసువులలో నెనిమిదవవాఁడైన ప్రభాసుఁడు తన భార్య గోరగా ఆ

మునిధేనువును బట్టికొనిపోయెను. తక్కినవసువులు తగవుకాదని తమ్ముని వారింపక పోవుటయేగాక వానిం బ్రోత్సహించిరి. వసిష్ఠ మహర్షి వారి యనుచితకార్యము నకుఁ గోపించి మనుజులుగాఁ బుట్టుఁడని శపించెను. అది తెలిసి మర్త్యలోకంబునఁ బెద్దకాలముండనేరము కరుణింపుమని వసువులు ప్రార్థింప వారిలో నేడుగురు మర్త్యలోకమునఁ బుట్టఁగనే యసువులు వాసి స్వర్గమును జేరునట్లును, ఎక్కువ తప్పిదముచేసిన ప్రభాసుఁడు మాత్రము పెద్దకాలము భూలోకముననేయుండి కీర్తిగాంచుననియు ముని యనుగ్రహించెను. ఆ వసువుల ప్రార్థనముననే గంగా నది మానవస్త్రీరూపముఁ దాల్చి శంతనునకు భార్యయై వసువులం బుత్త్రులనుగాఁ గని, కనినప్పుడు వారిఁ గడతేర్చి, యాయెడ్డుపను స్వర్గతిఁ గూర్చెను. ఎనిమిదవ వసువైన ప్రభాసుఁడే భీష్ముఁడుగా నుదయించెను.

వగచుచు = తలంచుచు; (నా) శోకించు, పశ్చాత్తాపపడు, ఆలోచించు; హస్తి పురము = హస్తియను రాజర్షిచే నిర్మింపఁబడిన నగరము. (పా) హస్తినపురము.

౨ దిగ్వనితా...లీల = దిక్కులను స్త్రీలకు ముత్యాలహారమువలె; రాజద్రాజ... స్థితిన్ = ప్రకాశించుచున్న రాజహర్మమునం దునికిచేత.

౩ మృగయావ్యాజంబున = వేఁటనెపముచేత; పాసి = విడిచి; అనుత్వంబున్ = చిక్కిపోవుటను.

౪ అమ్మహీపతి = ఆరాజు, ఆ + మహీపతి (వ్యా) ఆ, ఈ, ఏ అనువాని మీద యసం యుక్తహల్లునకు ద్విత్వము బహుళంబుగా నగును. గాంగ సైకత భూములన్ = గంగానదియందలి యిసుకదిబ్బలమీఁద; సైకతము (వ్యు) సికత యనఁగా నిసుక, సికతామయమైనది సైకతము.

పనుగొనన్ = అలవడునట్లు (పన్ను + కొను = గట్టిపడు)
అత్యనఘున్ = మిక్కిలి నిర్దోషుని, (వ్యా) అతి + అనఘు, యణాదేశము; ఆపగే యున్ = భీష్ముని (వ్యు) ఆపగ = నది, దాని యపత్యము ఆపగేయుఁడు. సేతు లన్ = ఆనకట్టలచేతన్.

౫ విస్మయా...చిత్తుఁడై = ఆశ్చర్యముచేత కలఁతనొందింపఁబడిన మనస్సుకలవాఁడై; నిసర్గ...మోహితుఁడు = స్వాభావికమైన ప్రీతిచే మోహము నొందినవాఁడు.

౬ వలపలిచేయి = కుడిచేతిని; ఊఁది = పట్టి; సూనుఁడు = కుమారుఁడు; (నా) తమ్ముఁడు, సూర్యుఁడు.

౭ సాంగంబులు = అంగములతోఁ గూడినవి. వేదాంగములు ఆఱు : ౧. శిక్ష ౨. వ్యాకరణము ౩. ఛందస్సు ౪. నిరుక్తము ౫. జ్యోతిషము ౬. కల్పము.

వసిష్ఠులో = వసిష్ఠునొద్ద, (వ్యా) ఉపయోగంబున నా ఖ్యాతకుc దోడవర్ణకమగును. (రూ) వసిష్ఠుcడు.

సనత్కుమారుcడు = సనకసనందనాదులగు నలుగురు బ్రహ్మమానస పుత్త్రులలో నొకcడు. గొప్ప బ్రహ్మజ్ఞాని.

నెమ్మినన్ = ప్రీతితో.

దానివచ్చిన వలను = ఆ వాసనవచ్చిన దిక్కును.

కనకా...తనులతన్ = బంగారమువలెc బసపుకాంతిగలదియు మృదువైనదియు నగు తీcగవంటి దేహముకలదానిని.

యోజనగంధిన్ = సత్యవతిని (వ్యు) యోజనముదూరము ప్రసరించు శరీర పరిమళముగలది.

విలోలవిలోకనంబులు = చలించుచున్న కనులు; శుచి...కాంతియున్ = తెల్లని చిఱునవ్వుగల మోముయొక్క కాంతియును.

ఏకతమ = ఒంటరిగానే, (ఏకతము + అ) (వ్యా) అ అనునది అవధారణార్థకమయిన యవ్యయము.

ఓడసల్పుచున్ = ఓడనడపుచు, (ధాతురూపము) చలుపు (నానా) చేయు, నడపు.
సంక్రందనసన్నిభున్ = ఇంద్రునికి సాటివచ్చువానిని.

దాశరాజు కూcతురన్ = జాలరులకు దొరయైనవాని బిడ్డను.

లోకవర్తనంబు = లోకాచారము; తద్దనెమ్మినన్ = మిక్కిలి ప్రీతితో

డెందంబునన్ = మనస్సులో

మధ్యాక్కర : తెనుcగు ఛందస్సులో అయిదువిధములైన యక్కరలు గలవు. ౧ మహాక్కర, ౨ మధ్యాక్కర, ౩ మధురాక్కర, ౪ అంతరాక్కర, ౫ అల్పాక్కర. వీని గణములు, యతిస్థానము భిన్నములైయుండును. ప్రాసమన్నింటను గలదు.

మధ్యాక్కర లక్షణము: రెండింద్రగణములు, ఒక సూర్యగణము, మరల రెండింద్రగణములు, ఒక సూర్యగణము ననునట్లుగా ఆఱుగణములతో నొకపాదము. ఇట్టివి నాలుగుపాదములుండును. ప్రాసగలదు. యతి మూcడవగణము

పైనఁ జెల్లును. భారతములో నన్నయగారు మాత్రము నాలుగవ గణము మీఁదనే యతి నిల్పుదురు. ఇంతయె భేదము.

ఈఁగన్ = ఇచ్చుటకు

౧౭ ప్రతిహతమనోరథుఁడయి = వమ్మైన కోరికగలవాఁడై; నివృత్తకార్యాంతరుం డయి = ఉడిగిన యితరకార్యములు గలవాఁడై.

౧౮ భవదభిరక్షితక్షితికి = నీచేఁగాపాడఁబడిన భూమికి; శాత్రవనివహంబు = శత్రువుల సమూహము.

మానవవృషభేంద్ర = రాజశ్రేష్ఠుఁడా! (వ్యా) సింహకుంజరపుంగవాది శబ్దములుత్తరపదములైనపుడు శ్రేష్ఠవాచకములు.

౧౯ మనఃపరితాపమున్ = మనోదుఃఖమును, (వ్యా) మనస్ + పరితాపము. సకారమునకు విసర్గము.

౨౦ ఏకపుత్త్రుఁడు = ఒక కొడుకుగలవాఁడు (బహువ్రీహి); అనపత్యుఁడు = సంతులేనివాఁడు; ఒక్కరూప = ఒక్కవిధమే. ధర్మువు (రూ) ధర్మము.

౨౧ అగ్నిహోత్రంబును...నెడతెగఁగాఁజనదు = హోమాగ్నిని, సంతానమును, వేదాధ్యయనమును భంగము నొందింపరాదు. ఈ సందర్భమున 'ఉదిత్ జుహోతి, అనుదిత్ జుహోతి; స్వాధ్యాయ ప్రవచనాభ్యాం నప్రమదితవ్యమ్ ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః' మున్నగు వేదవాక్యముల ననుసంధించునది.

౨౨ అస్త్రశస్త్ర విద్యాకోవిదుఁడవు = సర్వాయుధ విద్యయందు పండితుఁడవు. 'ఆయుధంతు ప్రహరణం శస్త్రమస్త్రమ్' అను కోశప్రామాణ్యమున శస్త్రాస్త్రములు సమానార్థకములే యైనను ఇందువేఱుగాఁ బ్రయోగింపఁబడినవి. కావున అస్త్రము మంత్రసహితమైన ఆగ్నేయాస్త్రము, పర్జన్యాస్త్రము, బ్రహ్మాస్త్రము మున్నగునవి యనియు, శస్త్రము, ఖడ్గము, తోమరము మొదలైనవి యనియు గ్రహింపనగునని కొందఱందురు.

అరి విద్రావణ సాహసికుఁడవు = శత్రువులను బోఁదోలుటయందు సాహసము గలవాఁడవు.

౨౩ వృద్ధా...సుహృజ్జనంబులతో = వృద్ధులగుమంత్రులతోను, పురోహితులతోను, మిత్రులతోను; సుహృత్ + జనము (సుహృజ్జనము) శ్చుత్వసంధి.

'ఎవ్వనియేని...ఉపరిచరుండను రాజర్షి: —

గాథావివరణము: ఉపరిచరుఁడను రాజర్షి వీర్యబిందుద్వయమును యమునా నదిలోనున్న యొక మత్స్యము మ్రింగెను. ఆ మత్స్యము శాపగ్రస్తయైన యద్రిక యను నప్సరస. కొన్నినాళ్లకా మత్స్యము ఒక పుత్త్రుని, ఒక పుత్త్రికను గనెను. జాలరులు ఆ శిశువులను జేని కిచ్చిరి. రాజు కుమారునిఁ దనకడ నుంచుకొని కుమార్తెను తనకుఁగూర్చు మిత్త్రమైన దాశరాజునకు సాఁకుకొన నిచ్చెను. ఆ పుత్త్రుఁడే మత్స్యరాజుగాఁ బ్రసిద్ధిచెంది మత్స్యదేశమేలెను. ఆపుత్త్రికయు మత్స్యగంధి యనఁబరగి దాశరాజుకడఁ బెరుగుచుండెను. పిమ్మట పరాశర మహర్షి యనుగ్రహమున ఆమె మేని చేపలకంపుపోయి యోజనదూరము వ్యాపించు దివ్యగంధమబ్బెను. తన కూఁతును దాశరాజున కిచ్చుచు ఉపరిచరవసువామెను శంతనున కిమ్మని కట్టడచేసెను. కావుననే యామెను వివాహమాడవచ్చి యడిగిన దేవలుఁడు, తిరస్కరింపఁబడెను. ప్రత్యాఖ్యాతుఁడు = తిరస్కరింపఁబడినవాఁడు.

౨౪ సాపత్న్యము = శత్రుత్వము (లేక) సవతికొడుకున్నాఁడను దోషము; పురహ రాజకేశవులైనన్ = శివుఁడు, బ్రహ్మ, విష్ణువులైనను (ద్వంద్వము)

౨౫ పరిహృతంబు = పోఁగొట్టఁబడినది; ఘటియింపుము = కూర్పుము.

౨౬ గురుప్రయోజనమునన్ = తండ్రికార్యార్థము. గురువు (నానా) బృహస్పతి; శ్రేష్ఠమైనది; బరువైనది.

౨౭ రోమహర్షంబుగా = గగుర్పాటుకలుగునట్లుగా.

౨౮ దొరకొనియెన్ = లభించెను. (దొరకు + కొను) దొరకొను(నానా) సంభవించు, సిద్ధించు.

ఇట్టిరు = ఇట్టివారు. (వ్యా) ఇట్టిడు, ఎట్టిడు, ఎట్టిరు మున్నైనవిట్టే.వాఁడు, వారు శబ్దములలోని 'వా' లోపించుటవలన గల్గును.

౨౯ ధృతిన్ = ధైర్యమును, ధృతి (నానా) ధారణము, అధ్వరము, సంతోషము; అనపత్యత = సంతానములేమి; ఆయతిన్ = ఉత్తరకాలమునందు.

30 భీష్ముఁడు = భయంకరుఁడు. భయంకరమైన వ్రతమును పూనినవాఁడు.

3౧ ఇనతేజుఁడు = సూర్యునితేజస్సువంటి తేజముగలవాఁడు; శాంతనవుండు = భీష్ముఁడు (వ్యు) శంతను పుత్త్రుఁడు; తత్కౌతుకారంభుఁడై = ఆమె వివాహోత్సవము నారంభించువాఁడై, కౌతుకము (నానా) అనుభవింప నాస, కోరిక, పెండ్లిలోఁ జేతికిఁగట్టుకొనుతోరము, పండుగ, స్త్రీపురుష పరిహాసము, వేడ్కలు, సంతోషము.

౩౨ స్వచ్ఛందమరణము = ఇచ్ఛవచ్చినప్పుడు చచ్చుట.

౩౩ అనిన్ = యుద్ధమున.

౩౪ విచిత్రపత్త్రికార్ముకహస్తున్ = వింతలైనబాణములును, ధనుస్సును చేతులందుఁ గలవానిని.

౩౬ పైతృకము = తండ్రినుండివచ్చినది (పితృసంబంధమైనది). ఎసఁగఁగ = అతిశయిల్లగా; ఇద్ధయశుఁడు = ప్రకాశించుచున్న కీర్తిగలవాఁడు.

౩౭ వారణాసీపురము = కాశీనగరము (వ్యు) వరణ అసి అను నదులు సీమలుగాఁగలది.

౩౮ ఆయతభుజశక్తిన్ = అధికమైన చేతిచేవతో; ఆజిమొనన్ = యుద్ధరంగమున

౩౯ బ్రాహ్మము మొదలగు నెనిమిది వివాహములు :

౧. బ్రాహ్మము = కన్యావరులను వస్త్రాలంకారముచే నలంకరించి వరుని బిలచి కన్యనిచ్చుట బ్రాహ్మవివాహము.

౨. దైవము = యజ్ఞమునందు ఋత్విజునకు అలంకరించి కన్యనిచ్చుట దైవ వివాహము.

౩. ఆర్షము = వరునివలన గోమిథునము నొకటిగాని రెండుగాని పుచ్చుకొని కన్య నిచ్చిచేయు పెండ్లి.

౪. ప్రాజాపత్యము = మీరిరువురునుగలసి ధర్మము నాచరింపుఁడని పలికి పూజించి కన్యాదానము చేయుట.

౫. రాక్షసము = బంధువులనుండి బలాత్కారమునఁ గన్యనపహరించుకొని పోయి కన్నె యిష్టముతో చేసికొనుపెండ్లి.

౬. ఆసురము = కన్యాబంధువులకును, గన్యకకును ధనమిచ్చి వివాహమాడుట.

౭. గాంధర్వము = కన్యా వరులిద్దఱును ఒండొరుల సమ్మతిచేత (బంధువులసమ్మతితో నిమిత్తము లేకుండగనే) వివాహము చేసికొనుట.

౮. పైశాచము = దొంగతనముగాఁ గన్యకిష్టములేకుండినను ఎత్తుకొనిపోయి చేసికొను పెండ్లి.

౪౦ నరనాగాశ్వవరూథ యూథములతో = కాల్బలము, ఏనుఁగులు, గుఱ్ఱములు, రథములు ననువాని సమూహములతో, వరూథము = రథమును గప్పెడి తోలు, అది గలదికూడ వరూథమే (వ్యు) మత్వర్థీయా ప్రత్యయాంతము.

౪౧ కసిమసంగి = చెలరేఁగి, కసిమసఁగు (నానా) ఖండించు, చంపు.

౪౨ నెఱిన్ = వరాక్రమముచేత; నెఱఁకులు = మర్మస్థానములు, దీని ఏకవచనము; నెఱను - నెఱఁకు; తూఱఁగన్ = చొచ్చునట్లు; అంపఱ = బాణముల గుంపు (వ్యా) (అమ్ము + పఱ); విషయము = దేశము.

౪౪ మదీయ...గహనంబున = నా వింటినుండి విడువఁబడిన పలువిధములైన యమ్ము లనెడి భయంకరమగు నడవిలో (రూపకము)

౪౫ సంవర్తసమయ సమవర్తియుంబోలె = ప్రళయకాలమందలి యమధర్మరాజువలె.

౪౬ అనిలజవంబునన్ = వాయువేగముతో; పరికొాఁడు = మేటియేనుఁగు; చూపఱు = చూచువారు; నల్గడన్ = నాలుగుదిక్కులయందు. వ్యా॥ సంఖ్యా పూర్వము గావున ద్విగుసమాసము, ఏకవచనాంతము. (ఉపమాలంకారము)

౪౭ శతాయుత సంఖ్యయున్ = పదిలక్షలును (శత + అయుత + సంఖ్యయున్)

౫౦ రథ్యంబులు = గుఱ్ఱములు (వ్యు) రథమునకుఁ బూన్పఁదగినవి. భాగీరథి కొడుకు చేత = భీష్మునిచేత (ఛేకానుప్రాసము)

౫౧ మందలన్ = ప్రాణముతో (మనుదల)

౫౨ పరఁగన్ = ఒప్పునట్లు; పూర్వదత్తన్ = ముందియ్యఁబడిన దానను; ఈరు = మీరు (వ్యా) యుష్మదస్మచ్ఛబ్దముల తొలిహల్లునకు వైకల్పికలోపము, ఈవు-నీవు మొ॥

౫౪ లాలిత...విభాసితులు = ఉత్తమములయిన సొంపు, జవ్వనము, శృంగార చేష్ట లచేఁ బ్రకాశించువారు. నిజరాజ్యభార చింతాలసుఁడయ్యెన్ = తన రాజ్య భారముయొక్క విచారమున సోమరియయ్యెను. నయంబున = నీతితో (అర్థాం తరన్యాసము).

౫౬ కృతకాద్రి...వేదికలను = కృత్రిమ పర్వతగుహలయందును, కేళీభవనముల ముంగిళ్లయందును, పలువిధములయిన రత్నములు దాపినందున మెఱయు తిన్నెల మీఁదను; కలహంస...తీరములను = రాయంచల మనోజ్ఞధ్వనులచే నిండైన తామర కొలంకులయందును, దిగుడు బావులయందును, ఇసుకతిన్నెల మీఁదను.

౫౯ సర్వజగత్పరివర్తన క్రమంబును = ఎల్లలోకముల నడవడియొక్క విధమును; ఒకఁడు = ఒకటి, ఒకపని; పంచెదన్ = ఆజ్ఞాపించెదను.

౬౦ ఎక్కటి = ఒక్కఁడవే; ఒగిన్ = క్రమముగా.

౬౧ ఉరుభుజ = గొప్పబాహువులు గలవాఁడా. ఇది సాభిప్రాయము.

ప.౨ ఆనతియీయాయన్ = ఆజ్ఞనొసఁగ (వ్యా) ఆనతి + ఇచ్చు = ఆనతిచ్చు, (ఆనతియిచ్చు) వికల్పముగా ఇత్వసంధి; చెలుతనె = అల్లుఁడనా.

ప.౩ హిమకరుఁడు = చంద్రుఁడు; అర్యముఁడు = సూర్యుఁడు; హుతాశనుఁడు = అగ్ని.

ప.౪ వంచభూతములు— ౧ పృథివి ౨ జలము ౩ తేజస్సు ౪ వాయువు ౫ ఆకాశము గుణములు :

క్రమముగా వీనికి గంధము, రసము, రూపము, స్పర్శము, శబ్దము ననునవి గుణములు.

---

# ౨. దశకుమార చరిత్రము

## మంత్రగుప్త వృత్తాంతము

అవతారిక:—పుష్పపురమును రాజధానిగాఁ జేసికొని రాజహంసుఁడను మహారాజు మగధదేశము నేలుచుండెను. ఆ రేనికి రాజవాహనుఁడను కుమారుఁడుండెను. ఆతనికి ప్రమతి, మిత్రగుప్తుఁడు, మంత్రగుప్తుఁడు, విశ్రుతుఁడునను సచివకుమారులు వయస్యులై యుండిరి. ఆ సమయముననే అపహారవర్మ, ఉపహారవర్మ, రత్నోద్భవుఁడు, సోమదత్తుఁడను పేళ్ళం బరగు మఱియైదుగురు బాలు రాపన్నులై నవారా రాజశేఖరుని సన్నిధికిఁ దేఁబడిరి. సమాన వయశ్శీలురగు నీపదిమందికుమారులు క్రమముగా చదువులలోను, సాములలోను నారితేరినవారైరి. ఆరూఢయౌవనులగు నా పదిమంది సతీర్థ్యులును, దిగ్విజయార్థము బయలుదేఱిరి. కొంతదవ్వేగునంత వారిలో నాయకమణియగు రాజవాహనుఁడెవ్వరికిని దెలియనివిధమున నెక్కడికోపోయెను. ఆ రాజకుమారుని వెదకుటకునై తక్కినవారాయాదిక్కులఁబట్టి పోయిరి. కొంత కాలమునకుఁ జిత్రముగా వారొక్కొక్కరు రాజవాహనుఁడున్న తావునకుఁ జేరుదురు. రాజవాహనుండడుగ వారు తమతమ గాథలను జెప్పుదురు. ఇది మంత్రగుప్తుని వృత్తాంతము.

౨ కళింగపురము = తూర్పు సముద్రతీరమునఁగల కళింగపట్టణము. ఇది ప్రసిద్ధమైన యోడరేవు.

ప్రేతవనము = శ్మశానము.

౩ తొడరి = యత్నించి, తొడరు (నానా) కలుగు, సక్తమగు, తొట్రుపడు, ఎదరించు, అనుకరించు.

౫ వేల్మిచందము = హోమముచేయు విధానము (రూ) వేలిమి.

౬ పల్ల శరీరము = కపిలవర్ణమగు దేహము; భసిత పాండులలాటము, = భస్మము పూయుటచేఁ దెల్లనైన నుదురు.

౭ నిటలతటమునఁ = నెన్నుదిపై; కింకరుఁడు = సేవకుఁడు.

౮ సముజ్జృంభత్కృపాహీనతఁ = పెరిగిపోవుచున్న నిర్దయతో; ఆ జటిలుఁ = ఆ తాపసిని (వ్యు) జటలుకలవాఁడు.

౧౦ కీడ్పడి = తక్కువపడి (రూ) కీడుపడి, నీచతనొందియని భావము.

నృశంసపటంబుగ = క్రూరతయను యవనికను; కిల్బిషవంతునకు = పాపునకు (అర్థాంతరన్యాసము).

౧౧ ఇడుమఁబడి = ఆపదనొంది.

౧౩ గళితాశ్రులగ = జాలువాఱు కన్నీటితో; వక్త్రము = మోము; తోఁగగ = తడియఁగా; పొచ్చెము = న్యూనత, కపటము.

౧౪ ఏడుగడ = ఏడువిధములైన రక్షకము (ఏడు + కడ) ఈ యేడువిధములైన రక్షకము లీ క్రింది పద్యమునఁ జూపఁబడినవి.

క. గురుఁడును, దల్లియుఁ దండ్రియుఁ,
బురుషుఁడు, విద్యయును, దైవమును, దాతయునాఁ
బొరి నేడుగడయుఁ దానై
హరి నను రక్షించుఁగాత ననవరతంబుగ.

౧౫ పరిచారికలు = దాసీలు; ఇమ్ములగ = సుఖముగా, ఇమ్ము (నానా) స్థానము, విరివి, ఇంపు, ఉపాయము.

౧౯ డాయంబోయి = సమీపించి; కేళీ మజ్జన భోజనాది విధులు = విహారము, స్నానము, భోజనము మొదలైన వ్యాపారములు.

౨౦ పయోధి వేలావన భూమికిగ = సముద్రతీరస్థలికి.

౨౧ ఆంధ్ర దేశాధీశుఁడు = గోదావరి యుత్తరపు టెల్లగా నాంధ్రదేశమును బరిపాలించినవాఁడు.

జయసింహుఁడు : ఇతఁడు చారిత్రిక పురుషుఁడు. వేఁగి రాజధానిగా నాంధ్రదేశము నేలిన చాళుక్యవంశ రాజన్యుఁడు. ఈ రాజశేఖరుఁడు క్రీ. శ. ౬౩౩ మొదలు ౬౬౩ వఱకు రాజ్యము నేలెనని చరిత్రవేత్తలు తలంచుచున్నారు. కళింగరాజులకు, చాళుక్యులకు ఆనాఁడు పరస్పర జిగీషతో, యుద్ధములు జరుగుచున్నట్లు మంత్రగుప్తుని కథవలనఁ దెలియుచున్నది.

ప్రస్తుత కథాభాగమునందీ జయసింహమహారాజు స్త్రీవ్యసన దోషదూషితుఁడుగాఁ జిత్రింపఁబడినాఁడు. ఈ వృత్తాంతమున నెంతఱకు యథార్థమో, యెంత కల్పితమో చెప్పలేము. చారిత్రికముగఁ బరిశీలించినచో ఈమహారాజు ధర్మనిష్ఠ గలవాఁడయి, ప్రజారంజకుఁడై పరిపాలించినట్లు తెలియవచ్చును. ఈ ప్రభువు దానశాసనములలో పరమభాగవతుఁడనియు, అనేక శాస్త్రార్థ తత్త్వజ్ఞుఁడనియుఁ సర్వసిద్ధియనియుఁ బ్రశంసింపఁబడి యున్నాఁడు. ఈ రాజన్యుఁడు పండిత

ప్రియుఁడై యున్నట్లును. గొప్ప విద్యాభిమానియై యున్నట్లును దెలియుచున్నది. ఘటికాస్థానము లనఁబడు గ్రామవిశ్వవిద్యాలయములకు జయసింహవల్లభుఁ డెన్నియో దానములు చేసెను. ఈ మహారాజును గుఱించి స్మరింపఁదగిన మఱి యొక ముఖ్యాంశమిది. ఆంధ్రభాషలో వ్రాయఁబడిన మొట్టమొదటి శాసనము ఈ జయసింహుని కాలమునందే వెలువడినది. దీనిని విప్పర్ల శాసనమందురు. ఆ యీ సందర్భములనుబట్టి యీ మహారాజు నిష్కళంకుఁడనియు, ధార్మికుఁడనియుఁ దోఁచుచున్నది.

ప్రతిభటుఁడు = పగవాఁడు: రంధ్రము = అవకాశము, సందు; వివిధ యానపాత్రములు = పలుతీరుల యోడలు; మోహరములు = వ్యూహములు; కలము = ఓడ.

౨౯ అగపడినన్ = అధీనముకాఁగా (అగ్గము + పడు) (నానా) కనఁబడు.

౩౦ మనశ్శుద్ధిగాఁగ నెఱిఁగిన క్రొత్త = నేనొక్కఁడనే యెఱిఁగిన క్రొత్త సంగతి, నేను దెల్లముగా దెలిసికొనిన క్రొత్త వార్తయనిగాని భావము.

౩౧ బ్రహ్మరాక్షసుఁడు = మరణించి ప్రేతమై తిరుగాడు బ్రాహ్మణుఁడు.

౩౨ కల్పములు = ఆయావ్రతములు, కర్మములు చేయఁదగు విధానమును జెప్పు శాస్త్రములు.

౩౩ కనుకలి = చూపు, కనుకలివంతన్ అనఁగా ఆ కనకరేఖను జూచినప్పటినుండి కలిగిన బాధ.

౩౬ జియ్యన్ = తాపసిని.

ఒక్క కొలనికడన్ = ఒక సరస్సుచెంత.

**సూచన:**— ఇక్కడ సూచితమైన కొలను వేఁగినగరమునకు సమీపమున నున్న సువిశాలము, సుప్రసిద్ధమునైన కొల్లేఱు. ఇది నేటి పశ్చిమగోదావరి మండలమున ఏలూరికి సమీపమున నున్నది.

౩౮ నైష్ఠిక భావనన్ = ధర్మాదులయందలి శ్రద్ధా భావముతో; నిష్ఠ = ధర్మాదుల యందలి శ్రద్ధ, అదిగలవాఁడు నైష్ఠికుఁడు అని వ్యుత్పత్తి.

ధర్మిష్ఠాదిష్ఠుఁడు = ధార్మిక శ్రేష్ఠుఁడు.

౪౦ త్రిక్కొనన్ = తిరస్కరించిన.

౪౧ సమలోష్ట కాంచనత్వంబున్ = మంటి పెల్లయు బంగారము సమమను భావము, (స్థిత ప్రజ్ఞ లక్షణము); బేలువడి = మోసపోయి (బేలు = మోసము).

౪౪ బహుగుణభ్రాజిష్ణులన్ = పెక్కు మంచిగుణములతోఁ బ్రకాశించువారిని.

౪౬ ఉజ్జగించి = విడచి.

౪౭ మెయికొనదు = సమ్మతింపదు; మెయికొను = (నా) కలుగు, అనుకూలించు.

౪౮ వెజ్జులన్ = వైద్యులను (ప్రి) వైద్యుఁడు. (వి) వెజ్జు. వేవురన్ = వేయి మందిని. (రూ) వేగురు.

చోపనేరక = పోఁద్రోలలేక, చోపు = (నా) కలఁచు, తరుము.

౫౦ దర్వీకర...చేయించి = (దర్వీకర) పాములు, (మకర) పెద్ద సొరచేపలు, (గ్రాహ) మొసళ్ళు మొదలైన చెడ్డ జలచరములను దొలగింపఁజేసి (ప్రి. వి.) మకరగ్రాహ శబ్దములు పర్యాయపదములుగా ప్రయోగింపఁబడుట గలదు.

కరదీపిక = చేదివిటి; ఊర్పు = ఊపిరి.

౫౧ పొడఁజూపి = కనఁబడి; అంతటఁగోలె = అప్పటినుండి.

౫౨ ప్రెగ్గడలతో = మంత్రులతో.

౫౫ జిలిబిలి = చిన్న; పురుషార్థములు = పురుషుఁడు సాధింపవలసిన ప్రయోజనములు. ఇవి నాలుగు: ౧ ధర్మము, ౨ అర్థము, ౩ కామము, ౪ మోక్షము.

గ్రామైకరాత్రింబై = ఒక యూరిలో నొకరేయి మాత్రమే యుండు తీరుగలదై.

౫౬ మదీయ శిష్యులులోనుగ = నా శిష్యులు మొదలుగా నందఱిని.

౫౭ ఉపద్వారము = దిడ్డి (చిన్న వాకిలి); గవ్యూతి = రెండు క్రోసులు; కాడువఱచి = పాడుపెట్టి (పర్ణశాలను).

౫౮ పద్మషండంబునన్ = (కొలనిలో) తామరతీఁగెలయుఁబూవులయు గుంపులో; తిట్ట డరి = గట్టిగాఁబూని.

దానన్ = ఆబొక్కలో; దమ్మునన్ = బురదతో.

౬౧ అంతిపురి చామలు = అంతఃపురమందలి స్త్రీలు; పుయిలోట = భయము.

౬౨ సప్రత్యభిజ్ఞానంబులు = ఆయా గుర్తులతోఁ గూడినవి.

౬౪ వైహాళి = వాయుసేవనముకొఱకు దూరముగా నూరి వెలుపలికిఁబోవుట (రూ) వాహ్యాళి (స్వారిచేయుచు పోవుట).

౬౫ ఎలమితోడ = సంతోషముతో.

౬౬ ఆత్మరాజ్య విస్తారకుఁగా = తన రాజ్యము తనకుఁ దిరిగ లభించినందున సమృద్ధుఁడైన వానిఁగా.

౬౮ సాధక క్రూరకర్మ కౌశలంబును = (కనకరేఖను హేమాగ్నిలో ద్రోసి సిద్ధి నొందఁజూచు) తాపసినే యగ్నిలోఁ ద్రోయుటయను క్రూరకర్మయందుఁ జూపిననేర్పు.

# ౩. భాస్కర రామాయణము

## విభీషణు శరణాగతి

అవతారిక:— శ్రీరామచంద్రుఁడు సుగ్రీవాంగద హనుమజ్జాంబవదాది మహావీరులును, తమ్ముఁడు లక్ష్మణుఁడును కపిసేనలను తరలించుకొని రాఁగా దక్షిణ సముద్ర తీరమునకుఁ జేరెను. సముద్రమును దాఁటి లంకను ముట్టడించి రావణునిఁజంపి సీతాదేవి చెఱవిడిపింప నాయతపడుచుండెను. ఆ రాఘవేంద్రుఁడట్లు దండెత్తి వచ్చిన సంగతి రావణుఁడు తెలిసికొని మంత్రులతోఁ గర్తవ్యము నాలోచించుచున్నాఁడు.

౧ వాసవారాతి = ఇంద్రునికి శత్రువైనవాఁడు (రావణాసురుఁడు)

౨ నిశాటకోటిన్ = రాక్షస సమూహమును (వ్యు) నిశ + అట = నిశాటులు (రాత్రించరులు)

హరిసేనతో = కోఁతులసేనతో, హరి = (నానా) విష్ణువు, ఇంద్రుఁడు, సూర్యుఁడు, యముఁడు, సింహము, పాము, గుఱ్ఱము.

౩ మకరాలయము = సముద్రము.

౪ కడాకమున్న = దాఁటకమునుపే; అళుకు = భయము.

౫ ఖడ్గరోచులు = కత్తితళతళలు; భీకరభ్రుకుటి = భయంకరమైన బొమముడి. (రూపకము-ఉత్ప్రేక్ష)

౬ మయుఁడు........నీ పట్టంపుదేవిఁజేసి.

గాథ:— మయుఁడు కశ్యపుని కుమారుఁడు. ఈతఁడు మేటి శిల్పాచార్యుఁడు. ఈతని భార్య హేమ. వీరికి మాయావి, దుందుభియను పుత్రులును, మండోదరి యను పుత్రికయుఁ గల్గిరి. ఒకప్పుడు మండోదరి తండ్రితో నరణ్యమునఁబోవుచుండగా మున్నె యటకు వేటాడ వచ్చియున్న రావణుఁడా సుందరాంగినిఁ జూచి మోహించెను. తాను లంకేశ్వరుఁడననియు, నింకను వివాహము కాలేదనియు, నాతఁడు మయునకెఱింగించెను. ఇంగితజ్ఞుఁడగు మయుఁడు ప్రఖ్యాతములైన రావణుని పరాక్రమాదులు వినినవాఁడౌట సంతసించి తన కూఁతునిచ్చి పెండ్లిచేసెను. మండోదరి మహాపతివ్రతలలో నొక్కతెయని వాసి గాంచినది.

కౌంభీనసేయాదిదానవులు = కుంభీనసపుత్రుఁడైన లవణుఁడు మొదలైన రాక్షసులు; కుంభీనస = రావణుని చెల్లెలు.

౯ మేఘనాథుఁడు = ఇంద్రజిత్తు; జంభారి = ఇంద్రుఁడు.

౧౦ చిఱుముదుమే = చిన్నదుమే; నింగి = ఆకాశము

౧౧ అనీకము = సేన.

హస్తిమశకాంతరము = ఏనుఁగునకును దోమకునుగల భేదము.

౧౨ పొరిగొనియెదను = చంపెదను

వానరులున్ గీనరులున్—నరుల్ గిరుల్ (వ్యా) అనాదరార్థమున నామ్రేడితమందు గికారము వచ్చును. (అతిశయోక్తి-వృత్త్యనుప్రాసము)

౧౩ కైదువులు = ఆయుధములు; కొంసరినక = అతిశయింపఁగా

౧౪ దుశ్చారిణి = చెడునడవడిగలది; మడిసెన్ = చచ్చెను; వైదేహిన్ = సీతను.

౧౬ అయ్యగచరుఁడు = ఆ కోఁతి (హనుమంతుఁడు)

౧౭ విజిగీషుఁడు = జయింపఁగోరికగలవాఁడు

౧౯ ఏచి = విజృంభించి; ప్రస్ఫీతోగ్రకీలానురుత్ప్రేక్షంబైన = మిక్కిలి విజృంభణను గలిగినవియు, భయంకరములైనవియునగు జ్వాలలచేతఁ జూడనలవికానిదియైన.

౨౦ సరీసృపములు = పాములు; డిల్లంబులై = సత్వహీనములై; వికిరణోద్దామంబు = ఖండములుగాఁ దెగినట్టున్న వెండ్రుకలు గలయుట; గవంకులన్ = ద్వారములందు; ఉడుప్ప = నక్కలు; మహోత్పాతంబులు = గొప్ప యపశకునములు.

ఉత్పాతము:—దివ్యము, అంతరిక్షము, భౌమము అని మూఁడు విధములుగా నుండును. దివ్యోత్పాతము = అపూర్వములగు నక్షత్రాదులు పుట్టుట. అంతరిక్షోత్పాతము = పరివేషము, ఇంద్రధనుస్సు, పిడుగులుపడుట మొదలైనవి. భౌమము = భూమి కంపించుట, స్థిరవస్తువులు కలుగుట. ఈ యుత్పాతములు రాఁబోవు దుఃఖరోగాదులకు సూచకములు.

౨౨ చక్కటి = న్యాయము. (నానా) స్థానము, దిక్కు, సరి, ఆర్జవము.

౨౭ రాఘవ......శిలీముఖాగ్నిన్ = శ్రీరామలక్ష్మణుల విండ్లనుండి విడువఁబడినట్టివియు, పిడుగుమొత్తములవలె గట్టివియునగు బాణములనెడి యగ్నిలో.

౩౦ ముడుంగుదురు = తగ్గిపోవుదురు. (ఉపమాలంకారము)

౩౧ ఎఱుకలేక = జ్ఞానము లేక (దృష్టాంతము)

౩౯ నలువ = బ్రహ్మ, (వ్యా) నాలుగు + వా; వృత్తిలో నలు ఆదేశము

౪౦ గుహాంతరంబున......బోలెవచ్చుచున్నారు. (ఉపమ)

౪౧ రజ్జులు = వ్యర్థభాషణములు.

౪౪ ఆదిత్యాత్మనూభవుఁడు = సుగ్రీవుఁడు, వానరము = కోఁతి (అతిశయోక్తి)

౪౫ యాతుధానులు = రాక్షసులు

౫౩ నారాచము = బాణము.

లంకాచర యామినీచరులన్ = లంకలోఁదిరుగు రాక్షసులను

(యామిని = రాత్రి)

౫౮ ఎఱవైనయట్లు = వేఁడైనట్లు

గజస్నానము = ప్రయోజనము లేనిది. ఏనుఁగు స్నానముచేసిన వెంటనే తిరిగి తొండముతో మన్నెత్తి పైనిబోసికొనును. కనుక అదిచేసిన స్నానమునకు ప్రయోజనము లేదు.

౬౧ సన్నపుఁగార్యములు = నీచపుపనులు

౬౨ జ్యాఘోషము = అల్లెత్రాటిమ్రోఁత; దంభోళి = వజ్రాయుధము.
తరఁగలై = అలలై. ఆవృత్తి (ఆవర్తము) = సుడి (సర్వావయవ రూపకము)

౬౩ వికీర్ణంపుమెఱుగునట్లు = నలుదిక్కులకుఁ జెదఱిన మెఱుపువలె పలుదిక్కులకుఁ జెదరెడి మెఱుపు మేఘములుతొలఁగి నశించుననుటకు సూచకమందురు. (ఉపమాలంకారము)

౬౫ అసమానవైరము = సాటిగానివానితోఁబగ; 'వివాదముగాని,వివాహముగాని సాటివారితోనే శోభిల్లును'—అని న్యాయముగలదు.

౬౭ మేచకమేఘము = కాఱుమబ్బు; వాలు = ఆయుధము (కత్తి)
(ఉపమాలంకారము)

౭౦ నిలింపారాతి = దేవతలకు శత్రువు (రావణాసురుఁడు)

౭౧ వేయును = వేయిమాటలును

౭౪ అనిశాచరలోకము = రాక్షస సమూహము లేనిది

౪౫ కౌక్షేయకము = కత్తి; ఉల్కాతతుల్ = కొఱవులగుంపు

౪౬ పనివినిరొద = పోరొదను; పదిలించి = దృఢపఱచుకొని

౪౭ దోషాచరవంశము = రాక్షసకులము. (దోష = రాత్రి)

౭౦ నక్తంచరపంచకము = అయిదుగురు రాక్షసులు; కరాళోదగ్ర.........ప్రకరంబు = భయంకరమైనట్టివియు, పైకెత్తఁబడినట్టివియునగు నాయుధముల కాంతి సమూహము.

౭౩ భర్త్సించుచు = బెదరించుచు

౭౪ ప్లవంగపుంగవులన్ = వానరశ్రేష్ఠులను

౮౦ అవ్వటుచూడామణిన్ = ఆ బ్రహ్మచారి శ్రేష్ఠుని (ఆంజనేయుని)

౮౬ వాలుమగండు = మహాశూరుఁడు

౮౪ లోకాలోకము = ఆపేరిటి కులపర్వతము
దర్వీకరలోకము = పాతాళలోకము

౧౦౦ సౌమిత్రి = లక్ష్మణుఁడు (వ్యు) సుమిత్ర పుత్త్రుఁడు.

---

# కవి జీవితములు

## ౧. శ్రీ నన్నయభట్టారకుఁడు

### (క్రీ. శ. ౧౧ శతాబ్దము)

ఆంధ్రవాఙ్మయ ప్రపంచమునకు శ్రీనన్నయభట్టారకుఁడు సృష్టికర్త. ఈమహాకవి క్రీ. శ. ౧౦౨౨-౧౦౬౩ వఱకును రాజమహేంద్రవరపురము రాజధానిగా వేంగీదేశమును బరిపాలించిన తూర్పుచాళుక్య రాజవంశీయుఁడగు రాజరాజ నరేంద్రుని యాస్థానము నలంకరించెను. ఈమహనీయుఁడు వేదవేత్త. బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాననిరతుఁడు, ఉభయభాషా కావ్యరచనాభిశోభితుఁడు, మర్యాపరాధిపాచార్యుఁడు, నిత్యసత్యవచనుఁడు, అవిరళ జపహోమతత్పరుఁడు. ఆపస్తంభసూత్రుఁడు, ముద్గగోత్రజాతుఁడగు వైదిక బ్రాహ్మణోత్తముఁడు. ఆంధ్ర భాషలో గ్రంథరచనము జరుగక తెలుఁగువారు 'గానటబీసటే' చదివి గాథలుత్రవ్వు దుస్థితిలో నుండఁగాఁ బ్రజారంజకుఁడగు రాజరాజ నరేంద్రుని ప్రోత్సాహమువలన నీవిద్యాదగ్రేసరుఁడు సకల ధర్మములకుఁ గాణాచియు, భారతీయ సంస్కృతికి దర్పణమునయి పంచమవేదమని ప్రఖ్యాతిగాంచి సంస్కృత భాషలో శ్రీ వ్యాసమహర్షిచే రచింపఁబడిన మహాభారతమును ప్రజల భాషయగు తెలుఁగులోనికిఁ దన్నిరూపితార్థమేర్పడునట్లు ననువదింప దీక్షఁబూనెను. ఆది సభాపర్వములును, అరణ్యపర్వమునం గొంతభాగమును మాత్రము రచించెను. అంతటితో నీ కవీశ్వరుని రచన మాగిపోయెను. పిమ్మటఁ గొంతకాలమునకు తిక్కన గ్రంథములో పదునైదు పర్వములను శ్రీ తిక్కన సోమయాజి రచించెను. అరణ్యపర్వశేషమును శ్రీ ఎఱ్ఱాప్రగడ పూర్తి చేసెను. ఈ విధముగా ఆంధ్రమహాభారతము ముగ్గురు మహాకవులచేఁ బూర్తిగావింపఁబడెను. వీరికే 'కవిత్రయ'మనిపేరు. శ్రీ నన్నయభట్టారకుఁడాదికవి.

ఆంధ్రమహాభారతము మిక్కిలి రసవంతమైన గ్రంథము. 'తింటే గారెలు తినవలెను, వింటే భారతమువినవలె'నని లోకోక్తి గలదుగదా! శ్రీనన్నయభట్టారకుని కవితయనర్గళధారావేగముగలిగి గంగాప్రవాహమువలె గంభీరముగా నుండును. ఈతఁడు కథారచనమునను, ప్రకృతివర్ణనమునను గడుదిట్ట. దీర్ఘవర్ణనము లీతనికి గిట్టవు. ఎందును ననౌచిత్యమునకుఁ దావీయఁడు. 'సారమతుల్ ప్రసన్నకథా కలితార్థయుక్తిలో నారసి మేలునా, నితరు లక్షరరమ్యత నాదరింపఁ దెలుంగునన్ మహాభారత సంహితారచనబంధురుఁడ నయ్యెద'నని తాఁజేసిన ప్రతినను సమర్థతతోఁ బరిపాలించి యాంధ్రుల మన్ననలుగన్న మహనీయుఁడు శ్రీ నన్నపార్యుఁడు.

ఈ మహాకవీశ్వరునకు 'వాగనుశాసనుఁ'డను బిరుదము గలదు. ఆంధ్రభాషను సంస్కరించి యుత్తమగ్రంథ రచనమున కనుకూలపడునట్లుగాఁ దీర్చి దిద్దినందున నీ మహాకవి వాగనుశాసన బిరుదాంకితుఁడగుట సహజమేకదా. 'ఆంధ్రశబ్ద చింతామణి' యను వ్యాకరణ గ్రంథమును వ్రాసినవాఁడును నీతఁడే యని కొందఱి యభిప్రాయము. ఆ వ్యాకరణ గ్రంథము నన్నయభట్టీయము కాదని విమర్శకులు నిరూపించుచున్నారు. భారత రణరంగమున నర్జునునకు నారాయణునట్లు భారత సంహితా రచనమునఁ దనకు 'నారాయణభట్టు' అను నెచ్చెలి వాఙ్మయధురంధరుఁడు తోడ్పడెనని నన్నపార్యుఁడు చెప్పికొనెను. నన్నయ శీలసంపదకిది గీటురాయి. రాజరాజనరేంద్రునిచే నారాయణభట్టునకు నందంపూడి యగ్రహారముగా నీయఁబడెను. సంస్కృతములోనున్న యీ నందంపూడి శాసనకర్త నన్నయభట్టారకుఁడే.

## ౨. శ్రీ కేతనకవి

(క్రీ. శ. ౧౩ వ శతాబ్దము)

ఈ కవీశ్వరుని దొలుత వేంగిదేశములోని వెంటిరాల యను నగ్రహారము. పిమ్మట శ్రీతిక్కనసోమయాజికి శిష్యుఁడై విద్యాభ్యాసమునకై నెల్లూరికిఁ జేరెను. ఈతని యింటిపేరు మూలఘటికవారు. తండ్రి నూరయ, తల్లి సంకమాంబ. ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు. కౌండిన్య గోత్రుఁడు. క్రీ. శ. ౧౨౫౦ ప్రాంతమున నున్నవాఁడు.

కేతనకవి సంస్కృతాద్యనేక భాషాకావ్యరచనా విశారదుఁడు; మేటిలాక్షణికుఁడు. ఈతఁడు దశకుమార చరిత్రము, ఆంధ్రభాషాభూషణము, విజ్ఞానేశ్వరము అను మూఁడు కృతులను రచించి వాసికెక్కెను. దశకుమారచరిత్రము దండిమహాకవి రచించిన దశకుమార చరిత్రమను సంస్కృతవచన కావ్యమునకు స్వతంత్రపద్యాత్మకమైన యనువాదము. ఇది పండ్రెండాశ్వాసములుగల మహాకావ్యము. దీనిని సుప్రసిద్ధమహాకవియు, తనకు గురువర్యుఁడునగు తిక్కన సోమయాజికి కేతన భక్తిపూర్వకముగా నంకితముచేసి ధన్యుఁడయ్యెను. కృతికర్తయే గాక ఒకమహాకవి కృతిభర్తయు నగుట యపూర్వ సన్నివేశము. కవితలోని లోతుపాతులు దెలియని రాజులకు కృతులిచ్చి మెప్పించి మన్ననలొందుట విశేషము కాదు. విరాటపర్వమాదిగా పదునేనుపర్వము లసాధారణ శేముషీ విశేషము మెఱయ భారతమును రచించి కవిలోక భాస్కరుఁడై వెలింగిన కావ్యకళాతత్త్వజ్ఞుఁడగు తిక్కనార్యుని మెప్పించు కవిత వ్రాయుటకెట్టి పాండిత్యము కావలెను! ఎట్టినేర్పు కావలెను! కేతన తనచేవ గట్టిగా నెఱింగినవాఁడు కావుననే-

'కవితఁజెప్పి యుభయకవిమిత్రు మెప్పింప
నరిది బ్రహ్మకైన నతఁడు మెచ్చఁ
బరగ దశకుమార చరితంబు చెప్పిన
ప్రోడ నన్నువేఱె పొగడనేల'

అని ధీరుఁడై చెప్పికొన్నాఁడు. దశకుమార చరిత్రములోఁ బదికిని కథలు గలవు. ఆ కాలపు టాచారములు, వినోదములు, సాహసచర్యలు మొదలగు వివిధాంశము లిందు సముచితముగా వర్ణితములైనవి. ఆంధ్రచరిత్రకు సంబంధించిన యంశములు కొన్ని మంత్రి గుప్తుని చరిత్రములోని జయసింహుని గాథవలనఁ దెలియనగును.

కేతన యితరకృతులలో ఆంధ్రభాషాభూషణము ప్రసిద్ధమైనది. అది యాంధ్ర లక్షణగ్రంథములలో మొదటిది. ఆతని మూఁడవకృతి యగు విజ్ఞానేశ్వరము ధర్మశాస్త్రము.

## ౩. భాస్కరరామాయణ కవులు

## (క్రీ. శ. ౧౩-౧౪ శతాబ్దముల నడుమ)

హుళక్కి భాస్కరుఁడు, మల్లికార్జునభట్టు, కుమారరుద్రదేవుఁడు, అయ్యలార్యుఁడు నను నలుగురు కవీశ్వరు లున్నాడిగా రామాయణమును రచించిరి. వీరిలో ముఖ్యుఁడు హుళక్కి భాస్కరకవి. కావుననే దీనికి భాస్కరరామాయణమని పేరు వచ్చినది. భాస్కరకవి తానొక్కఁడే సంపూర్ణముగా రామాయణమును రచింపఁగల సమర్థుఁడయ్యును తనకుమారుఁడగు మల్లికార్జునభట్టునకును, శిష్యులగు రుద్రదేవాదులకును ప్రోత్సాహకముగానుండునని వారిచేఁగూడ కొన్నికాండములు రచింపఁజేసెను. బాల కిష్కింధా సుందరకాండములను మల్లికార్జునభట్టును, అయోధ్యాకాండమును రుద్రదేవుఁడును, అరణ్యకాండమును, యుద్ధకాండములోఁ గొంత భాగమును భాస్కరుండును, యుద్ధకాండశేషమును అయ్యలార్యుఁడును రచించిరి. ఈకవులు క్రీ. శ. పదుమూఁడవశతాబ్దాంతమునను, పదునాలుగవ శతాబ్దాదియందును నుండినవారు. వీరు ఓరుగంటి ప్రాంతమువారు.

భాస్కర రామాయణము భారత భాగవతములవలె ప్రజాహృదయముల కెక్కిన గ్రంథరాజము. దీనికి మూలము వాల్మీకి రామాయణము. మొత్తముమీఁద వీరిరచన ఓజోగుణ ప్రధానమును, తత్సమపద బహుళము, రసవంతమునై కర్ణరసాయనముగా నుండును. ఈగ్రంథము సాహిణిమారున కంకితము చేయఁబడినది. సాహిణిమారుఁడు కాకతీయ చక్రవర్తియగు ప్రతాపరుద్రునికడ అశ్వ సైన్యాధ్యక్షుఁడుగా నుండిన యాంధ్రవీరాగ్రేసరుఁడు. ఆంధ్రవాఙ్మయము నాదరించిన రసికుఁడు.

## ౪. శ్రీ కందుకూరి వీరేశలింగము

### (జ. క్రీ. శ. ౧౬-౪-౧౮౪౮ — మ. ౨౭-౫-౧౯౧౯)

వీరు రాజమహేంద్రవర వాస్తవ్యులు. ఆరువేల నియోగి బ్రాహ్మణశాఖకుఁ జెందినవారు.

వీరుగావించిన వాఙ్మయసేవ యపారము. సారస్వతరంగములో వీరెన్నియో క్రొత్త త్రోవలను ద్రొక్కిరి. ఆధునిక వాఙ్మయ కర్తలకు మార్గదర్శకులైరి కావుననే వీరిని నూతనయుగపురుషులని లోకము సంభావించినది. వీరు కథలు వ్రాసినారు, కావ్యములు రచించినారు, నాటకముల ననువదించినారు, చరిత్రలు ప్రకటించినారు, విమర్శలు గురిపించినారు, నవలలు వెలయించినారు, పత్త్రికలు సంపాదించినారు. వీరు శతాధిక గ్రంథకర్తలు. వీరిరచనలలో మాళవికాగ్ని మిత్రము, అభిజ్ఞాన శాకుంతలము, రత్నావళి, దక్షిణగోగ్రహణము మొదలైన నాటకములును, రాజశేఖర చరిత్ర, రాగమంజరి, సత్యరాజ పూర్వదేశ యాత్రలు మున్నగు కథాగ్రంథములును, ఆంధ్రకవుల చరిత్ర, స్వీయచరిత్రలును, నీతిచంద్రికలోని సంధి విగ్రహములును మిక్కిలి ప్రసిద్ధములైనవి. ఇవిగాక హాస్యప్రధానములగు నెన్నియో ప్రహసనములును గలవు. ఆంధ్రవాఙ్మయోద్ధరణమునను మహిళోద్ధరణమునను అసాధారణ సేవగావించి వీరు మహాయశము నార్జించిరి. వీరేశలింగ కవికి 'గద్యతిక్కన' యను బిరుదుగలదు.

## ౫. శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు

### (జ. ౧౮౬౫- మ. ౧౯౪౦)

ఆధునిక వాఙ్మయ మహానిర్మాతలలో పానుగంటి లక్ష్మీనరసింహారావుగారొకరు. వీరివాసస్థానము పిఠాపురము. వీరు ద్వైతమతానుయాయులు. స్వతంత్ర రచనలమీఁదనే వీరికిఁబ్రీతిమెండు పానుగంటివారి ప్రతిభ సర్వతోముఖమైనది. లేఖిని సునిశితమైనది. ధోరణి గంగావాహినివంటిది. భాష వ్యావహారికమునకు దగ్గఱగానుండు గ్రాంధికము. వీరు పెక్కు నాటకములను వ్రాసిరి. వీనిలో రాధాకృష్ణ, కల్యాణరాఘవము, కంఠాభరణము, విప్రనారాయణచరిత్ర, బుద్ధబోధసుధ, ప్రచండ చాణక్యము సుప్రసిద్ధములు. హాస్యవల్లరి, పతనము, మంజువాణి, జలజ మొదలైన యితరగ్రంథములును గలవు. వీరిరచనలన్నియు నొకయెత్తు, వీరిసాక్షిసంపుటములొకయెత్తు. సాక్షివలననే పానుగంటికవి యాంధ్రరచయితలలో అమరకీర్తిగడించి నాఁడనిచెప్పవలెను. ఈయన సృష్టించిన జంఘాలశాస్త్రి, వాణీదాసుఁడు కాలాచార్యుఁడు, బొజ్జయ్యసెట్టియను విచిత్ర వ్యక్తులను తెలుఁగువా

రెన్నఁడును మఱచిపోరు. సాక్షి తెలుఁగుజాతి కొక నిధి. సంఘము, వాఙ్మయము, రాజకీయము, మతములలోని లోపములను ఎత్తిపొడుచుచు నొప్పి యనిపింపకుండ గిలిగింత పెట్టినట్లు నవ్వించుచు నీమహనీయుఁడు 'సాక్షి' ద్వారమున తెలుఁగుజాతి కెంతయో సేవచేసినాఁడు. ఆఱు సంపుటములలో వెలసిన సాక్షి వ్యాసములు ఆంధ్రభారతి కమూల్యాలంకారములనుటకుఁ దగినవి. చెప్పిన విషయమునే మార్చిమార్చి వ్యాంగ్యాంతర ముగాఁ జెప్పుట వీరి ప్రత్యేకత. చదివినకొలఁదియు నుత్సాహము గలిగించు నపూర్వశక్తి పానుగంటికవిది. హాస్యరసము వీరిసొమ్ము. వీరి లోకజ్ఞాన మసామాన్యము.

## ౬. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము

(జ. ౧౮౬౭- మ. ౧౯౪౬)

వీరి నివాసము మహాకవుల కావాసమగు రాజమహేంద్రవరము. చిలకమర్తి కవి ప్రజ్ఞాచక్షువు. ఆయన రచించిన గ్రంథములు తొంబదికి మించియున్నవి. రఘుకుల చరిత్ర, స్వప్నవాసవదత్త, సౌందర్యతిలక, హేమలత, భారతకథామంజరి, కృష్ణవేణి, సుధాశరచ్చంద్రము, అహల్యాబాయి, ప్రసన్నయాదవము, పారిజాతాపహరణము, మణిమంజరి, నానకుచరిత్ర, కర్పూరమంజరి, గయోపాఖ్యానము, గణపతి, మహాపురుషుల జీవితములు, రామచంద్ర విజయము, రాజస్థాన కథావళి, స్వీయచరిత్రములు వీరి గ్రంథములలోఁ బేర్కొనఁదగినవి. చిలకమర్తివారి రచన లన్నింటిలోను గయోపాఖ్యాన నాటకము మిక్కిలి ప్రచారములో నున్నది.

చిలకమర్తికవి కవిత కడుంగడు మధురమైనది. ప్రసన్నమైన శైలి; వీరును హాస్యరస ప్రవీణులేయైనను దానిని ప్రమాణముమించివాడరు. వీరిది లలితహాస్యము; వీరు అంధులయినను సారస్వత వ్యవసాయమున కావంతయు నాటంకము లేకపోవుటకు వీరి ధారణా పటిమయే కారణమందురు. మహారచయితయై యఖండకావ్యకళామండలికి వేఁగుచుక్కగా వెలింగిన యీ కవిని ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు 'కళా ప్రపూర్ణ' బిరుద భూషితుని గావించిరి.

## ౭. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి

రెడ్డిగారిది చిత్తూరి చెంతనున్న కట్టమంచి జన్మస్థానము. పాకనాటిరెడ్డి శాఖకుఁ జెందినవారు. వీరిది విద్వత్కుటుంబము. క్రీ. శ. ౧౮౮౦ లో వీరు జన్మించిరి. చిన్నతనములోనే తండ్రిగారికడ భాగతాదులు పురాణము చదువుటతో రెడ్డిగారి హృదయ క్షేత్రమున సాహిత్యబీజములు వెదజల్లఁబడినవి. పాదరసమువంటి బుద్ధి, గట్టి శిక్షణ-ఇం

కేమి కావలెను. ఆంగ్లములో ఆదరము-ఆంధ్రములో అభిరుచి పరస్పర క్షోభ కారణములుగాక శోభకేహేతువులైనవి. ఆంగ్లదేశమునకేగి రెడ్డిగారు ఆంగ్లసారస్వతమున కూలంకష ప్రజ్ఞులైరి. ఆంగ్ల సారస్వతములోని నూతనవిమర్శన పద్ధతి రెడ్డిగారి కలవడినది. ఆంధ్రమహాభారతము, కళాపూర్ణోదయము రెడ్డిగారి హృదయమునకు హత్తుకొనిన గ్రంథరాజములు. తక్కినవానిలోఁ జాలవఱకు గతానుగతికముగా రచింపఁబడినవని వారి యాశయము. వీరి ముఖ్యముగురచన, కవిత్వతత్త్వ విచారము. దీనిలో వీరుకావ్య విమర్శన పద్ధతిని సోదాహరణముగాఁ జూపినారు. వీరి యితర కృతులు ముసలమ్మ మరణము, నవయామిని, వ్యాసమంజరి యనునవి.

రామలింగారెడ్డిగారు భారతీయ విద్యాధికులలో నాకరుగా సంభావింపఁబడిరి. ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్షులుగా రెడ్డిగారు గొప్ప సేవచేసినారు. మైసూరు ప్రభుత్వమువారిచే నూతన విద్యా ప్రణాళికను సిద్ధముచేసి యిచ్చుటకొఱకాహ్వానింపబడినారు. ఆంధ్రములోను, ఆంగ్లములోను మహావక్త యని వాసిగాంచినారు రెడ్డిగారు.

## డా. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

### (జ. ౧౮౯౧)

శర్మగారు నేఁటి చరిత్ర పరిశోధకులలో ప్రామాణికస్థానమలంకరించినవారు. ఆంధ్రచరిత్రకారులలో భాస్కరులై వెలుగొందిన కొమర్రాజు లక్ష్మణరావు, చిలుకూరి వీరభద్రరావుగారల నాదర్శముగాఁ జేసికొని శర్మగారు తమపరిశోధనలు సాగించిరి. చరిత్రకారునికి కావలసిన నిశితమైన చూపు, నిర్మలమైన మనస్సు, అచంచలమైన దీక్ష, సత్యజిజ్ఞాసయనునవి శర్మగారికి సహజప్రాప్తములు. లిపిశాస్త్రములోఁతు లెఱింగిన శర్మగారు సేకరించి ప్రకటించిన శాసనములు లెక్కకు మిక్కిలియున్నవి. ఈ పరిశోధకతల్లజుఁడు వ్రాసిన పరశ్శత చారిత్రక వ్యాసములు తెలుఁగు చరిత్రకు నూతన వికాసమును జేకూర్చినవి. బౌద్ధయుగపరిశీలనము సోమశేఖర శర్మగారికెఁ గొట్టినపిండి. ఆంధ్రచరిత్రలో 'రెడ్డియుగమును' గుఱించి వీరుచేసినకృషి యపారము. శాతవాహనులు, చాళుక్యులు, కళింగగాంగులు, కాకతీయులు నను నీ యాంధ్రరాజుల చరిత్రను మథించి యపూర్వ విషయరత్నములను వెలార్చి శర్మగా రాంధ్రులకు మహోపకారముచేసినారు. శర్మగారి వచనశైలి చక్కనిదియు, చిక్కనిదియునై యుండును. వీరు కొంతకాలము ఆంధ్రవిశ్వవిద్యాలయములో చరిత్ర పరిశోధకులుగా పనిచేసియున్నారు. వీరి గ్రంథములు ౧. ఆంధ్రవీరులు ౨. అమరావతి స్తూపము-ఇతర వ్యాసములు ౩. చారిత్రక వ్యాసములు ౪. ఆంధ్రదేశ చరిత్రసంగ్రహము ౫. రోహిణీ చంద్రగుప్తము మొదలైనవి. ఆంగ్ల గ్రంథములు :

1. Forgotten Chapter of Andhra Country. 2. History of the Reddy Kingdoms.

## ౯. శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

### (జ. ౧౮౯౩)

వీరి జన్మస్థానము అనంతపుర మండలములోని రాళ్ళపల్లి. వీరు శ్రీవైష్ణవ బ్రాహ్మణులు. రాళ్ళపల్లిలో పుట్టిన యీ జాతిరత్నము మైసూరు మహారాజాగారికోటలో సానలుదీఱి మెఱసినది. చిన్ననాటనే విద్యార్జనముకొఱకు శర్మగారు మైసూరుకేగి యచట పాఠశాలలో సంస్కృత ప్రాకృతవ్యాకరణములు అలంకార గ్రంథములు చదివిరి. పాండిత్యభూషితులైన పిమ్మట మైసూరులోనే ప్రభుత్వకళాశాలలో ఆచార్యపదవి నలంకరించిరి. సంగీతశాస్త్రమునను గొప్ప విద్వాంసులని ఖ్యాతిగాంచిరి. సంగీత సాహిత్యవిద్యలలో సమానపాండిత్య మలవడిన వారరుదు. శర్మగారిలోనే యట్టి యపూర్వ సన్నివేశము గనఁబడును.

వీరి రచనలలో : ౧. తారాదేవి ౨. మీరాదేవి యనునవి పద్యకావ్యములు. మిక్కిలి రసవంతములు. ౩. శాలివాహనగాథాసప్తశతి (ఆంధ్రానువాదము) లలితమైన శైలితో నలరారునట్టిది ౪. సారస్వతోపన్యాసములు ౫. నాటకోపన్యాసములు-విమర్శనాత్మకములు. ౬. వేమన ముఖ్యమైనవి. శర్మగారిపుడు తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యవిద్యా పరిశోధన సంస్థలో పరిశోధకులుగా బనిచేయుచున్నారు.

## ౧౦ శ్రీ సురవరము ప్రతాపరెడ్డి

### (జ. ౧౮౯౬)

ప్రతాపరెడ్డిగారి స్వగ్రామము 'ఇటికాలపాడు' రాయచూరు మండలములోనిది. విద్యాభ్యాసము కర్నూలులోను, హైదరాబాదులోను, మద్రాసులోను. మద్రాసు విశ్వవిద్యాలయ పట్టభద్రులు. న్యాయవాది పట్టమునుగూడ బడసినవారు. సంస్కృతమును గురుముఖమునఁ జదివిరి. వీరికి ఉరుదు, కొంత పారశీకముకూడ వచ్చును. మితభాషి, స్వతంత్రులు. జీవితమును స్వార్థమునకుఁగాక దేశహితాచరణమున కంకితమును గావించిన మహాత్యాగి. పదవీమోహితులైయుండిన పెద్దపెద్ద పదవులలంకరించియుందురు, ధనము పుష్కలముగా గడించియుందురు.

ఒకవైపు గ్రంథరచన, ఇంకొకవైపు పత్రికా నిర్వహణము-మఱియొకవైపు ఆంధ్రోద్యమ ప్రచారము. ఈ ముప్పేకల పోవలసినదే. విసుగులేదు. విరామములేదు. రెడ్డిగారు మిక్కిలి తొందఱలో గ్రంథములు వ్రాయఁగలరు. శైలికై ప్రాకులాడరు. తుపాకిగుండువలె చెప్పదలచినది సూటిగా తాకునట్లు చెప్పివేయుదురు. అదురులేదు. బెదురు

లేదు. వీరు పెక్కు గ్రంథములను రచించిరి. వీనిలో హిందువుల పండుగలు, రామాయణ విశేషములు, ఆంధ్రుల సాంఘిక చరిత్ర, ప్రజాధికారములు, యువజన విజ్ఞానము, తుకారాము, ఉచ్ఛల విషాదము, మొగలాయికథలు ముఖ్యమైనవి.

ఈయన గోలకొండపత్రికకు దాదాపుగా ౨౪ సంవత్సరములు సంపాదకులుగా నుండి తెలంగాణమున కెంతయో సేవగావించిరి. తెలంగాణా చైతన్యమునకు ముఖ్యసాధనమైన ఆంధ్రమహాసభకు మొదటి యధ్యక్షులు రెడ్డిగారే. రెడ్డిగారికి గ్రంథసేకరణమున ప్రత్యేకశ్రద్ధ. వారికడ మంచి గ్రంథాలయము గలదు. నేడు వారు హైదరాబాదు శాసనసభా సభ్యులైయున్నారు.

—